రేకు: 0251-1 దేసాక్షి సం: 09-001

పల్లవి: దగ్గరితె మొగచాటు దువ్వులు నుంటేఁ జవి
నిగ్గుల యీరెండూను నీవొళ్లనే కంటినే

చ. 1: చెలియ పతిఁ గానక చింతతో నుండి ఆతఁడే
పిలువఁగా యిప్పుడైతే బిగిసేవే
కలయ నంటా దూరి గక్కనఁ జెయి వట్టితే
మొలకనవ్వులతోడ ములిగేవే

చ. 2: అప్పుడైతే యెడమాట లాడించి నాయకుఁడు
తప్పక చూచితే నిట్టె తల వంచేవే
వుప్పతించి దూరఁగగానె వొద్దఁ గూచుండి నాతఁడు
పిప్పిగట్టే సిగ్గులతోఁ బెనఁగేవే

చ. 3: చిత్తములోఁ గోరినట్టి శ్రీవెంకటేశ్వరుఁడు
అత్తి నిన్నుఁ గూడితేనె అలసేవే
పొత్తుల మోవితేనెతీపుల సోకించె నితఁడు
బత్తి సేయఁగా నీవు భ్రమసేవే

రేకు: 0251-2 పాడి సం: 09-002

పల్లవి: ఏమే నేవచ్చి యిప్పుడెంత దడ వాయనే
దీమసపుదానవు నేఁ దెమలించఁ గలనా

చ. 1: నిక్కిచూచి నన్నాతఁడు నీవద్దికిఁ బెట్టిపంపె
యెక్కడ నున్నది చిత్తమే మంటివే
కక్కసించి యడిగితే కంట నీరు వెట్టేవు
యెక్కడ గెలవవచ్చు నిటువంటివారిని

చ. 2: వాకిటఁ దా నిలుచుండి వడి నాతో సన్నసేసి
యీాకడ నా కిఁక బుద్ధి యేమంటివే
పైకొని కొంగు వట్టితే బలిమి నుసు రనేవు
నీకు నీకే తెలుసునే నెరవాదితనము

చ. 3: యిదిగో శ్రీవెంకటేశుఁ డెచ్చరింపించి నాచేత
యెదుటనె పెనగొనీ నే మనేవే
పొదిగి కలసెఁ దానె పూఁచి నీవు నవ్వేవు
ముదమునఁ బను లెల్ల ముందువెన కాయనే

రేకు: 0251-3 భైరవి సం: 09-003

పల్లవి: ఏమి సేతు నాగుణ మీపాటిది
కామించి వీవుగాఁగాఁ గైకొనేవు గాని

చ. 1: ననుపు నటించఁగానె నంటు నీతో నైతిఁగాని
పెనఁగితేఁ గడుఁ గడు పెలుచ నేను
మనసు నమ్మించఁగానె మారుమాట లాడఁ గాని
ఘనమై మీరి వచ్చితె గబ్బిదాన నేను

చ. 2: సలిగె చెల్లించఁగానె సరుసమాడేఁ గాని
మలసితే నంతకంటె మంకను నేను
చలివాసి నవ్వఁగానె సంతోసించుకొంటిఁ గాని
సొలసి కపటమైతె జూటుదాన నేను

చ. 3: కైవసము గాఁగానె కరఁగి మెచ్చితిఁ గాని
మూవంకలు మెట్టితేనె మొక్కలి నేను
శ్రీవెంకటేశ నీవు చేరి కూడఁగానె కాని
సోవలుగా మొరఁగితే జూజరి నేను

రేకు: 0251-4 లలిత సం: 09-004

పల్లవి: ఆపెనందునో నిన్ను నందునో యీచేఁతలకు
యేపున వూరెల్లా పొందు లింతగాఁ జేసితివి

చ. 1: యిద్దర మేకతమాడె యీవేళ మనవద్ద
గుద్దిరాన నాపె వచ్చి కూచున్నది
దిద్దరాదా అప్పేమైనఁ దీసుకొంటేఁ గనక నీ
విద్దెస సతుల కస మింతగా నిచ్చితివి

చ. 2: లోనికేఁగి నీవు నేను లోలత నవ్వుచుండఁగా
తానువచ్చి నీకుఁబాదము లొత్తీని
సేనగా నియ్యఁగరాదా జీఁతము చిక్కితేఁగన
యీ నెపాన మందెమేళ మింతగాఁ జేసితివి

చ. 3: వోరిచి ముసుఁగు వెట్టు కొగి నిన్నుఁ గూడితేను
పేరున శ్రీవెంకటేశ పిలిచీ నాపె
యీరాదా ఆపె సొమ్ము లెత్తుక వచ్చితేఁగన
యీరీతి చనవు లిచ్చి యింతగాఁ బెంచితివి

రేకు: 0251-5 శ్రీరాగం సం: 09-005

పల్లవి: ఎవ్వరి నే మన లేవు యింతేసికి నోపము
పువ్వునఁ బుట్టినయట్టి పూఁపవంటివాఁడవు

చ. 1: మిక్కిలి నీతో నేను మేరలు మీరిన నైతే
యెక్కడ నెవ్వతె వచ్చి యేమనునో
దక్కితి సారెసారెకుఁ దడవకువయ్య మమ్ము
చిక్కి నీ వందరిపెట్టుఁ జెట్టువంటివాఁడవు

చ. 2: చెనకి నీ బుజముపై చెయి నేను వేసితేను
వనిత యెవ్వతె వచ్చి వంతు వట్టునో
పెనఁగి నీ వాడా నీడాఁ బిలువకువయ్య నన్ను
తనిసి సూదిపిరిఁది తాడువంటివాఁడవు

చ. 3: గుట్టున నిన్నుఁ గూడితి గోర నిన్ను నూఁదితేను
దిట్టయై యెవ్వతె వచ్చి తేరి చూచునో
పట్టి శ్రీ వెంకటేశ్వర భ్రమలఁ బెట్టకువయ్య
బట్టబయటిపెసరుఁబంటవంటివాఁడవు

రేకు: 0251-6 సౌరాష్ట్రం సం: 09-006

పల్లవి: అలిగేదె సహజము ఆఁడువారికి
మలసి నీవె తిద్దుక మన్నించవయ్యా

చ. 1: పలుకక నే నెంత పంతాన నీతో నుండిన
తలఁపు నీపైదెకాన తప్పులేదు
చెలఁగి మందెమేళాన చెయివట్టి తీసినాను
యెలమి నీవూడిగాన కెగ్గు లేదు

చ. 2: మల్లాడి కోపముతోడ మంచము దిగకుండిన
తొల్లె నీకాలు దొక్కితి దోసము లేదు
పల్లదాన వెంగెమాడి పకపక నవ్వినాను
వెల్లవిరి నాపనికి వెగటు లేదు

చ. 3: కావరించి నిన్నుఁగూడి గర్వముతో నుండినాను
కైవసముయితిఁగాన కడమ రేదు
శ్రీ వెంకటేశ నన్ను జిత్తగించి యేలితివి
వేవేలు భోగములకు వేసట లేదు

రేకు: 0252-1 రామక్రియ సం: 09-007

పల్లవి: కానీవయ్య దానికేమి కాంత యవివేకి గాదు
సానఁబట్టి చూచిని సరిత లన్నియును

చ. 1: మంతనాన నీతోను మాటలాడినంతలోనె
పంతము దప్పదుగా పడఁతికిని
సంతసాన నిన్నుఁజూచి సరసమాడినంతలో
దొంతుల కురుకఁడుగా దొరకొని మరుఁడు

చ. 2: పరు సెరిఁగి కాచుక వద్దఁ గూచుండి నంతలో
దొరతనము దప్పదు తొయ్యలికిని
విరసములేక నీకు విడె మిచ్చినంతలోనె
కరకరిఁ బెట్టవుగా కప్పురపుటుండలు

చ. 3: ననుపుసేసుక నీతో నవ్వి నంతలోననె
తన నేరుపు దప్పదు తరుణికిని
యెనసె శ్రీ వెంకటేశ యిటు నీవాదరించఁగా
పెనపులఁ బెట్టవుగా ప్రేమపువలపులు

రేకు: 0252-2 కాంబోది సం: 09-008

పల్లవి: చెప్పినట్టె పతిపంపు సేతువు గాక
చిప్పిలుఁ జెమటలతో సిగ్గు లేఁటికే

చ. 1: చెక్కు చేతఁ బెట్టుకోగా సెలవుల నవ్వు నీకుఁ
జిక్కె నేఁడు మరి వేరె చింత యేఁటికే
దక్కె నీకు వలపులు దండ నున్నాఁడు విభుఁడు
మొక్కలపు వెరగుతో మోన మేఁటికే

చ. 2: నిట్టూర్పు నించఁగాను నిక్కుఁగుచములమీఁద
యిట్టి పులకలు నిండె నేఁకటేఁటికే
జట్టిగొనె వేడుకలు చనవు లాతఁడె యిచ్చె
వట్టి అలుకతోఁ దలవంచ నేఁటికే

చ. 3: పానుపుపై నుండఁగానె బలిమి శ్రీవెంకటేశుఁ
డానుక నిన్నుఁ గలసె నార డేఁటికే
నీనోము లీడేరె నీమొగఁడు నిన్ను మెచ్చె
కోనల బొమ్మజంకెన కొస రేఁటికే

రేకు: 0252-3 బౌళి సం: 09-009

పల్లవి: మానుసులకుఁ దరమా మరి యివి నీకె కాక
ఆనుకొని సేసే వీ దయ్యపు చేఁతలు

చ. 1: నిండు గొల్లతనమున నీకె తగునయ్య
కొండ యెత్తినట్టి గొడగుల నీడలు
గండపురాకాసివేఁటకాఁడవు నీ కమరును
దుండగపుటూరజాతురబోనాలు

చ. 2: యిల దేవపిండమవయ్యిన నీ యాటలయ్య
బలుసముద్రాలమీఁది పాటపరువు
అలరు కాముకుఁడవుఅయిన నీకుఁ జెల్లునయ్య
చలమరి బ్రహ్మతోడి చయ్యాటాలు

చ. 3: కొయ్యరాచవాఁడవు కోరి నీకు నబ్బె నయ్య
పుయ్యక దూలచుట్టాల పోరాటాలు
యియ్యెడ శ్రీవెంకటేశ యేలితి పదారువేల
నెయ్యాన నన్నుఁ గూడితి నిలిచెఁ బైకొసరు

రేకు: 0252-4 హిజ్జిజి సం: 09-010

పల్లవి: ఏమి చూచే వాపెదిక్కు యెందాఁకాను
నేముసేసేపనిగాదు నెయ్యపు యీవేళను

చ. 1: చెలి నీతో నవ్వు నవ్వి చెక్కు లెల్లాఁ జెమరించె
వలిపె పావడఁ దుడువఁగరాదా
నిలువెల్లఁ బులకించె నీతో మంతనమాడి
చలివాయఁ బచ్చడ మిచ్చుటఁ గప్పరాదా

చ. 2: కాంత నీపదాలు వాడి కడు దప్పిగొనె నిదె
యింతట మోవితేనియ లియ్యరాదా
చెంత నీపాదా లొత్తి సిగ్గునఁ గుమ్మడి జారె
కాంతుఁడవు యింతటను కాఁగిలించరాదా

చ. 3: వనిత నీమోము చూచి వసివాడు వాడీ నదె
వెనుకొని నీవు తెర వేయరాదా
ఘనుఁడ శ్రీ వెంకటేశ కలసితి వింతలోనె
ననిచె నలమేల్మంగ నంటు సేయరాదా

రేకు: 0252-5 భైరవి సం: 09-011

పల్లవి: నీవు వాఁటె దూర నేలె నిన్ను నంటినకతాన
యీవిధిఁ బొందెను నిన్ను నివి దూరుఁగాక

చ. 1: కప్పుర మేమి సేసునె కాంతుఁడు రాకుండఁగాను
అప్పటివేళనె కారమాయఁగాక
తప్పుగద్దా గందానకు తాపాన నీ వుండఁగాను
వుప్పతిల్లి దానికె వుడుకెత్తెఁగాక

చ. 2: విరులకు నేర మేదె విరహంపువేళ నీకు
గరిమ వేఁడికి నొడిగట్టెఁగాక
మరుఁడు పగవాఁడా నీమనసులో కాఁక సోఁకి
తిరమై అనంగుఁ డంటా తిట్టువడెఁగాక

చ. 3: చల్లగాలి వెట్ట యౌనా సారె నీమీఁద విసరి
పల్లదాన వడ దాఁకి భ్రమసెఁగాక
యిల్లిదె శ్రీ వెంకటేశుఁ డిట్టె నిన్నుఁ గూడఁగాను
యెల్లవారు మంచివారై యీడేరిరిగాక

రేకు: 0252-6 ఆహిరి సం: 09-012

పల్లవి: చెప్పినట్టు సేసేఁగాక చెనక నేలా
కప్పితివి పచ్చడము ఘన తిదె చాలదా

చ. 1: యెన్నిలేవు మంచిమాట లెందాఁకా నాదేవు
విన్న వినుకులె కావా వెనకకును
సన్నముగాఁ బులకించె జలజలఁ జెమరించె
కన్నుల నీళ్ళు దుడిచి కైకొంటివి చాలదా

చ. 2: యింతలోనె చెక్కు నొక్కే వేమి నేరుచుకొంటివి
వంతు వచ్చినదెకాదా వనితలతో
దొంతులాయఁ గోరికలు తురుమునెరులు జారె
యింతట వంచినశిర సెత్తితివి చాలదా

చ. 3: కలసితి విట్టి నిన్ను కడుజాణ మవుదువు
తొలుతనె మెచ్చనా దూరుతా నిన్ను
యెలమి శ్రీ వెంకటేశ యేకచిత్తమాయ నాకు
తెలిగన్నులనె సిగ్గు దేర్చితివి చాలదా

రేకు: 0253-1 సామంతం సం: 09-013

పల్లవి: గుట్టువాఁడ వంటాఁ గొసరితి
యిట్టి నీ వంటేది యెఱఁగముగా

చ. 1: చెక్కుఁచేతితో సెలవి నవ్వితే
తొక్కేవు పాదాలు దోమటిగా
అక్కర నీ వింత ఆసకాఁడ వవుత
యిక్కడ మాలోనె యెఱఁగముగా

చ. 2: మంతనాన నీతో మాటలాడితే
సంతసానఁ గొంగు జారించేవు
బంతినె నీ వింత పంతగాఁడ వౌత
యెంత కెంత నేము యెఱఁగముగా

చ. 3: సిగ్గుతోడనే సేవ సేసితే
యెగ్గు దీర నన్ను నెనసితివి
అగ్గపు శ్రీ వెంకటాధిప యిట్టవుత
హిగ్గిన వేడుక నెఱఁగముగా

రేకు: 0253-2 ముఖారి సం: 09-014

పల్లవి: ఏలే చెలియ యీా యింతుల కెల్ల
సోలగిలి నీ చనవు చూపవలెనా

చ. 1: మిక్కిలి యాతఁడు నీపై మేలు గలఁడంటానె
వెక్కసాన నిందరిలో విఱ్ఱవీఁగేవు
చక్కనివిభుఁడు నీ జవదాఁట కుండితేనె
తక్కక నీ వొకతెవే దక్కఁ గొంటివా

చ. 2: మనసి చ్చాతఁడు నిన్ను మన్నించె నంటానె
యెనలేక యిందరి నీ వేలఁ జూచేవు
ఘనమైన మోహపుకాంత నవుదు నంటానె
గునియుచు సారె నాడుకొనవలెనా

చ. 3: అన్నిటాఁ బట్టపురాణి వైతె నవుదువు గాక
వెన్నుఁడు శ్రీవెంకట విభునికిని
వన్నెలు చూపవలెనా వడి నీ సవతులకుఁ
బన్నియాతఁడును నీవె బ్రదుకరమ్మా

రేకు: 0253-3 దేవగాంధారి సం: 09-015

పల్లవి: అతిరాజసపు దొరవైన నిన్నును
సతమైన నే నిట్టె సాదించవచ్చునా

చ. 1: వెడఁగు నీ సుద్దులెల్ల వీనుల వినుటగాక
నొడిగి నిన్నవి నే మానుపవచ్చునా
కడఁగిన చేత లెల్ల కన్నుఁజూచుటగాక
అడఁచి నీతో నౌఁగా దనవచ్చునా

చ. 2: పచ్చి నీగుణములకు పరిణామించుటగాక
కెచ్చురేఁగి బొమ్మల జంకించవచ్చునా
తచ్చిన నీ యెమ్మెలకుఁ దలవంచుకొంటగాక
వొచ్చమని నిన్ను మెచ్చకుండవచ్చునా

చ. 3: దక్కిన నీకాఁగిటను తనివి నొందుటగాక
చక్కని నిన్ను నేఁ గొసరవచ్చునా
అక్కున శ్రీ వెంకటేశ అలమేలుమంగనేను
యెక్కువ నీరతు లివి యెంచవచ్చునా

రేకు: 0253-4 లలిత సం: 09-016

పల్లవి: కల దింతె మాటఁ కంతుని యాటఁ
తెలుసుకో నీలోనిదియె పూఁటపూఁట

చ. 1: అలమేలుమంగా హరియంతరంగా
కలితనాట్యరంగ కరుణాపాంగ
చెలువుఁడు వీఁడె చేకొను నేఁడె
వలరాజుతూపులివి వాఁడిమీఁది వాఁడి

చ. 2: అలినీలవేణి యంబుజపాణి
వెలయంగ జగదేకవిభునిరాణి
కలయు నీ పతి వచ్చె గక్కన నిన్నిదె మెచ్చె
పలికీని చిలుకలు పచ్చి మీఁదఁబచ్చి

చ. 3: సితచంద్రవదనా సింగారసదనా
చతురదాడిమబీజచయరదనా
యితవైన శ్రీ వెంకటేశుఁడు నిన్నిదె కూడె
తతిఁ దలపోఁతలు తలకూడెఁ గూడె

రేకు: 0253-5 ముఖారి సం: 09-017

పల్లవి: మగువ నేను నీవు మగవాఁడవు
తగ దొక్కజాతి గాదు తలవయ్య నీవు

చ. 1: వేఁకపు వెన్నెలముగ్గు వేడుక నామోము నిగ్గు
చీఁకటినీలపుగీము జిగి నీమోము
యేఁకట నీకును నాకు నేఁటిపొందు నన్నంత
తాఁకనాఁడవద్దు వద్దు తలవయ్య నీవు

చ. 2: కలువరేకులముంపు కలికి నీకనుసొంపు
జలజపురూపు నీ చాయలచూపు
యెలమితో నిందు కందు కేవూరి కేవూరు
తొలఁకు గచ్చులు మాని తొలవయ్య నీవు

చ. 3: తనరుఁ గొండల తరతరము నాపురము
మినుకువజ్రపుటేను మించు నీమేను
ఘనుఁడ శ్రీ వెంకటేశ కలయు నీరతులలోఁ
దనిసి నే నొక్క టైతిఁ దలవయ్య నీవు

రేకు: 0253-6 భూపాళం సం: 09-018

పల్లవి: మూలనున్నవారి మమ్ము ముంగిటవేసీఁగాక
జోలి దవ్వీఁగాక నే సోదించఁగలనా

చ. 1: వెన్నెలలె యెండలంటా వేగించె తనకుఁగాను
నన్ను నవ్వీఁ దనతో నే నవ్వఁగలనా
చిన్నిచెమటలవాన చిత్తడిపాలైననా
చన్ను లంటీఁ దన్ను నే జంకించఁగలనా

చ. 2: పాయ మిది భారమంటాఁ బలికె నాతో మాట
లాయము దాఁక నాడీ మారాడఁగలనా
కాయంపుఁ బులకలచే గజిబిజియైన నాపైఁ
జేయి వేసీఁ దన కిది చెల్ల దనఁగలనా

చ. 3: నిమిషమె యుగమై నివ్వెరగైన నన్నుఁ
దమి నడియాస ముంచీఁ దాళఁగలనా
సమరతి ననుఁ గూడె జంట శ్రీ వేంకటపతి
కమలపుటింతి నింతేఁ గాదనఁగలనా

రేకు: 0254-1 మంగళకౌశిక సం: 09-019

పల్లవి: దవ్వులసరసములు తగునా నీకు
వువ్విళ్లె మేన నొచ్చమున్నవానివలెను

చ. 1: గోడ నిక్కి చూచేవు గొబ్బున దగ్గరి రావు
ఆడనుండె యెడమాట లాడించేవు
వీడెపు నీమోవి చూపి వికవిక నవ్వేవు
కూడి ముట్టువారి ముట్టుకొన్నవానివలెను

చ. 2: యెదుట సన్నలు సేసే వేకతము లాడేవు
పొదిగి నే రమ్మంటేఁ బొందు చూపేవు
బెదరేవు నీమేను పెనుగోర నంటితేను
చెదరి చీఁకటితప్పు సేయువాని వలెను

చ. 3: అలికేవు వులికేవు అంతలోన భ్రమసేవు
వెలయ నిలువుననె వెరగందేవు
యెలమి శ్రీ వెంకటేశ యీడకు విచ్చేసి నీవు
కలసితి విదె కలగన్నవానివలెను

రేకు: 0254-2 ముఖారి సం: 09-020

పల్లవి: కూడని దొకటొకటి కోరీ మరుబలము
ఆడనె నీసతి కన్నియుఁ గూడె

చ. 1: పొంగెటిమనసే వెలిపులక మొలకలు
అంగపుఁ జెమట మోహపుఁ గరఁగు
వెంగలితమకములు విసరెటి వూర్పులు
అంగన కిదివో అన్నియునుఁ గూడె

చ. 2: యెనసిన యాసలె యెదురుల చూపులు
అనుగుఁ గూరిములె ఆలకింపులు
నినుపు మోమోటములె నిండిన నివ్వెరగులు
అనయము సతి కిప్పు డన్నియునుఁ గూడె

చ. 3: కాఁగిటిపరవశాలు కన్నులతేలింపులు
చేఁగల సిగ్గులె చిరునవ్వులూ
యీగతి శ్రీ వెంకటేశ యింతలో విచ్చేసి చెలి
నాఁగి కూడఁగా నివి యన్నియునుఁ గూడె

రేకు: 0254-4 మంగళకౌశిక సం: 09-021

పల్లవి: చేరి నీవు చెప్పినట్టు సేసితి నేనూ
వారి వీరివలె మఱవకుమీ నన్నునూ

చ. 1: జలధి దచ్చి లక్ష్మిని సంగడిఁ బెండ్లాడునాఁడు
అలరి రుక్మిణిఁ బెండ్లి ఆడెనాఁడు
సెలసువిల్లు విఱిచి సీతఁ బెండ్లి యాడునాఁడు
పలికి బొంకనిమాఁటపట్టు నాకు నిమ్మీ

చ. 2: సరుసఁ బదారువేలుసతులఁ బెండ్లాడునాఁడు
అరసి భూసతిఁ బెండ్లియాడు నాఁడు
పరగ రేపల్లె గోపభామలఁ బెండ్లాడునాఁడు
యిరవై యిచ్చినబాస యిమ్మీ నాకు

చ. 3: ఆదె శ్రీ వెంకటపతి అలమేలుమంగ నిట్టె
అదన నీవు పెండ్లియాడునాడూ
యిదె నన్నుఁ గూడితివి యెక్కువగా మన్నించి
యెదుట నమ్మించినవి యెంచుమీ నాకు

రేకు: 0254-4 లలిత సం: 09-022

పల్లవి: పోయిన దెల్లాఁ బొల్లు పూఁచిన దొక్కటె కాక
కాయజకేళికి నింకఁ గదియ రమ్మనవే

చ. 1: అడిగిరావె విభుఁ డందు కేమనీనో
యెడయనిబాస నీకిచ్చినాఁడు
నుడుగులు దప్పినాను నోముఫలము దప్పదు
తడవి యింతటనైన దగ్గరి రమ్మనవే

చ. 2: పిలిచి రాఁ గదె తనబిరు దెట్టు చెల్లీనో
పెలుచు మే నాహి నాకుఁ బెట్టినాఁడు
వెలయఁ దినఁగ నదె వేమైనఁ దీపవును
తలఁగక యింకనైన దగ్గరి రమ్మనవే

చ. 3: యిచ్చిరావె యీవిడెము యిన్నిటా మెచ్చితినని
కొచ్చినరతుల నన్నుఁ గూడె నేఁడు
తచ్చిన పక్వాన నంటు తరువఁ దరువ వెన్న
యిచ్చుట శ్రీ వెంకటేశు నిట్టె రమ్మనవే

రేకు: 0254-5 శంకరాభరణం సం: 09-023

పల్లవి: ఇద్దరు మోనాన నున్నా రిది యేమయ్యా
వద్ద నాకె పైకొనీ నీవలెనె పో అయ్యా

చ. 1: పూచిన తంగేడువలె పొలఁతి దండ నుండఁగ
యేచి కూచుండు మన విది యేమయ్యా
చాఁచి కప్పురవిడెము సరి నీకు నందియ్యఁగ
చేచేత నందుకోవు చెల్లఁబో యేమయ్యా

చ. 2: ముంగిటి నిధానమై ముదిత పూఁకొనఁగానె
అంగవించి మాటలాడ వదేమయ్యా
బంగారుసురటి నీపై చెమటలు విసరఁగ
అంగ మెల్ల మరచితి వది యేమయ్యా

చ. 3: నిండిన సంపదవలె నెలఁత ని న్నంటితేను
అండ నో రెత్తలే వైతి వదేమయ్య
మెండగు శ్రీవెంకటేశ మెలుఁత నిన్నుఁ గూడఁగ
యెండ లెల్ల నీడ లాయ నిది యేమయ్యా

రేకు: 0254-6 లలిత సం: 09-024

పల్లవి: ఇక నేలయ్యు మా యెడమాటలు
మొకమొక మెదుటనె ముయికి ముయాయ

చ. 1: సుదతికి నీచూపు సూసకమై చెలువిందె
కది సాకెచూపు బాసికము నీ కాయ
యెదుర నీకు నాకెకు నిద్దరి మీచిఱునవ్వు
వెదచల్లు కప్పురపు విడెము లాయ

చ. 2: తొయ్యలికిఁ జేసన్నఁ దోరణపుఁ జిగు రాయ
యెయ్యెడఁ దొయ్యలిమోహ మీడుదో డాయ
యియ్యెడ నాయెడ మీయిద్దరి సరసములు
కయ్యములులేని కంకణదారా లాయ

చ. 3: నెలఁతకు నీమోవి నిచ్చ కొత్తవిందులాయ
పొలఁతిమోవి నీకు బువ్వము లాయ
యెలమి శ్రీ వెంకటేశ యిద్దరి మీకూటములు
కలకాలమును మీకుఁ గాణాచు లాయ

రేకు: 0255-1 శంకరాభరణం సం: 09-025

పల్లవి: మానవుగా మమ్ము నేల మగనాలిఁ జెనకేవు
కానీ కానీలే యింకాఁ జాలదా

చ. 1: దక్కె నీకుఁ జాలదా తగు రుకుమిణి నీవు
వెక్కసాన లూటిసేసి వేసుకొన్నది
మొక్కల మది చాలదా మున్ను త్రిపురాంగనలఁ
జిక్కించి చీఁకటితప్పు సేసినది

చ. 2: చెల్లె నదె చాలదా చేకొని రేపల్లె నీవు
గొల్లెతల మానములు కొల్లగొన్నది
అల్లది చాలదా నరకాసురుఁడు దెచ్చుకొన్న
పెల్లగు కామినులనుఁ బెండ్లాడినది

చ. 3: అంత నీకుఁ జాలదా అల పూవులవారింటి
కాంత నీవు దొడికిన కల్లతనము
చెంతలఁ గూడితి నన్ను శ్రీ వెంకటేశ నీవు
మంతు కెక్కితిఁ జాలదా మన్నించినది

రేకు: 0255-2 సామంతం సం: 09-026

పల్లవి: వెఱపించఁ బోయి మరి వెఱచినట్టయ్యీఁ జుమ్మీ
నెఱి నాతోడి యలుక నీతిగాదు సుమ్మీ

చ. 1: మోనముతో నుండే వేమె ముదిత నీమాట లెల్ల
నాని నాని మొలచీఁ గనక లోలోనె
ఆనకమై నవ్వ వేమె అంగన నీనగవులు
వూని నీకుత్తికెలోన వుక్కిపోవుఁ జుమ్మీ

చ. 2: ధీరతఁ జూడ వదేమె తెరవ నీకనుచూపు
కేరి యిమ్ముచాలక కిక్కిరిసీఁ జుమ్మీ
మారుమోమయ్యే వదేమె మగువ నీమోము కళలు
పేరడై వొక్కచోటనె పెంటలయ్యీఁ జుమ్మీ

చ. 3: వుసురనే వప్పుడేమె వువిద నాకాఁగిటిలో
వుసురు నీచనుఁగొండ లోడీఁ జుమ్మీ
నసల శ్రీ వెంకటేశుఁడ నారతిమై మఱచేవు
కనుగాటై నీమోవి గంటివడుఁ జుమ్మీ

రేకు: 0255-3 మంగళకౌశిక సం: 09-027

పల్లవి: మనసుకు మనసే మర్మము గాక
వినికివలెఁ దనకు విన్నవించఁ గలనా

చ. 1: తలుపులో తమకము తానె యెరఁగ డట
యెలమిఁ దన్నుఁ గొసర నేలె నాకూ
కలిమిఁ జంద్రునిరాక కలువపువ్వులకును
తెలిపిరా యెవ్వరైన దినదినమునకు

చ. 2: తప్పక వరు సెరిఁగి తానె విచ్చేయుఁ డట
యిప్పుడు విలువ నంప నేలె నాకూ
వుపతిల్లుఁ గోవిలకు నొగి వసంతకాలము
చెప్పుదురా యెవ్వరైనఁ జెలఁగి యేఁటేఁటను

చ. 3: దగ్గరి వచ్చినవాఁడు తానె యెరుఁగుఁ గాక
యెగ్గు సిగ్గు లిటు దీర్చ నేలెనాకు
అగ్గమై శ్రీవెంకటేశుఁ డాదరించి నన్నుఁ గూడె
నిగ్గు నిలువుకు నీడ నేర్పిరా యితరులు

రేకు: 0255-4 వరాళి సం: 09-028

పల్లవి: ఏల నన్ను నేర మెంచే వింత కున్నదా
చాలు నో విభుఁడ నీతోఁ జలము నా కున్నదా

చ. 1: గద్దరి నామొకము నాకన్నులకె పాటి గాక
సుద్దుల నీచూపు చల్లఁ జో టున్నదా
బద్దమై నావదనము పాటలకె కొద్దిగాక
యిద్దివో నాతో మాట కెడ మున్నదా

చ. 2: కొనబు నాచేతులు నాకొప్పు వెట్టనె కాక
వొనరి నీకైదండ కోపి కున్నదా
పెనఁగు నాపాదములు పిరుఁదు మోవనె కాక
ననిచి నీవొద్దికి రా నడ పున్నదా

చ. 3: సరి నాపురము నాకుచాలకె తావు గాక
సరవి నీకాఁగిటికి సందున్నదా
కరఁగి కూడితి శ్రీవెంకటపతినె నిన్ను
యిరవైన నీకు నాకు నెర వున్నదా

రేకు: 0255-5 హిజ్జిజి సం: 09-029

పల్లవి: ఘనుఁడవు తెగి కొరికఁగ నేల
నసిచిన కొలఁదుల నడపవు గాక

చ. 1: చూచీఁ జూడని చూపులు నీకె
లోచూపై మదిలో నాటె
కాచిన మూకులు కమ్మరఁ దమకే
మోచిన కొలఁదుల మో పైనట్లూ

చ. 2: ఆడియు నాడని అరమాటలె నీ
కాడనె చిరునగవై వెడలె
గాడపుటింటికి కట్టలు గట్టిన
వేడుక నలుగుల వెళ్లినయట్లూ

చ. 3: చిందియుఁ జిందని సిగ్గులు నీకే
విందుల కాఁగిట వెగ టాయ
యిందునె శ్రీ వెంకటేశుఁడ నీ నా
గొందుల చెనకులు గుఱు తయినట్లా

రేకు: 0255-6 వరాళి సం: 09-030

పల్లవి: ఇంతటిది గావలదా యింతి యైతేను
కాంతునిఁ గళ లంటి కరఁగించె నిపుడు

చ. 1: అలిగి వచ్చినపతి నలమి కాఁగిట నెత్తి
పలుకుల వినయాలు పచరించఁగా
సొలసి కోపాన నాఁటఁ జూచె విభుఁ డంతలోనె
చెలియ చెమట గోరఁ జిమ్మెఁబో కన్నులనూ

చ. 2: మక్కువ మంకులతోడ మాటలాడకున్న పతి
చెక్కు నొక్కి జలజాక్షి సేద దేర్చఁగా
వెక్కసము లాడెటి విభుని వదనమున
పుక్కిటి తమ్ములమిడి పొలఁతి వాలించెనే

చ. 3: పంతపు శ్రీవెంకటేశుఁ బడఁతి వొయ్యనె చేరి
అంతరంగ మెల్ల దేర్చి యాదరించఁగా
రంతుతో రతుల నిబ్బరము చూపె నాతఁడును
మంతనానఁ జొక్కించి మఱపించె మేనూ

రేకు: 0256-1 ముఖారి సం: 09-031

పల్లవి: ఇంక నేల ఆ సుద్దులు యేరా నీవు
కొంకుతా నేఁ గొసరితే కూళతనము రాదా

చ. 1: కానరాదా నీ గుణాలు కడు నీ మైకాఁక లందె
మానక యప్పటినె మాటాడేఁ గాక
మోనపుగుట్టు విడిచి ముసిముసి నవ్వు నీపై
నానఁబెట్టి చల్లితేను నగుఁబాటు గాదా

చ. 2: తెలియరాదా నీ మోహము తెల్లవారి వచ్చినందె
అలుగలేక నీచే విడె ముందితిఁ గాక
నిలువుకు నిలువున నీ మోహము చూచి నేను
బలిమి సేసి పెనఁగితేఁ బరువేయదా

చ. 3: యిరవుగాదా నీపంతము యిప్పుడు నన్నుఁగూడినందె
పొరసి నిన్ను బట్టువలెఁ బొగడఁ గాక
అరిది శ్రీ వెంకటపతి ఆయము లంటితినిన్ను
యెరవుగా నిన్నేమనిన యెచ్చు కుందు గాదా

రేకు: 0256-2 సాళంగం సం: 09-032

పల్లవి: నేఁ దన్నుఁ గైకోని నేర మిందేదే
యీాదెఁ దనమంచ మెక్క నైతినా

చ. 1: అలుకేదె జలుకేదె ఆకెయింటనుండ నన్ను
సొలసి చూచిన మారుచూడునా నేను
యెలమిఁ గోప మిందేటి దిద్దరు ముచ్చటలాడ
వెలినుండి యిన్నియును వినసైతి నటవే

చ. 2: కుచ్చితపున సణఁ గేదె గొణఁ గేది నాయందు
నచ్చుఁ దనమోవి చూచి నవ్వ నైతినా
కెచ్చురేఁగి కపటాలు గిపటాల కేది యెడ
రచ్చఁ దనసేఁత లెల్ల మెచ్చనైతినా

చ. 3: వేస టేది వోస టేది వింతచెలి విడిపించి
గోస నాసచేసి తన్నుఁ గూడనా నేను
లాసిన శ్రీవెంకటేశు లాగు లెల్లఁ గనుఁగొని
యీాసడముదీర పుర మెక్క నైతినా

రేకు: 0256-3 కాంబోది సం: 09-033

పల్లవి: ఆయ నాయఁ బోయఁ బోయ నల్లనాఁడె నీ
చాయల సన్నల పొందు చాలువయ్యా

చ. 1: వెన్నెలలు వేఁడెనుచు విసరించుకొనె నాపై
కన్నుల నవ్వులు చల్లి కాఁక రేఁచేవు
పన్ని వురిసిన యందుపై నుడుకు చల్లినట్లు
యెన్న మాతో మేకు సేసేవిఁక నేలయ్యా

చ. 2: పాయము వేఁగని యిట్టె బడలివుండె నాపై
నీ యడ మాట మూట లేల యేత్తేవు
చాయల వేయిటి మీఁద జవ్వాది కొమ్ము రీతి
ఆయములు సోకించే వవునయ్యా

చ. 3: సరసాలు వాఁడెనుచు సారెకు మొక్కె ననుచు
మురిపెము గోరేల మోపే వయ్యా
గరిమ శ్రీ వెంకటేశ కరుణించి మెచ్చినట్టు
కరఁగి కూడితి నన్నుఁ గత లేలయ్యా

రేకు: 0256-4 సాళంగం సం: 09-034

పల్లవి: ఇంతుల నెంత దూరునో యింత కవుడె
యింతట రావమ్మ మెచ్చు నింత కపుడె

చ. 1: యిదె వచ్చి నదెవచ్చి నింతి యని యాసాస
నెదురుచూచుఁ బతి వింత కపుడె
వెదవీడనితురుము విడువ ముడువఁ బట్టె
హృదయ మేమౌనో పతి కింత కపుడె

చ. 2: పొంది యెవ్వరు ముందరఁ బొలసిన నీవె యని
యెందు నిన్నె పేరుకొను నింత కపుడె
ముందు నీపయ్యదకొంగు మూయాఁదియ్యనె పట్టె
యెందరి నంపునో పై పై నింత కపుడె

చ. 3: నిన్నుఁ దలఁచి తలఁచి నిద్దిరించి కలలోన
యెన్నఁగఁ గాఁగిటఁ గడు నింత కపుడె
పన్నిన శ్రీవెంకటేశుఁ బైకొని కూడితి విట్టె
యిన్నాళ్లిటులఁ గాదు యింత కపుడె

రేకు: 0256-5 ముఖారి సం: 09-035

పల్లవి: ఔనో కాదో నీ వాన తీవయ్య్య
పని వేరొకటి యిఁకఁ బోలదయ్యా

చ. 1: చంచలము నాచూపు చంచలము నీగుణము
యెంచె నీ వే మనేవొ యెరఁగమయ్య
ముంచి నా గుబ్బలు రాయి మొగి నీ గుండెరాయి
అంచల నాకడ నేమి యాడుకొనేవయ్యా

చ. 2: చిగురు నా యధరము చిగురు నీ చిత్త మదె
తగెఁ దగ దందు కేమి తలవయ్య
నగవు నా మోమెల్ల నగుఁబాటు నీచింత యీ
తగవు చెలులతోడ తరిఁ జెప్పవయ్యా

చ. 3: లేఁత నాకుఁ గొనగోరు లేఁత నీవయసు గడు
యీఁతలు మోఁతలు నిఁక నేలయ్యా
ఘాతల శ్రీవెంకటేశ కదిసి కూడితి నన్ను
యీతల నిద్దరిభావాలేక మాయనయ్యా

రేకు: 0256-6 మధ్యమావతి సం: 09-036

పల్లవి: ఆయము లంటే యారచికత యిది
చాయల సన్నకు చలి యిఁక నేదయ్యా

చ. 1: మూయక మూసిన ముత్యపుమొగడలు
మోయక మోచే మొదలేదే
పూయక పూచిన పున్నమవెన్నెల
పాయక కానే బయ లేదయ్యా

చ. 2: పుట్టక పుట్టిన పొది జక్కవలవి
మెట్టక మెట్టే మేరేదే
పెట్టక పెట్టిన పెనుమేఘమునకుఁ
బట్టిన చోటను బలు వేదయ్యా

చ. 3: పారక పారిన బలుతీఁగెలకును
ఆరితేర నిఁక నరుదేదే
యీరీతి శ్రీవెంకటేశుఁడ నే నిన్నుఁ
గోరి కూడితిని కొద యేదయ్యా

రేకు: 0257-1 హిజ్జిజి సం: 09-037

పల్లవి: జలములఁ బాసిన జలజాప్తునిచే
జలజము నొగిలిన చందంబాయ

చ. 1: చక్కని యీపతి సతిఁ బెడఁబాసిన
వెక్కసపు మనసే వేఁడాయ
చెక్కు చేతితోఁ జింతించిన నది
అక్కట మదనుని యడిదంబాయ

చ. 2: రమణి పతికడకు రాక నిలిచినా
తమి నిట్టూర్పులు దగులాయ
తమకంబున సతి దలపోయంగా
భ్రమసి చూచురెప్పలు నొప్పాయ

చ. 3: యింతలో నిద్దరి కెడ మాటాడఁగ
అంతట వీనుల కాసాయ
యింతయు శ్రీవెంకటేశ్వరుఁ గూడఁగ
యింతేసి యిందాఁక నేమేమో ఆయ

రేకు: 0257-2 దేసాళం సం: 09-038

పల్లవి: ఏడ కేడ యెంచి చూచి యెఱఁగవటే
కూడునా కపటములు కూటము లెందైనను

చ. 1: మోమువంపుఁ గోప మేడ ముసిముసి నవ్వు లేడ
యేమే యెండలు వెన్నెల లెనయునటే
దోమటి వొట్లివి యాడ తొంగిచూపు లివి యాడ
సామై నల్లవేఁడియునుఁ జలువయుఁ గూడునా

చ. 2: అంటితేఁ బెనఁగు లేడ అందులోఁ గొంకు లేడ
జంటఁ గారములు దీపఁ జవు లౌనటే
బంటు బంటు పంత మేడ బాస లెచ్చరించ నేల
వొంటిఁ జీఁకటి వెలుఁగు వుండునా యెందైనను

చ. 3: అవ్వలయి వుండ నేల అద్దములో సన్నలేల
దవ్వులుఁ జేరువ లొక తారుకాణటే
రవ్వల శ్రీవెంకటాద్రిరమణుఁడనె నిన్ను
యివ్వలఁ గూడితి నింక నెర వౌనటే

రేకు: 0257-3 వరాళి సం: 09-039

పల్లవి: నీట ముంచు పాల ముంచు నీచిత్త మిఁకను
యీటగు నీపతిభావ మిది గలది

చ. 1: తప్పక చూచుఁ జూచు తలవంచు నంతలోనె
వుప్పతిల్లఁ బులకించు నుస్సురనును
కప్పురగంధి నీవుఁ గదిసి కూడిన కాఁక
చెప్పరాదు విరహము చెంతల నీపతికి

చ. 2: చిన్నఁబోవు నంతలోనె చెలులపైఁ గోపగించు
కన్నచో వెదకు మేనఁ గప్పు కప్పును
కన్నెరో విభుఁడు నీవు కళ లంటినదాఁక
మిన్నక చింతాజలధి మీరరాదో యమ్మ

చ. 3: బుద్ధు లెంచుకొను లోలో పోసరించి కల్లపడు
అద్దివో శ్రీవెంకటేశుఁ డాడ నాడనె
వొద్దికై నీ విటువలె వొనగూడి వుండుదాఁక
చద్దికి వేఁడికి వెదచల్లు లాయ వలపు

రేకు: 0257-4 రామక్రియ సం: 09-040

పల్లవి: నీవు బడలితివి నేనుఁ జూచి బడలితి
కావించి నన్ను మరి కలసేవు గాని

చ. 1: చెదరెఁ గస్తూరిబొట్టు చేత దిద్దుకొనవయ్య
అదన నిట్టూర్పులు ఆఁపవయ్య
వదలె తురుముగొంత వడిఁ జక్కఁ బెట్టవయ్య
పదరి వెనక మాతో బాససేతు గాని

చ. 2: కడుఁ బులకించె మేను కప్పవయ్య పచ్చడాన
జడిసీఁ జెమటలు విసరు కోవయ్య
చిడియుఁ గెంపులమోవి చేత మూసుకొనవయ్య
నిడివి నిజము మాతో నెరుపేవు గాని

చ. 3: గందపుబేఁట్లు రాలీ కాఁగిలించుకొనవయ్య
విందుల పొందుల శ్రీవెంకటేశుఁడ
కందువ నాకూట మిది కడదంటా భ్రమసితి
పొందితి విప్పుడు యింకాఁ బొదిగేవు గాని

రేకు: 0257-5 సామంతం సం: 09-041

పల్లవి: ఉదయించె నతఁడు నీ వుదయించ వేలయ్య
మదిరాక్షిఁ గూడి యిట్టె మన్నించవయ్యా

చ. 1: జలజబంధుఁ డతఁడు జలజాక్షి వదనపు
జలజబాంధవుఁడవు సరుస నీవు
అలరి నాకాశమందె యతనికి విహరించఁ
గలికి నడిమియాకస మిదె నీకు

చ. 2: చీఁకటివైరి యతఁడు చెలియమనసులోని
చీఁకటివైరివి నీవు చేచేతనే
ఆఁక జక్కవలఁ గూర్చు నతఁడు నీ వీడ నైతె
కాఁక చనుజక్క వలఁ గలపఁగ వలదా

చ. 3: దినరా జతఁడు భూమిఁ దెరవపాలికి నీవు
దినదినరాజవు తేజమనను
ఘనుఁడ శ్రీవెంకటేశ కాంతఁ గూడితివి నేఁడు
గనియై యాతఁడు సూర్యకాంతమునఁ గూడెను

రేకు: 0252-6 సామంతం సం: 09-042

పల్లవి: పూవక పూచిన వెల్లాఁ బూఁపలయ్యీనా
చేవదేర దగ్గరక చింత లెల్లఁ దీరునా

చ. 1: రేపు నవ్వుదువుగాని రేయి నాకొం గంటకురా
దాపుల సరములఁ దని వయ్యీనా
తీపు నీరువట్టుగొంటె తేటనేయి మందవునా
పై పైఁ గలయక యీపచ్చిచేఁత లేలరా

చ. 2: యిచ్చక మూడుదుగాని యియ్యకొంటిఁ బో పోరా
గచ్చుల వినయములు గాకమానీనా
మచ్చిక నాఁకలివేళ మంచి విరు లింపవునా
హెచ్చినరతులఁ గాక యిందువల్ల నేమిరా

చ. 3: అవ్వల మొక్కుదుగాని అంతేసి సేయకురా
రవ్వనిన్నుఁ జేయక నా రాఁపు వాసీనా
యివ్వల శ్రీవెంకటేశ యింతలోఁ గూడితి నన్ను
దవ్వులే చేరువ లాయఁ దలపోఁత లేలరా

రేకు: 0258-1 సామంతం సం: 09-043

పల్లవి: ఎందు కెందుఁ బోలిచేవె యింతి వోరి
అందుకె కాదా నీయడియాసలు

చ. 1: పాదమున నే నిట్టె బయలుచిమ్మిన నీవు
వాదుకు వచ్చే వేమె వనితా
యీదెస నెంచి చూచితె నిటువంటి బయలె నా
గాదిలి నడు మవుత కానవా నీవు

చ. 2: దాపునఁ దామరమీఁదఁ దమ్ముల ముమిసితేను
కోపగించుకొనే వేమె కోమలి
పో పో ఆతామరనెపోలిన నా నెమ్మోము
చూపులు గలుగు నన్నుఁ జూడవా నీవు

చ. 3: అద్దము మెరుఁగు వెట్టేనని గోర నంటితేను
గద్దించే విది యేమే కలికి
నిద్దపు శ్రీవెంకటేశ నీవు నన్నుఁ గూడితివి
అద్దపు నాచెక్కు లిప్పుడవి చూచెఱఁగవా

రేకు: 0258-2 శుద్ధవసంతం సం: 09-044

పల్లవి: నే సతము గాక నీకు నీవు నేనుఁ గలదాఁక
యీసులేని విభుఁడ నీకివి సతమా

చ. 1: మంతనపు నీ వొట్లు మాట నే నాడినదాఁకా
చింతల నీ సిగ్గు వొంటిఁ జిక్కినదాఁకా
పంతపు నీబిగువు నేఁ బచ్చి సేసినదాఁకా
అంతటి మీఁదట నీకు నవి సతమా

చ. 2: అలుకలుఁ జలములు ఆయము లంటినదాఁకా
బలిమి సరసము నేఁ బైకొనుదాఁకా
తలఁపు నీగుట్టు నేఁ దప్పక చూచినదాఁకా
అలరి యంతటిమీఁద నవి సతమా

చ. 3: కన్నుల నీమొక్కులు నేఁ గాఁగిలించినదాఁకా
మిన్నక రతులు నే మెచ్చినదాఁకా
యెన్నఁగల శ్రీవెంకటేశ నిన్నుఁ గూడితినే
అన్నులకడలపొందు లవి సతమా

రేకు: 0258-3 ముఖారి సం: 09-045

పల్లవి: ఇందు నందునె యింతిపోలికలు
విందుల విభునికి వేడుకలాయ

చ. 1: వెడఁగుఁ దీగెలను విరులపరిమళము
పడఁతిమాటలనుఁ బరిమళము
బడిఁ గనకమునకుఁ బదారువన్నెలు
సుడిగొని వనితకు షోడశకళలు

చ. 2: కులికి సురతరువుకొమ్మునఁ బూఁపలు
పొలిఁతికుచంబునఁ బూఁపలు
వెలయు వసంతపువేళనె చిగురులు
చెలి పాదములను చేఁగ చిగురులు

చ. 3: పొంత జలనిధులఁ బొడమెఁ దామెరలు
కాంతకరములె కమలములు
యింతట శ్రీవెంకటేశుఁడు గూడఁగ
కాంతరతుల కివి కదంబమాయ

రేకు: 0258-4 లలిత సం: 09-046

పల్లవి: విచ్చేయవయ్య నీవు వేగమె యింతటనైన
తచ్చి యిన్నియును సరిదాఁకెఁ గదవయ్యా

చ. 1: యింతిమనోరథములు యెంచరాదు పంచరాదు
కాంతుఁడ నీకురులు లెక్కకు రానట్టు
పొంత నాకె తలపోఁతఁ బుట్టిన విరహములు
వింతగా నీశిరసున వెళ్ళెఁ గదవయ్యా

చ. 2: చెలి చింతాలత లివి చిక్కులాయ జీర లాయ
కెలన నీరేకలు మైఁ గెరలినట్టు
అలరి యాకె మదనానలపుఁబొగ లెల్లాను
కులికి నీమేనఁ జుట్టుకొనెఁ గదవయ్యా

చ. 3: సతికరములు నీసమరతులఁ బెనఁగె
రతి నీచూపులు మేన రానైనట్టు
యితవై శ్రీవెంకటేశ యిన్నిటా మీయిద్దరికి
సతమైన వలపులు జట్లాయ నయ్యా

రేకు: 0258-5 శంకరాభరణం సం: 09-047

పల్లవి: నిన్ననె పెండ్లి నాకు నేఁడు నీకు
తన్నుఁ దానె సమకూడె దైవము మెచ్చితిరా

చ. 1: మిక్కిలి మోహము నాకు మేఁటి రాజసము నీకు
నిక్కి చూపు లెల్ల నాకు నిండుఁ బరాకు నీకు
మొక్కుల మాటలు నాకు మోనపుగుట్లు నీకు
తక్కక సేసినయట్టి దైవము మెచ్చితిరా

చ. 2: విరహపుఁగాఁక నాకు వెన్నెల నవ్వులు నీకు
సరసపుఁ దమి నాకు జంపులు నీకు
పెరిగె యాసలు నాకు బీరపు బిగువు నీకు
దరియై గడించినట్టి దైవము మెచ్చితిరా

చ. 3: బిగువుఁగాఁగిలి నాకు పెనుఁజెమటలు నీకు
జిగిమోవిఁ దేనె నాకు జీరలు నీకు
పగటు శ్రీవెంకటేశ పైపయిఁ గూడితి మిట్టె
తగుఁ దగు నిన్నిటికి దైవము మెచ్చితిరా

రేకు: 0258-6 భౌళి రామక్రియ సం: 09-048

పల్లవి: ఏమాట కేమాట యెంత కెంతరా
యీమాటె యాడవె నీ వింకా నొకమారు

చ. 1: అంటఁగాక వున్నదాన నట్టెవుండరా
అంటెనె నీచూపులు న న్నంతక తొల్లె
అంటువాయఁ జెమట నీరాడవా నీవు చి
ట్టంటు నీచేఁతలు నామై నంటవలదా

చ. 2: తలపట్టుతో నుందాన దగ్గరకురా నా
తలఁ పట్టె నీ మీఁదఁ దగు లాయనే
తలపోఁత పేరు నీమైఁ దలకొనదా
తలపడి మేను మేనుఁ దడఁబడవలదా

చ. 3: కన్నుల నిద్దుర వచ్చీఁ గాఁగి లేలరా నీ
కన్నుల సన్నలె కావా కందువ చెప్పె
నన్ను నిట్టె శ్రీవెంకటనాథ కూడితి
కన్నెరొ యిట్టె రతులఁ గరగించవలదా

రేకు: 0259-1 ముఖారి సం: 09-049

పల్లవి: విభునికి నీమాటె విన్నివించరా
సభల దూరపుటేర్లు జలధులఁ గూడవా

చ. 1: దవ్వులనుండితేనె దగ్గరి వుండుట గాదా
దవ్వులనుండిన తన్నుఁ దలఁచఁ గదే
దవ్వుగాదా సూర్యునికి ధరణిఁ దామరలకు
దవ్వుల పొందులె కడుఁ దగులము లాయనే

చ. 2: ఆకడి మో మైతేనె యీకడి మో మౌత గాదా
ఆకడఁ దనదిక్కు మో మైతినేఁ గదే
ఆకసపు మొయి లేడ అడవినెమలి యాడ
దాకొని వింతగుచూపు తరితీపు దానే

చ. 3: ఆసమాట లాడితేనె అండకు వచ్చుట గాదా
వాసి నేఁ దనకడకు వచ్చితిఁ గదే
యీసులేక శ్రీ వెంకటేశుఁ డేడ నే నేడ
వేరక కూడితిమి వింత లెల్లఁ జేరెనే

రేకు: 0259-2 లలిత సం: 09-050

పల్లవి: ఇందు కేమె అందు కేమె యింతలోనె యరవౌనా
అందపుఁ జుట్టాల మౌత అందరు నెరఁగరా

చ. 1: వొద్దనుండవలెనా వొక్కటై తాను నేను
యిద్దరము నున్న నేల యేకమె కాదా
సుద్దముగ మోము మోముఁ జూడవలెనాయెదుట
కొద్దిచంద్రునందు రెండు గూడవా మా చూపులు

చ. 2: మాటలాడవలెనా నామాటలుఁ దనమాటలు
గాఁటపు ఆకసమందుఁ గలసీఁ గదె
చోట నిట్టె మేను మేను సోఁకవలెనా తన్ను
నాఁటి సోఁకినట్టి గాలె నన్ను సోఁకీఁ గదవే

చ. 3: కలయఁగవలెనా కందువ మా మనసులు
గలపిన చిత్తజుఁ డొక్కఁడె కదె
యెలమి శ్రీవెంకటేశుఁ డింతలో విచ్చేసి కూడె
పలుకుఁ బంతము నొక్కపాటాయఁ గదవే

రేకు: 0259-3 ముఖారి సం: 09-051

పల్లవి: ఓపో ఆదేమోయి వో బావ యింక
వోపనంటేఁ బోవునటె వో వో మరఁదలా

చ. 1: వొరసే వదేమోయి వో బావ నిన్ను
వొరసీఁ బో నీకుచాలె వో మరఁదల
వొరకు నెత్తుకు సరి వో బావ నీవె
వొర తొమ్మిది చాఁచేవో వో మరఁదలా

చ. 2: వొగరులాడే వోయి వో బావ నీకు
వొగరు మోవిచిగురు వో మరఁదల
వొగరుఁ జిగురె చేఁగ వో బావ అదె
వొగిఁ బిసికితేఁ బసురో వో మరఁదలా

చ. 3: వొంటి దగ్గరే వోయి వో బావ నాకు
నొంటి గాదు నీ వుండఁగ నో మరఁదల
గొంటవై శ్రీ వెంకటాద్రిఁ గూడితి బావ మన
కొంటి నేల ఆమాఁటలో వో మరఁదలా

రేకు: 0259-4 హిందోళవసంతం సం: 09-052

పల్లవి: ఎంచ నిన్నిటికి లోనయితిఁగా నేను
అంచెలఁ దలఁచుకొంటె నరుదయ్యీ నాకు

చ. 1: రేసు వెన్నెల యండ కోరిచెఁగా నాతనువు
ఆసల నా ప్రాణవిభుఁ డాతనిఁ బాసి
వోసరి నిట్టూర్పుగాలి కోపెఁగా నామనసు
గాసిలి యీతని తమకపువేళను

చ. 2: విరహానలము చొచ్చి వెళ్ళెఁగా నామనసు
సరుగనఁ బతితోను సారె నలిగి
పొరిఁ గన్నీటివఱదఁ బోక వచ్చెఁగా నాచూపు
గిరవై చింతల మునిఁగినవేళను

చ. 3: వుమ్మల మోనానఁ బతికుండెఁగా నా నగవు
అమ్మరో యాతఁడు మాటలాడినదాఁకా
నెమ్మిఁ బరవశములో నిలిచెఁగా నాముదము
కమ్మర శ్రీ వెంకటేశుకాఁగిట యీవేళను

రేకు: 0259-5 వరాళి సం: 09-053

పల్లవి: ఏమౌత నెఱఁగ నీ వేమనేవె
నీ మన సొక్కటాయ నీవే నేనూ

చ. 1: కొప్పు గడు వెడ జారె గుణము తేటలు దేరె
యిప్పుడు చెలియ నాతో నేమనేవె
రెప్పల ముత్యాలు గారె కప్పి చెక్కు చేయి చేరె
చెప్పిన బుద్దులు వింటిఁ జీఁకటె వెలుఁగు

చ. 2: నిలువురాఁకలఁ గాఁగె నిట్టూర్పు గడు రేఁగె
యెలుఁగెత్తి నీవు నాతో నేమనేవె
వలపులు దల కెక్కె వాఁడి కుచముల కెక్కె
చెలియ నీ వూఁకొంటి చేవె చిగురు

చ. 3: చెదరి పయ్యెదజారె సిగ్గులు సెలవిఁ గారె
యెదు రెదురనె చెలి యేమనేవె
యిదివొ శ్రీ వెంకటేశుఁ డిటువచ్చి నన్నుఁ గూడె
సదమదమైతి రతిచలమె ఫలము

రేకు: 0259-6 ఆహిరి సం: 09-054

పల్లవి: ఏల జోలిఁ బెట్టేనే నిన్నిందాఁకాను
వోలి నీ కెదురు చూచు చున్నాఁడ నేను

చ. 1: యేమిసేసీనె చెలి యింతి నీ వేఁగెటివేళ
యేమె నీరాక కెదు రేతెంచెనా
ఆమాటలెల్ల నీవు ఆకె కెఱిఁగించితివా
యేమని చెప్పమనెనె యెడమాట నాకు

చ. 2: ఔనె నావుంగరము ఆకె వేల నున్నదా
మానిని నామేలు నీతో మది నెంచునా
తాను వచ్చే ననునో యీతరి నన్ను రమ్మనునో
పూని తన వ్రాలాకు పుత్తెంచెనా

చ. 3: సతిమాఁట కింటివారు సమ్మతించి వుందురా
అతివ నీ మఱఁగున నది యెవ్వరె
యితవైన శ్రీ వెంకటేశుఁడ నైనందుకును
సతి నన్నుఁ గూడినదె సఫలము లాయ

రేకు: 0260-1 భూపాళం సం: 09-055

పల్లవి: నిండు సోబనము నేఁడు నెయ్యపు దంపతులకు
మెండుగ నారతులెత్తి మీఁద సేసచల్లరే

చ. 1: కట్టుఁడు కలువడాలు ఘనమైన తోరణాలు
గట్టిగాఁ బట్టణము సింగారించరే
కిట్టి రుక్మిణిదేవిఁ గృష్ణుఁడు పెండ్లాడి వచ్చె
పెట్టుఁ డిందరికి నేఁడు పెండ్లి విడేలు

చ. 2: పాడరె సోబనాలు పై పై నె పేరఁటాండ్లు
యీా డా డనక వీధు లేఁగించరే
జాడతో వాయించరె పంచమహావాయిద్యాలు
యీాడనె పెండ్లికట్నా లియ్యరె యిద్దరికి

చ. 3: పొత్తుల విందులు దెచ్చి బువ్వమున నిడరే
హత్తి గంధాక్షత లీరె అందరు నేఁడు
నిత్తెమై శ్రీ వెంకటాద్రి నిలయుఁ డీ కృష్ణుఁడు
తత్తరాన నీకెఁ గూడె దగ్గరి సేవించరే

రేకు: 0260-2 రామక్రియ సం: 09-056

పల్లవి: ఇంతట నిట్టె విచ్చేసి యింతిఁ గూడితేఁ గనక
వంతుకు నిన్ను జాణదేవర వనవచ్చును

చ. 1: తనలోనె తలపోసి తప్పక చూచేవేళ
వనితను దేవగన్య యనవచ్చును
పనివి నిన్నుఁ దలఁచి పాటలు వాడేవేళ
అనుగు గంధర్వకాంత యనవచ్చును

చ. 2: చలపట్టి విరహాన జలకేళి సేయువేళ
అలివేణి నాగకన్య యనవచ్చును
చలువకుఁ జంద్రకాంత శిలపైఁ బొరలువేళ
అలరిన చంద్రకన్య యనవచ్చును

చ. 3: శ్రీ వెంకటేశ నీవు చెలియఁ గూడినవేళ
ఆవటించి నిజలక్ష్మి యనవచ్చును
వోవల నీ సొమ్ములలో వురమున మోచువేళ
దేవి యలమేలుమంగ దిష్ట మనవచ్చును

రేకు: 0260-3 పాడి సం: 09-057

పల్లవి: చెఱఁగుమాసినసుద్ది చెప్పఁ జాల కుండేవు
యెఱఁగము కైదప్పు లెందు మోచునో

చ. 1: చెక్కుచేతితో నీవు సిగ్గువడి నవ్వేవు
చొక్కపు విభుఁడు నిన్నుఁ జూచె నంటాను
తక్కక యాతఁడు నిన్ను దగ్గరి పైఁ జెయి వేసి
యిక్కువ లంటినప్పుడు యేమి సేసేవే

చ. 2: కాలిమీఁదఁ గాలు వేసి కడుఁ దల వంచేవు
అలరి కేలికిని రమ్మనె నంటాను
కోలుముందై యాతఁడె గొబ్బున దగ్గరి వచ్చి
కేలుఁ గేలఁ బెనచితె కిందు పడేవా

చ. 3: సరిలేని తమకాన జలకేళి సేసేవు
అరిది శ్రీ వెంకటేశుఁ డంటీ నంటా
గరగరికల నిన్నుఁ గలసె నాతఁ డిట్టె
అరయఁగ నంటుముట్టు లవి దీరెఁ గదవే

రేకు: 0260-4 ఆహిరి సం: 09-058

పల్లవి: తరవాతి పనులెల్లఁ దగవాయఁగా
యెరవు సతము సేసీ నే మందునే

చ. 1: కుప్పలుగాఁ దన్ను దూరి కోపగించె యందులోఁదా
తప్పు వట్టీ నిది లెస్స తగవాయఁగా
చెప్పనేల రాళ్లు చక్కఁజేసి మలిగండ్లేరీ
నిప్పు డిట్టె నే నిందు కేమందునే

చ. 2: పూని తన్ను నేర మెంచి బుద్ధిచెప్పె యందులోను
తానూ బుద్ధులు చెప్పీ దగవాయఁ గా
ఆని కస్తూరి నల్ల నంటెఁ దెలుకపిండి
యీా నెపాన నల్లనంటె నేమందునే

చ. 3: చెమరించీ తొలమని చేతనంటి తోయఁబోతె
తమకానఁ గాఁగిలించీఁ దగవాయఁగా
సమరతి నన్నుఁ గూడె సరి శ్రీ వెంకటపతి
యిమిడె సంతసముల నేమందమే

రేకు: 0260-5 శ్రీరాగం సం: 09-059

పల్లవి: తగుఁ దగు నీకు నాకుఁ దలవయ్యా
తగవు లగవులాయఁ దమకించకువే

చ. 1: మొఱఁగి కన్నుల నీకు మొక్కేమయ్యా వో
తెఱవ నేఁ గన్నులనె దీవించితినే
వెఱగంది మోవి నీకు విందు చెప్పేఁ బో నిన్ను
జఱసి నే గుక్కిళ్లఁ జివిగొంటిఁ బో

చ. 2: పెలుచు నా కోరికలఁ బిలిచేనయ్యా నేనుఁ
బలుమారు నాలోనె పలికితినే
మెలఁగి ని న్నొకవేల మెచ్చేనయ్యా
నలువంక సెలవుల నవ్వితి నేను

చ. 3: పెంపుడుఁగుచాల నిన్నుఁ బెద్దసేసేఁ బోనే
నింపుల రతుల ని న్నెచ్చరించేనే
గుంపెన శ్రీ వెంకటేశ కూడితిమయ్యా నిన్ను
దింపక నా వురమున దిష్టము మోచితివే

రేకు: 0250-6 కాంబోది సం: 09-060

పల్లవి: చేతనైనపాటి సేవ సేయుదుఁ గాక
ఆత లీతలి పనులు అవి నావశమా

చ. 1: గచ్చుల నీ మన సిట్టె కరఁగించఁ గలఁ గాక
నచ్చు నీ చెమట మాన్ప నావశమా
పచ్చిగా నీమోవిమీఁదఁ బల్లు మోపఁగలఁ గాక
లచ్చన గుఱుతు మాన్ప లాగుల నావశమా

చ. 2: చేరి నీసిగ్గులు దేరఁ జెయి వేయఁగలఁ గాక
నారుఁ బులకలు మాన్ప నావశమా
సారె నీ మోము నేను చక్కఁ జూడఁగలఁ గాక
యేరా నీనవ్వులు మాన్పనివి నావశమా

చ. 3: అంటి నిన్నుఁ గాఁగిటిలో నలయించఁగలఁ గాక
నంటు నీ నిట్టూర్పు మాన్పనావశమా
జంటవై శ్రీ వెంకటేశ సరుసఁ గూడితి విట్టె
వెంట రాకు మని మాన్ప విభుఁడ నావశమా

రేకు: 0261-1 ముఖారి సం: 09-061

పల్లవి: దూరలేను పోరలేను దొమ్మి దన్నుఁ జేయలేను
మోరతోపుఁదనముల మోనమెచాలు

చ. 1: తత్తరించకురె పతి తానె నన్ను వలపించె
చిత్తము వచ్చినయట్టె సేయనీఁగదె
యెత్తి నది మీఁదు దనకె మేనుఁ బ్రాయమును
మొత్తమి నా కిఁకమీఁద మోనమెచాలు

చ. 2: పిలువకురె మీరు పెండ్లాడె ననుఁ దొల్లె
వలసి నప్పుడు రానీ వరుసకును
పలికితిఁ దనదని ప్రాణమును మానమును
ములువాఁడి చెక్కుచేతి మోనమెచాలు

చ. 3: కక్కసపెట్టకురె కమ్మరఁ విచ్చేసెఁ దానె
మక్కువ గలుగుపాటి మన్నించనీవె
అక్కున శ్రీ వెంకటేశుఁ డాదరించి నన్నుఁగూడె
మొక్కలాన నాకింక మోనమెచాలు

రేకు: 0261-2 కేదారగౌళ సం: 09-062

పల్లవి: ఎరవె సతము చేసె నేఁటికొ కాని
తరుణిసింగార మిది తలపోయరే

చ. 1: గరిమె మెరుఁగుఁబోఁడిగాన కొప్పు ఘనమాయ
విరులు ముడిచె యి దేవిధమొకాని
సరి సింహమధ్య భాగాన శైలకుచము లమరె
గరిమఁ బయ్యెద నేల కప్పీనొ కాని

చ. 2: కాంత చంద్రముఖిగాన కలువకన్ను లమరె
చెంతఁ జీఁకటిచూపేల చిమ్మీనొ కాని
బంతి వజ్రదంతి గాన పగడపుమో వమరె
పొంతఁ దమ్ములాన నేల పొదిపీనొకాని

చ. 3: పసిఁడిపతిమగాన పదారుగళల మించె
యెసఁగెఁ దెల్లనినవ్వు లేడవొ కాని
కొసరి శ్రీ వెంకటేశుఁ గూడె నింతలోన నీకె
అసముదించని ఆస అది యెంతొకాని

రేకు: 0261-3 ముఖారి సం: 09-063

పల్లవి: ఇంక నేల వేగిరము యింతలోని పనికిఁగా
తెంకి నే పానుపుమీఁద దిద్దుకొనేఁ గాని

చ. 1: అంతనీవు దగ్గరకు ఆయములు సోఁకీని
పంతపు మాటాడకుర పచ్చి రేఁగీని
కొంత నీవు నవ్వకురా గుండె గడు ఝల్లురనీ
మంతనాన నీ పగటు మందలించేఁ గాని

చ. 2: తప్పక చూడకురా తనువెల్లఁ బులకించీ
చిప్పిలఁ బెనఁగకురా చెమరించీని
కప్పకుర పచ్చడము కడు సిగ్గు ముంచీని
చెప్పగల సుద్ది రేయి చెప్పేఁ గాని

చ. 3: బొమ్మల జంకించకురా పారి నాకు చాలురా నీ
తమ్మ మోవి మోపకురా దప్పి దేరీని
చెమ్మగిలఁ గూడితివి శ్రీ వెంకటేశ నన్ను
సమ్మతించ నీగుణము చలి వాపేఁగాని

రేకు: 0261-4 రామక్రియ సం: 09-064

పల్లవి: నీకు నీకె తెలుసుకో నీ సుద్దులు
నాకుఁ బొద్దుసేసి నవ్వు నవ్వఁ దగునా

చ. 1: కూడనన్న మానదు నాగుణ మేమొకాని
ఆడ నీ చేఁతకు నిన్ను నంటఁ దగునా
చూడ నన్న మానవు నా చూపు లేమొ కాని
వాడికె నీ మోముదిక్కై వద్ద నుండఁ దగునా

చ. 2: విన నన్న మానవు నా వీనులేమొ కాని
కొనబు నీ మాఁట లూ కొనఁ దగునా
నినుఁ బేరుకొన నన్న నిలువదు నా నోరు
పెనఁగి ని న్నీడకుఁ బిలువఁగఁ దగునా

చ. 3: సోఁక నన్న మానదు నా సోగ మే నేమొ కాని
పైకొని నీ పచ్చి మీఁదఁ బచ్చి దగునా
యీకడ శ్రీ వెంకటేశ యిటు నన్నుఁ గూడితివి
కాకుగా నిన్నియుఁ దారు కాణించఁ దగునా

రేకు: 0261-5 ఆహిరి సం: 09-065

పల్లవి: కదిసిన మిము మెచ్చఁ గలము గాకా
యెదిటి మీ యలుకలు యివి చూడఁ గలమా

చ. 1: కన్నుఁ గొనలె వేరు కమ్మఁ జూపు లొకటె
మిన్నక వుండె మీలో మీ రొకటె
చిన్నఁబోయి నీ వాడ చెక్కుచేతఁ జెలియాడ
వున్నభావ మిది చూచి వోరుచఁగఁ గలమా

చ. 2: వీను లివియె వేరు వినుకలి యొకటె
ఆనకపు మీ మోహాలవి యొకటె
పానుపై నాకె వెలుపల మలగుపై నీవు
పూని వున్నమీకు నేము బుద్ధి చెప్పఁగలమా

చ. 3: కడఁగి చేతులె వేరు కాఁగిలిది యొకటె
యెడసి కూడిన మీరిద్ద రొకటె
అడరిన శ్రీ వెంకటాధిప మీ యిద్దరిలో
జడియుఁ బంతములకు సాక్షి చెప్పఁ గలమా

రేకు: 0261-6 రామక్రియ సం: 09-066

పల్లవి: గుట్టుతో లోలో గొణఁగుట గాక
దట్టించి చెలులాల తను ననే దేమె

చ. 1: ఆకసపుఁ జంద్రునికి నాసపడఁగా నేమి
వాకైరాని పతికి వలవఁగా నేమి
ఆకడ నందనిపంటి కఱ్ఱుచాఁచఁగా నేమి
జోకకురాని పతినిఁ జూడఁగా నేమి

చ. 2: కొనబువెట్టి చెరకు కొనయేమి మొదలేమి
యెనయని పతిమాట లెన్నైనా నేమి
పొనిగి యంపలిచెట్టు పూచె నేమి కాచె నేమి
ననుచని పతి యంత నవ్వినా నేమి

చ. 3: వసంతకాలము దప్పి వంబు గావఁగా నేమి
కసిగాటై యెలయించి కలయఁగా నేమి
యొసఁగి శ్రీ వెంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
వసమైన మీఁద నింక వాసు లెంచ నేమి

రేకు: 0262-1 ముఖారి సం: 09-067

పల్లవి: అతివ నీ సింగార మట్టిదెకా అందుమీఁద
పతివిరహము నైతె భావించ వసమా

చ. 1: తామెరపైఁ దుమ్మిదలు దట్టమై మూఁగుండఁగాను
నేమముగ నది చూచి నీ విభుఁడు
కోమలి నీ విప్పు డిట్టె కుత్తికబంటి జలాన
ఆముక యీఁదులాడే వని తానూ దుమికె

చ. 2: మించు జక్కవలు తీఁగెమీఁద వాలి వుండఁగాను
అంచెల నీరమణుఁడు అది చూచి
వుంచానఁ బయ్యెద జార నొగి విరులు గోసెటి
చంచని తా లేచి వచ్చి సరిఁ గాఁగిలించెను

చ. 3: నిక్కి మేడలోన నొక్క నెమలి నటించఁ జూచి
అక్కడ శ్రీ వెంకటేశుఁ డది నీ వని
అక్కరతో దగ్గరఁగా నంతలోన నీవు వచ్చి
పక్కనఁ గూడఁగ దనభ్రమలెల్లఁ బాసెను

రేకు: 0262-2 భైరవి సం: 09-068

పల్లవి: ఆపాటి కాపాటి అందుకేమె
యీపని సరికి సరి యిందు కేమె

చ. 1: యిదె తన మోవిఁగెంపు లెక్కఁ జూచి నా కన్నుల
కదనఁ గెంపు లెక్కె నందు కేమె
చెదరెఁ గురులు దననుదిటి పై నా చిత్త
మెదుటనె చెదరెఁ బో యిందు కేమె

చ. 2: వన్నెలఁ దా ముడిచినవాడుఁ బువ్వు లటు చూచి
అన్నువ నా మోము వాడె నందుకేమె
పన్ని చిట్లుగందాల భావము చూచి నా మాట
లిన్నియుఁ జిటులు మనీ నిందు కేమె

చ. 3: సేయఁగల వెల్లఁ జేసి చేరి నన్నుఁ గూడఁగాను
ఆయెడ నేనుఁ గూడితి నందు కేమె
పాయపు శ్రీ వెంకటపతి మేను నామేను
యీయెడ నేకము లాయ నిందు కేమె

రేకు: 0262-3 సామంతం సం: 09-069

పల్లవి: అప్పటి కప్పటి మాట లంతె చాలు
యిప్పుడు కాలు దాఁకించ నేల మొక్క నేల

చ. 1: కూరవండి కసవేరె గుణము లోలో నేల
యేరా నిన్నుఁగూడి పాసె యెగపోఁ తేలా
నీరువట్టుగొని యిట్టె నెయ్యైనాఁ దెమ్మన నేల
సారె నీవు రానప్పటి చలిమందు లేలా

చ. 2: జాగరము సేయనేల సరిగా నిద్రించ నేల
వేడి నే వేఁగినందుకు వెంట రా నేల
యీగతి నడుసు చొర నేల కడుగఁగనేల
భోగించి నీకు నేపొద్దు బుద్ది చెప్పనేల

చ. 3: ఆకడఁ బంతము లేల అట్టె పందతన మేల
చేకొని గో రంటనేల సిగ్గువడ నేల
మేకుల శ్రీ వెంకటేశ మేలు నన్ను భ్రమయించి
పైకొని కూడితి వింక బా సడుగ నేల

రేకు: 0262-4 శ్రీరాగం సం: 09-070

పల్లవి: ఒకటి కొకటి నుండఁ జెలిభావ మిది
మొకమెదుటనె నన్ను మోవ వ్రాసెనే

చ. 1: పొలిఁతికురులు వ్రాయఁబోతేఁ దుమ్మిదలాయ
తలఁగకుండఁగ మోముఁదమ్మి వ్రాసెనే
కలికికన్నులు వ్రాయ గండుమీలై పొడచూపె
చెలపచెమట నీటిచెక్కులు వ్రాసెనే

చ. 2: సరిఁ గుచములు వ్రాయ జక్కవలై పొడచూపె
నిరుదెస బాహులత లిటు వ్రాసెనే
గరిమ నడుము వ్రాయఁగా సింహమై తోఁచె
వరుసఁ దొడల యంటివనము వ్రాసెనే

చ. 3: కోమలిపాదాలు వ్రాయఁ గూర్మములై పొడచూపె
ఆమని జవ్వనపులోఁ తటు వ్రాసెనే
యీమేర శ్రీ వెంకటేశఁ డే ననుచుఁ గూడె
రామ యిట్టె యిదివో నా రతి వ్రాసెనే

రేకు: 0262-5 సామంతం సం: 09-071

పల్లవి: ఇచ్చక మాడ నెఱఁగ నేమి సేతునే
హెచ్చీఁ బెంజెమటలు యేమి సేతునే

చ. 1: చక్కని పతిగుణాలు సారె నాతోఁ జెప్పఁగాను
యెక్కడో వినీ వీను లేమి సేతునే
పెక్కువ నాతఁడు నన్నుఁ బిలువ నంపె ననఁగా
యిక్కడ నా మోము నవ్వీ నిఁక నేమి సేతునే

చ. 2: యిదె మేడపై నతఁడు యిటు నన్నుఁ జూచెనంటే
హృదయము చిల్లులయ్యీ నేమిసేతునే
వదల కాతఁడు నా వాకిటికి వచ్చె నంటే
యెదుటఁ గన్నీ ళ్లూరీ నిఁక నేమి సేతునే

చ. 3: బలిమి నాతఁడు నాపైఁ జేయి వేయఁగాను
యెలమి నిట్టూర్పు రేఁగె నేమి సేతునే
కలసి శ్రీ వెంకటాద్రిఘనుఁడు నన్నుఁ గూడఁగ
యెలఁదీగెమనేను వొంగె నేమి సేతునే

రేకు: 0262-6 శుద్ధవసంతం సం: 09-072

పల్లవి: చాలుఁజాలు నాతో జాణతనాలా
చాలుకొన్న నీచూపు జళిపించ నేలరా

చ. 1: పలుకవె చెలియ పచ్చిగా నదె రోరి
పలుకు నీ కప్పురపు బరణి నదె
నిలువవె కొంతవడి నే వచ్చినందాఁక
నిలువు నీ నామమందె నిక్కమాయ నదెరా

చ. 2: అడిగేనె యింతి అప్పటి ని న్నొక సుద్ది
అడుగులు నీయందునవె కదరా
ముడికారి సట లేలె ముదితా
ముడి నీ సిరసునఁ గొమ్ముడి యిదె కదరా

చ. 3: కలసితిఁ గదె నిన్నుఁ గలికి నీవు
కలగంపపతి వౌతఁ గంటిరా నేను
అలరి ని న్నురమున నానితిఁ గదె నిన్ను
నల శ్రీ వెంకటగిరి యానెఁ గదరా

రేకు: 0263-1 రామక్రియ సం: 09-073

పల్లవి: చెల్లెఁ జెల్లె నీవు సేసే చేఁత లెల్లాను నీ
పల్లదా లిన్నియు బండిబాటాయఁ దగవు

చ. 1: కద్దు గద్దు నీ మాట కల్ల లేదు పొల్ల లేదు
వద్దు వద్దు నీతోడి వాదులు నాకు
ముద్దు ముద్దు సేసి నిన్ను మోవఁ బెంచె మీ తల్లి
పొద్దు వొద్దుఁ గోమటిండ్లపొరుగాయ బదుకు

చ. 2: ఆయ నాయ నీ మాట లల్లములు బెల్లములు
మూయ మూయ నీకె మూరెఁడు నోరు
తోయఁ దోయఁ దల్లి వెన్నతోడఁ బెట్టె ముచ్చిములు
పోయఁ బోయ గొల్లదోమటాయఁ బో మా పెరుగు

చ. 3: వింటి వింటి నిన్ననె నీవేసాల బాసలును
కంటిఁ గంటి నిఁక నేల కైకొంటివి
యింట నింట శ్రీ వెంకటేశ పంతమిచ్చి నన్ను
నంటి యంటి నిచ్చకొత్తలాయఁ బో నా మనువు

రేకు: 0263-2 ముఖారి సం: 09-074

పల్లవి: మానిని భావము చూచి మాకు వెరగాయ నిదె
పూని చూ పోపక నీ పైఁ బూవు లెత్తి చల్లెను

చ. 1: విందు నీ మై సొమ్ముల నిగ్గు మాణికములలో
అందఁ దననీడ చెలి యన్నిటాఁ జూచి
కొందుక పదారువేలు గోపాంగనలు నీమై
నుండ వా రని తలఁచి వొగిఁ దల వంచెను

చ. 2: వన్నెల నీ పచ్చడాన వ్రాసిన కోలాటపు
అన్నువపతిమలను అటు చూచి
మున్ను పురకామినుల మోహము మఱవ లేక
పన్నుక వున్నాడ వని పకపక నవ్వెను

చ. 3: కూడిన నీ రతిఁ దానె కోరి పెక్కుబంధముల
వేడుకఁ బెనఁగి శ్రీ వెంకటేశుఁడ
పాడి నిన్ని నేరుపులు పచరించితిఁ దా నని
చేడె వూరకె భ్రమసి సిగ్గు వడీ నదివో

రేకు: 0263-3 గౌళ సం: 09-075

పల్లవి: నీటినడు మడచితే నేఁడు రెండౌనా
యేఁటి కింక గొంకేవు యింతిఁ జేకోవయ్యా

చ. 1: వాసులఁ జందురులోనె వడిఁగందు గద్దు గాక
కాసే వెన్నెలలోనఁ గందు గలదా
ఆసల మోమునఁ గోప మటు నీపైఁ జల్లెఁ గాక
యీ సతికి మతిఁ గోప మింతయిన నున్నదా

చ. 2: కొలనిలో కలువలకొట్టు గొన వాఁడి గాక
అలరుఁ బరిమళము లవియూ వాఁడె
సొలసి చూచిన యింతి చూపులె వాఁడి గాక
నలువంకఁ గన్నులలో నవ్వులూ వాఁడా

చ. 3: అంది నారికళపుఁ గాయకుఁ బైనె గట్టి గాక
కందువ లోనూ నట్టె గట్టి యయ్యీనా
పొందిన శ్రీ వెంకటేశ పొలిఁతి పై గుట్టు గాక
గొందినె కూడిన యింతిగుణము కఠినమా

రేకు: 0263-4 ముఖారి సం: 09-076

పల్లవి: ఏమే యిందు కెగ్గు లెంచఁ దగునా
కాముఁడు సేసినయట్టి కత లింతె కాక

చ. 1: నేనా తనతో నెమ్మిఁ గొసరేదాన తన్నుఁ
గానక యెదురుచూచె కన్నులు గాకా
కానీ కానిమ్మని కడుఁ బగ చాటితినా
పూని జంకించినవె బొమ్మలింతె కాకా

చ. 2: అలిగి తనతో నే నవ్వలిమో మౌదునా
చెలఁగి వంచినది నా సిరసె కాక
మలసి తనతోను మాటలాడ కుందునా
వెలసిన విరహపు పింతె కాక

చ. 3: పట్టఁగా నేనా పైకొనకుండేదాన
గుట్టుతోడ నుండెటి నా గుణము గాక
యిట్టె శ్రీ వెంకటేశుఁ డిన్నిటాను నన్నుఁ గూడె
పట్టిన నా నోము ఫల మింతె కాకా

రేకు: 0263-5 లలిత సం: 09-077

పల్లవి: మదనరాగము నీకు మదనాతురము నాకు
యెదు రెదురఁ గలిగె నిందుకే మెచ్చితిఁ బో

చ. 1: నిలువుల చెమటల నీమేను చూచినా
నిలువెల్ల జెమరించె నేఁ డిదివో
కలువ కన్నుల నీ కావి చూచి నా కన్నుఁ
గలువలు కావి దేరీఁ గాఁకల కోపమునా

చ. 2: వేఁడి నిట్టూరుపుల నీ వేషము చూచి నాకు
వేఁడినిట్టూర్పులు రేఁగె వెల్లవిరి
వాడుదేరెకళల నీ వదనము చూచి నేఁడు
వాడుదేరి చిన్నఁబోయ వదనము నాకు

చ. 3: యెవ్వతో కాఁగిటి నీ యీ మేనిపచ్చి చూచి
యివ్వల నీ కాఁగిలి నీ కెక్కె నిపుడు
రవ్వల శ్రీ వెంకటేశ రతుల సంగడి నిట్టె
నివ్వటిల్ల నిన్నంటి నీయంత నైతి

రేకు: 0263-6 శంకరాభరణం సం: 09-078

పల్లవి: తా నెట్ల నున్నాఁడో తరుణి వినిపించవే
కానక నినుఁ గన్న నతనిఁ గన్నట్ల నాయనే

చ. 1: కొంతవడిఁ దనుపేరు కోరి నాలుకఁ దలఁతునే
కొంతవడి దనసుద్దులు కొమ్మలచే బిందునే
కొంతవడి తానున్న కొలువుచిత్తరువు చూతు
కాంతయీరీతిఁ బొద్దు గడపుదునే నేను

చ. 2: మది నొక్క వేళఁ దనమాట దలపోతునే
కదిసి యొకవేళ దన్నుఁ గలలోనఁ గందునే
పదములనె వొకవేళ యెదురు నడతు నేఁ దనకు
తుద నిట్ల దినదినము దొబ్బుదునే నేనూ

చ. 3: సగినములు చూచుచు నే జరపుదునే వొకగడియ
వగలఁ దను దూరి లేకలు వ్రాతుఁ గొంతదడవు
జిగి నింతలోఁ గూడె శ్రీవెంకటేశ్వరుఁడు
మగిడి యల్లాడ నపుడు మలఁగుపయి నిపుడూ

రేకు: 0264-1 రామక్రియ సం: 09-079

పల్లవి: ఆకెవో నాప్రాణ మోహనపురాణి
దాకొని వేవేలు కాంతలలోన నున్నది

చ. 1: ముదితకురుల నెల్లా ముత్యములు మాణికాలు
గుదిగుచ్చి కీలుగంటు గొన్నది
సదరపు పసిఁడివజ్రాల చనుకట్టుది
అదె పైడిపూవులపయ్యెద వల్లెవాటుది

చ. 2: పచ్చలు దాచినయట్టి పాదుకలు మెట్టినది
లచ్చన మొగవుల మొలనూళ్లది
అచ్చపుటుంగరముల అందెలుఁ బాయవట్టాలు
గచ్చుల ముంజేతుల కంకణసూడిగేలది

చ. 3: నానాభూషణముల నానాసింగారాల
పానిపట్టి నా దిక్కె తప్పక చూచేది
ఆనకపు శ్రీ వెంకటాద్రిపతినైన నన్ను
తానె వచ్చి కూడి నాదగ్గరనె వున్నది

రేకు: 0264-2 సామంతం సం: 09-080

పల్లవి: అతనిదెస చూచి నిన్నపుడు దూరితి మమ్మ
వెతదీర నీఁకనైన విచ్చేయ వమ్మా

చ. 1: వుదయచందురుఁ జూచి వువిద నీ మో మనుచు
అదనరావైతివని యలిగి యవ్వలిమో మాయ విభుఁడు
యెదిటి మేఘముఁ జూచి యిదియె నీతురు మనుచు
కొదలుచును తల వంచి కొసరె నిన్ను

చ. 2: చిలుకపలుకులు నీదుపలుకులని యిందాఁక
యెలయించి తనిగొణఁగియెడసి వీనులు మూసుకొనియుండెను
తళుకునను మెరువ నంతట నీదుచూపులని
తెలియనిభ్రమల దోమతెరలోని కేఁగె

చ. 3: కోవిలలరొదలు విని కొమ్మ నీ యెలుఁ గనుచు
భావజుచేఁ బరచితని పదరి నినువేవేలు మాటలాడె
యీవేళ విచ్చేసి యిటు నీవు గలయఁగా
శ్రీవెంకటేశ్వరుఁడు చిక్కెరఁగఁ డాయ

రేకు: 0264-3 రామక్రియ సం: 09-081

పల్లవి: ఔనె మాటకు మాట ఆడితివి వోరి
కాని యింకా నేమి గలిగినాఁ జెప్పురా

చ. 1: కోరి నీ మోవి మెత్తన కుచముల కఠినాలు
చేరి నీతో పొందెట్టు సేయవచ్చునే
వోరి నీగుణము రాయి వొట్టిమాట చిగు రని
ఆరీతి నిందరికిఁ జూప ననువుగావలసిరా

చ. 2: కుత్తికె మరుశంఖము కురులు వంకగాలాలు
కొత్తనీకు నాకుఁ బొందు గూడు నటవే
వొత్తి నీ చదువు వేదా లొడ్డినవి గాలాలు
జొత్తుగా నింతటఁ జెప్పి చూపఁగ వలసిరా

చ. 3: కడు నీ నవ్వు చల్లన కనుచూపు చురుకులు
కొడిమె నీవు నన్నెట్టు గూడితివే
వడి శ్రీవెంకటేశుఁడ వలపులరతి నీకు
నుడిసి చలి వేఁడని చూపె నింతేరా

రేకు: 0264-4 బౌళి సం: 09-082

పల్లవి: సరికి బేసి కవె పగ సాధించుఁ గాని
పరగ నందుకు నవె పతిమాఁటు చూపు

చ. 1: వెన్నెలలె యెండ లట విరులె వాఁడెట
యెన్నఁగ నిందుకుఁగా నేల వెరవ
అన్నువ వెన్నెలరేని కారను రాహువుఁ జూ పు
విన్ననై విరులకును విరహాగ్నిఁ జూపు

చ. 2: చిగురులే చేగ లట చిత్తజుఁడే పగ లట
యెగసక్కెముల నిందు కేల వెరవ
గుగురుఁ జిగురునకు కుత్తికె కోవిలఁ జూపు
షొగరుఁజంద్రపుమోము పున్నమమారుకుఁ జూపు

చ. 3: గాలియె వేఁడట జక్కవ లుద్దీపన మట
యేల వెరవ శ్రీవెంకటేశుఁడు గూడె
గాలికిఁ జనుఁగొండలు కమ్మర నడ్డము చూపు
నాలి జక్కవలకు నీ నవ్వువెన్నెల చూపు

రేకు: 0264-5 శంకరాభరణం సం: 09-083

పల్లవి: అది గురుతు మరవ ననవె నేను
అదన నిన్నిట జాణఁ డనవె తాను

చ. 1: దోమటి నెందొ తన్నుఁ దోఁగి చూచితే నేను
నా మోము చూచి యట్టె నవ్వెఁగా తాను
కామించి యాడో సింగారములు నించుకోఁగా
వేమారు మొక్కితే దీవించెఁగా తాను

చ. 2: దంతపుటోవరిలోన తా నేపని నుండఁగానో
కొంత నేఁ బిలిచితే నూఁకొనెఁగా తాను
దొంతులఁ దమ్ములముపొత్తులఁ జేయఁగాఁ గంటె
చెంత నన్నుఁ దప్పక చూచెఁగా తాను

చ. 3: యీడకె శ్రీవెంకటేశుఁ డిప్పు డిట్టె విచ్చేసి
వాడికె సిగ్గులఁ దల వంచెఁగా తాను
కూడి చొక్కేవేళ మోము గురిగాఁ జూచితే నేను
మేడెపుఁ గాఁగిట నొక్కి మెరసెఁగా తాను

రేకు: 0264-5 ముఖారి సం: 09-084

పల్లవి: వేగుదాఁకా జాగరాల వేసారితిమి
వాగపు బిత్తరికాఁడ వచ్చేవొ రావొ

చ. 1: తళుకున మోము చూపి తల దీసే వంతలోనే
తొలుత నీ చేఁతల సుద్దులే తవ్వేవు
చలపట్టి వూరకైన సారె సారె నవ్వేవు
వలవంత సటకాఁడ వచ్చేవొ రావొ

చ. 2: పొడవులు చూపేవు పొంచి పగ చాటేవు
యెడసితే వెదకేవు యింతలోనే
బడి బడి నీడుగానిపనులకే పెనఁగేవు
వడఁబెట్టి సటకాఁడ వచ్చేవొరావో

చ. 3: బుద్దులఁ బోయేవు మెట్టి బూములెల్లాఁ దిరిగేవు
పొద్దువొద్దునకు నన్నుఁ బొదిగేవు
అద్దిర శ్రీవెంకటేశ అలమి కూడితి విట్టె
వద్దనుండి యిట్లనె వచ్చేవొ రావో

రేకు: 0265-1 వరాళి సం: 09-085
పల్లవి: కంటిమి వొకటిసేయఁగా నొకటి నీయందె
వొంట దొకటొకటికి నొద్దు మాతో బొంకులు
చ. 1: మాటలాడఁబోతే మచ్చము మోవిఁ దోఁచె
నాటఁజూడఁబోతేను నవ్వు దోఁచెను
నీటున నుండఁగఁ బోతే నిద్దుర గన్నులఁ దేరె
యేటి కింకఁ జాలు చాలు నేల మాతో బొంకులు
చ. 2: దగ్గరిరాఁబోతే వింతతాపులు బుగులుకొనె
వొగ్గి విడె మియ్యఁబోతే నొలికె సిగ్గు
బెగ్గిలి వేఁడుకోఁబోతే పెంజెమట మేనఁ జిందె
యెగ్గు లెంచ నిఁక నిన్ను బొంకే వయ్యా
చ. 3: కాఁగిట నన్నంటఁబోతే గందపు బేఁటులు రాలె
మాఁగిన రతులనుఁ దమకము రేఁగె
వేఁగుదాఁకా మాటల శ్రీవెంకటేశ కూడితివి
నీ గతులు చూడఁ జూడ నిజమె పో బొంకులు

రేకు: 0265-2 భైరవి సం: 09-086

పల్లవి: ఆడనుండె యేమి గల్లా నానతియ్యరా
జాడతో నలుక గాదు చాలించరా

చ. 1: చిగురాకు నామోవి చిత్తజు నడిద మట
తెగుఁజేసు నీ వంత దిష్టించకురా
పగటు నాకుచములు పాయని జక్కవ లట
యెగరుఁజేసు నీ వింత దగ్గరకురా

చ. 2: నల్లని నాయారు యిది నంజువంటి పామట
చెల్లఁబో యేమౌనో మమ్ముఁ జేరకురా
వెల్లవిరి నా నడుము వింత మేఁటి సింహ మట
కల్లరి యేమి సేసునో కాఁగిలించకురా

చ. 3: గరిమల నామేను కనకమువంటి దింతే
కరఁగజేసు నిట్టూర్పు గమ్మనీకురా
సిరుల శ్రీ వెంకటేశ చేరి కూడితి వింక
తరగు మొరఁగు దీరె దవ్వె చేరువరా

రేకు: 0265-3 కొండమలహరి సం: 09-087

పల్లవి: ఏమో సేయఁగఁ బోగా నేమో ఆయ
యేమని చెప్పుదుఁ బను లిటువంటివే

చ. 1: వుక్కుమీరి కృష్ణుఁడు మావుట్లు దించఁబోఁగాఁ
బక్కన నేఁ బారి తెంచి పట్టుకొంటినే
మొక్కలాన నతఁడు నా మోము చూచె నంతలోనె
మక్కువ నా మే నెల్ల మర పాయనే

చ. 2: కమ్మర నంతటఁబోక కాఁగులపాలంటఁ బోఁగా
బిమ్మటిగాఁ గిందుమీఁదై పెనఁగితినే
యెమ్మెల నాతఁడు నా యిక్కువకుఁ జేయి చాఁచె
కమ్మి నా చిత్తము నీరై కరఁగితినే

చ. 3: వుద్దండాన గట్టి వెన్నముద్ద లారగించఁగానె
గద్దించి కాఁగిట నేఁ గమ్ముకొంటినే
వొద్దనె శ్రీ వెంకటేశుఁ డొంటి నన్నుఁ గూడఁగా
నిద్దరికిఁ బులకించి యేక మైతిమే

రేకు: 0265-4 సాళంగనాట సం: 09-088

పల్లవి: ఎటువంటి మోహమో యెట్టి సంతసములో
ఘటియించె నిద్దరికిఁ గందువ మాయెదుటా

చ. 1: కామిని యెదురు చూడగఁ గన్నుల పండుగలాయ
ఆమని నీ రాకల మోహనరూపము
వేమరు నాలకించఁగా వీనుల పండుగలాయ
కోమలితో నీ వాడే గురిమాటలు

చ. 2: మానినికి నింతలోనె మంచి పుట్ల పండు గాయ
ఆనెటి నీ మించు నధరామృతము
తానకమాయ నిదిగో తగు దివ్వెల పండుగ
పాని నీ కరుణఁ జూచే పచ్చి చూపులు

చ. 3: కలికికి నిపు డిట్టె కాఁగిటి పండుగ లాయ
చలువ నీ కూటముల సమరతులు
అలరి శ్రీ వెంకటేశ అన్నిటాఁ బండుగ లాయ
జలజాక్షి నీలోని సరసములు

రేకు: 0265-5 నాదరామక్రియ సం: 09-089

పల్లవి: చెలువుఁడ నీవు మేలు చిత్తమె తీలుగాని
పలుకులఁ దనిసితి బాస లెట్టో కాని

చ. 1: అంది నీ మాటలు మోవి యమృతపుఁ దీపె పో
చిందర నీ చేఁతలె చేఁదు గాని
విందుల నీ ప్రియములు వెన్నకంటె నున్ననె పో
కందువ నీ గుండె యిదె కడురాయి గాని

చ. 2: సొంపుల నీ యిచ్చకాలు చుక్కలకంటె గనము
గుంపెన నీ గుణమె కొంచము గాని
తంపి నీ చుట్టరికము తామెరకంటె దంపర
యింపు నీ వలపె యార డిన్నిటిలోఁ గాని

చ. 3: గరిమె నీ నగవులు కప్పురాలకంటెఁ జవి
కరఁగు నీ విడెమె కారము గాని
యిరవై శ్రీ వెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
సరవు లిప్పుడు మేలు సటదొల్లెకాని

రేకు: 0265-6 పాడి సం: 09-090

పల్లవి: ఎట్టు సింగారింత మమ్మ యీ యింతిని
ముట్టని సింగారము ముందు ముందె యమరే

చ. 1: పొలితి చంద్రవంకబొట్టు వెట్టఁ బోయి సంది
మలసే గోరొత్తు చూచి మాని నవ్వెను
కలిమిఁ జంద్రగావి గట్టఁబోయి అద్దములో
సొలపుఁ గన్నుల కావి చూచి నవ్వెను

చ. 2: అమరిన ముత్యాలహారములు వెట్టఁ బోయి
చెమటముత్యాలు చూచి చెలి నవ్వెను
కొమరె యరవిరులు కొప్పున ముడువఁ బోయి
తమిఁ బులక విరులు తాఁ జూచి కొంకెను

చ. 3: వీఁగుచుఁ బరిమళము వెలఁది పూయఁగఁ బోయి
కాఁగిటి వాసన చూచి కడు నవ్వెను
సోగల శ్రీవెంకటేశు సురతసింగారము
వాగమై యమరెఁ గాన వన్నెలెల్ల నమరే

రేకు: 0266-1 లలిత సం: 09-091

పల్లవి: మనలోని మాఁటా మనసులో తీఁట
వెనకఁ జెప్పేఁ గాని విడువు మీ పూఁటా

చ. 1: మొగములో బిగువు మోవిమీఁది తగవు
జిగి దేరె నిందరిలోఁ జెప్పనేలా
చిగురుఁగొప్పు చెదరు చిమ్ముఁ జూపుల బెదరు
నగితేనె పచ్చి దేరి నన్ను నేమీ ననకు

చ. 2: ముక్కున వుసురులు చెక్కుల యసరులు
కుక్కి తోయ కంత కొంత గుట్టె మేలు
అక్కుపై గురుతులు అంగపు సరతులు
మక్కళించనేల యిది మరువకు చాలు

చ. 3: కాఁగిటి మైతావులు కన్నుఁగవకావులు
యీగతి నా భావము నా యెదుట నేల
భోగపు శ్రీ వెంకటేశ పొందితివి నన్ను నిట్టె
రాఁగిన సరసములు రచ్చలలోఁ దగునా

రేకు: 0266-2 పాడి సం: 09-092

పల్లవి: ఇందుకేమి దోసమా యింతలోనిపని కేమి
కందుఁ గుందు నేరుపుచేఁ గప్పి పోయఁ బో

చ. 1: చక్కని నీ వదనము చందరునికంటె మేలు
ముక్క పోయినది నీ మోవి యింతె పో
మిక్కిలి నీతురుమిది మేఘముకంటె మేలు
చిక్కువడి జారివది సిగ్గువాటి పో

చ. 2: నిచ్చలు నీ దేహ మిది నీలముకంటె మేలు
పచ్చియై వున్నది నీ భావ మింతె పో
తచ్చిన నీ కరములు తామెరకంటె మేలు
కొొచ్చి దయలేనిది నీ కొనగోరె పో

చ. 3: పమ్మిన నీ కాఁగిలిది పానుపు కంటె మేలు
వుమ్మచెమటలఁ దోఁగె వుర మింతె పో
యెమ్మెల శ్రీ వెంకటేశ యిన్నిటా నీవు మేలు
చిమ్మి చిక్కించేది నీ చెలువమె పో

రేకు: 0266-3 భైరవి సం: 09-093

పల్లవి: విన్నపాల కెవ్వరికి వేళ గాదు
వున్నతి నంతరంగాన నున్నాఁడు దేవుఁడూ

చ. 1: సరుస చెమటలు మేన జారఁ గాను
నిరతపు నిట్టూరుపు నిగుడఁగాను
సరిఁ గరఁగి జవ్వాది జారఁగాను
వొరసి మలఁగుమీఁద నున్నాఁడు దేవుఁడూ

చ. 2: తెల్లని కన్నుల నిద్ర దేరఁగాను
చిల్లరై గంధపుబేఁట్లు చిట్లఁగాను
వొల్లనె కొప్పున విరు లొలుకఁగాను
వుల్లసాన నరవిరై వున్నాఁడు దేవుఁడూ

చ. 3: అలమేలుమంగ మేలమాడఁగాను
కలయఁ దమకములు గదుమఁగాను
అలరి శ్రీవెంకటేశుఁ డల్ల వాఁడె
వొలిసి యేకతమున నున్నాఁడు దేవుఁడూ

రేకు: 0266-4 శుద్ధవంతం సం: 09-094

పల్లవి: తిట్టనేర్తునా నిన్ను దీవించ నేరుతుఁ గాక
దిట్టనై నీకు మోహించు తెరవ నేఁ గాక

చ. 1: కోరి నీ వేమి సేసినఁ గోపగించ నేరుతునా
నేరుపునఁ జెక్కు నొక్క నేరుతుఁ గాక
సారె నిన్ను వెంగెమాడి జరయఁగ నేరుతునా
ఆరీతినె నిన్నుఁ గొనియాడ నేర్తుఁ గాక

చ. 2: చీకాకుమై చూచి వుదాసీనము సేయ నేర్తునా
నీకు నేఁ బ్రియము చెప్ప నేరుతుఁ గాక
ఆకడ నీనిట్టూర్పుల కదే మన నేర్తునా
దీకొని నీ యల పెల్లఁ దీర్చ నేర్తుఁ గాక

చ. 3: కామించి మొక్కఁగ నిన్నుఁ గాల దొబ్బ నేరుతునా
నేమమునఁ గాఁగిలించ నేరుతుఁ గాక
గోమున శ్రీవెంకటేశ కూడితివి బాస సేసి
యీ మేలు మరవ నే నెంతైన నేర్తునా

రేకు: 0266-5 మంగళకౌశిక సం: 09-095

పల్లవి: సారిది నీ జాడ లెల్లఁ జూచుట గాక
యెరవు సతము లెంచ నిఁక నేల విభుఁడా

చ. 1: నీవే నే నైతే నిలుచుందువా ఆడ
వోవరి నామీఁద నొరగుందువు గాక
పూవే పిందైతే పూఁప లనే మాఁట లేల
చేవదీరి శమువలెఁ జెప్పి చూపుఁ గాకా

చ. 2: తమకమే కలిగితే దవ్వుల మాటాడుదువా
అమరి నాతో నేకత మాడుదు గాక
కమలమే కలువైతేఁ గడరేయి మొగుచునా
సమమై కాంచనముల జాడ నుండుఁ గాక

చ. 3: చిత్తము లేకము లైతేఁ జేతి కిత్తువా విడెము
పొత్తుల మోవినె అంది యిత్తువు గాక
యిత్తల శ్రీవెంకటేశ యిటు గూడిన నీ పొందు
హత్తి పాలునీరువలె నైక్యమాయఁ గాక

రేకు: 0266-6 పాడి సం: 09-096

పల్లవి: అక్కలాల అమ్మలాల అందరు నున్నా రిదె
చెక్కుచేత నుంటిఁ గాక సిగ్గువడి వుంటినా

చ. 1: వుండి వుండి నాలోన నుసురంటి నింతె పో
అండ నేఁ దను వెంగెము లాడితినా
దండియై కన్నీళ తోనే తప్పక చూచితిఁ బో
నిందుఁ గొలువునఁ దన్ను నేరము లెంచితినా

చ. 2: నా తమకములు చూచి నవ్వుకొంటి నింతె పో
చేతికి లో నని తన్నుఁ జెనకితినా
మోతలఁ గాఁకలతోనే మోము వంచితి నింతెపో
పై తరవువెట్టి తన్ను బలిమి సేసితినా

చ. 3: కడలేని మోహమునఁ గాఁగిలించితి నింతెపో
వుడివోని వెరగుతో నూరకుంటినా
యెడలేక శ్రీవెంకటేశుఁడు న న్నేలఁగాను
కడు నే మెచ్చితిఁ బో కాదంటినా

రేకు: 0267-1 సామంతం సం: 09-097

పల్లవి: తొల్లిసేసినంతె చాలు తోడఁ జేతనం బెట్లు
చిల్లరచేఁతలు యిఁక జేయఁగ వద్దనవే

చ. 1: గొల్లెత లుసురు పిల్లఁగోవిమోతలై యంటె
వొల్లనె నన్నిఁక నేప నొద్దనవే
మెల్లనె వారితొ బొంకిమే నెల్ల నల్ల నాయ
కల్లలు నాతో నాడఁ గమ్మటి వద్దనవే

చ. 2: నెలఁతల కనుదిష్టి నెమలిచుంగులై యంటె
వలఁబెట్టి చలపట్ట వద్దనవే
అల మదరాగము పీతాంబరమై మొల నంటె
యెలయించి ననుఁ బాయ నింకా వద్దనవే

చ. 3: చేరినవారి పొందులు శ్రీసతియై వుర మంటె
వోరసేయ నాతో నొద్దనవే
యీరీతి శ్రీవెంకటేశుఁ డిట్టె తా నన్నుఁ గూడి
గారవించె నిఁక నెందూఁ గదల వద్దనవే

రేకు: 0267-2 శంకరాభరణం సం: 09-098

పల్లవి: నాకు నాకే వెరగయ్యీ నన్నుఁ జూచి
పైకొని మరుఁడు సేసే భ్రమత గాఁబోలును

చ. 1: పులకించితి నింతె పూవుల మొగ్గలు రాలీ
కలికి వసంతము గాఁబోలు
పలికితి నింతె నేను పైకొనీ కెంజాయకెంపు
కలయగ నెరసంజ గాబోలును

చ. 2: విందుల నవ్వితి నింతె వెన్నెలపాలపుగాని
కందువ చంద్రోదయము గాఁబోలును
ముందరఁ జూచితి నింతె ముంపు దామెరలు రాలీ
దిందుపడి యింతలోనె తెల్లవారఁబోలును

చ. 3: చెమరించితి నింతె నేసముత్యములు రాలీ
తమి శ్రీవెంకటపతి దగ్గరఁ బోలు
అమరఁ గూడితి నింతె ఆతఁడు మేను మరచె
సమమోహములలోని సందడి గాఁబోలును

రేకు: 0267-3 దేసాళం సం: 09-099

పల్లవి: ఇందరు సవతులకు నిటు నేనె గురియా
సందడి నాతనినే జరయ రాదా

చ. 1: కోరి నన్నుఁ జూచి చూచి కోపగించే వది యేమే
ఆరీతి నాతఁడు మాటలాడ కుంటేను
సారె వెంగెమాడేవు చలమున నిది యేమే
రారాఁపై నీ కడకు రాకుంటేనూ

చ. 2: వున్నట్టె నామాట విని వుస్సురనే వది యేమే
అన్నిటా నాతఁడు మేలమాడఁ దంటాను
కన్నులఁ దప్పక చూచి గదరుకొనే వేమే
మన్నన నాతో సరి మన్నించఁ డనుచు

చ. 3: నాలి నా యెదుట నీవు నవ్వు నవ్వే వేమే నిన్నుఁ
బోళిమితోఁ బొంది నన్నుఁ బొందె నంటాను
అలరి శ్రీ వెంకటేశుఁ డాతఁడేమి సేసినాను
నీలాగు భాగ్యము గాక నే నేమి సేతునే

రేకు: 0267-4 బౌళి సం: 09-100

పల్లవి: అయినట్టయ్యీఁ గాని అల్లాడనే
పయిపూఁత సటమాని పదరాదా

చ. 1: కన్నులఁ జూడనిదానవు మమ్మూఁ గవకవ నవ్వనేలెనీ
చిన్నిమోమెత్తనిదానవు చెక్కుచెమరించనదియేలె
కన్నె సిగ్గువడ్డదానవు నన్నుఁగడునిక్కిచూడనేలె యీ
పన్నెటి మాయలు మాని పదరాదా

చ. 2: పొంచి మాటాడనిదానవు మాతో బొమ్మలజంకించనేలె నా
మంచానకు రానిదానవు నీవు మరి వుస్సురననేలె
కంచపు పంతపు దానవు మా కత లాలకించ నేలెయీ
పంచల మాయలు మాని పదరాదా

చ. 3: వొలిసీ నొల్లనిదానవు నీ వొళ్లు పులకించ నేలె నేఁ
గలసితి శ్రీ వెంకటపతిని
బలిమిఁ బెనఁగేదానవు యిట్టె పరవశ మందనేలెనీ
పలుకుల మాయ మాని పదరాదా

రేకు: 0267-5 సామంతం సం: 09-101

పల్లవి: ఆఁటదాని కింత యేల అంతలోని పనికిఁగా
పూఁటపూఁటఁ దనతో నేఁ బోరనేలా

చ. 1: వలవని పతికె వలచే యా రోఁత లేల
మలసెటి విరహాగ్నిమంట లేదా
పలుకని పతితోఁడఁ బలుకఁగ నది యేల
ములుగుచుఁ బానుపుపై మోనము లేదా

చ. 2: యింటికిరానిపతికి నెదురు వోవఁగ నేల
జంటయి మునుఁగఁ జింతాజలధి లేదా
నంటులేని పతితోడ నవ్వఁబో నంత యేల
అంటరాని చిగురాకుటమ్ములు లేవా

చ. 3: కడదొక్కె పతితోఁడఁ గాఁగిలించ నిది యేల
ముడిచి యవ్వలి మారుమోము లేదా
అడరి శ్రీవెంకటేశుఁ డాదరించి నన్నుఁ గూడె
సడి వూరకే యంటి సరసము లేదా

రేకు: 0262-6 సాళంగం సం: 09-102

పల్లవి: చెప్పకువే వానిసుద్ది చెవు లెల్లాఁ జిల్లు లయ్యీ
దప్పిదేరెఁ జాలు చాలు తానె బదుక నీవే

చ. 1: వొక యింతికిఁ బుట్టి వొకరికొడుక ననె
అకట నేఁ దిట్టఁగా దా నటు రోసీనా
వికటించి మేనమామ వీటి కేఁగి తానె చంపె
యెకసక్కెఁడు వీనితో నేఁటి చుట్టరికమే

చ. 2: కొడుకు దెచ్చినయట్టి కొమ్మలు పదారువేల
యెడరై పెండ్లాడెఁ దన కేఁటి వావే
చిడుముడి గొల్లెతల చీరలు దొంగిలినట్టి
అడిబండనికి నేఁటి యాచారమే

చ. 3: శ్రీ వెంకటాద్రి మీద శ్రీసతి నురాన మోచె
యీవలఁ దనకు నిఁక నేఁటి సిగ్గే
కావించి నన్నుఁ గూడి కమ్మరఁ బ్రియము చెప్పె
యీవేళ వెనక యెంచ నిఁక నేఁటికే

రేకు: 0268-1 సాళంగనాట సం: 09-103

పల్లవి: సటలకు జంపు నాతో జరపీఁ గాక యిట్టె
కటకటా నిజ మెల్లఁ గానరాదా నాకు

చ. 1: కడుమోహము నాపైఁ గలవాఁడె తా నైతె
యెడమాట లాడుదాఁకా హృదయము నిలిచీనా
వొడఁబాటులేమి గల్లా వొద్ద నాతో నాడుఁ గాక
విడువు మనవె యిట్టివేషము లెరఁగనా

చ. 2: కరుణె తనమతిఁ గలిగినవాఁ డైతె
అరయ నాహార నిద్ర లాడఁ దన కింపౌనా
కొరతలేమిగల్లాఁ గోరి నాతో నాడుఁ గాక
వెరవున విడు విడు వేసా లెరఁగనా

చ. 3: తానె నే నైతె తనువులు వే రౌనా
తానె మతికి మతిఁ దారుకాణ లౌఁ గాక
యీ నెపాన శ్రీవెంకటేశుఁడు నన్నుఁ గూడె
వీనుల వినిన నింతె వేసా లెరఁగనా

రేకు: 0268-2 పాడి సం: 09-104

పల్లవి: కొండవంటి దొరతోడి కోపములేల
దండనె దవ్వుదవ్వుల దక్కుటింతె కాకా

చ. 1: పూచిన వెన్నెలలంటేఁ బుప్పొడి వెదక నేల
చూచి చూచి కన్నులనె చొక్కుట గాక
యేచి నీవు నవ్వితే న దేమని యడుగ నేల
నాచుల మారుకు మారు నవ్వుటింతె కాక

చ. 2: నేతిబీరకాయంటే నేయి వెదకఁగ నేల
వూఁతగొని లోలోనె వూఁకొంట గాక
చేత నీవు విలిచితే చేరి దగ్గరఁగ నేల
మోఁతల నందుకు మెచ్చి మొక్కుటింతె కాకా

చ. 3: కోరి మోవితేనెలంటే గుక్కిళ్లు మింగ నేల
చేరి నిన్నుఁ గూడి యిట్టె చేకొంట గాక
ఆరయ శ్రీవెంకటేశ అంత నీతోఁ జల మేల
మేర మీరినట్టి నిన్ను మేలనుట గాక

రేకు: 0268-3 రామక్రియ సం: 09-105

పల్లవి: కందము విందము గాక కన్నులారను
అంది యెండ వెన్నెలైతే న దెవ్వరి మేలు

చ. 1: కానీవె అందు కేమి కా దనఁగ వచ్చునా
మోనానఁ దానంటేఁ జాలు మొక్కే నేను
పోనీ పోనీ వీరి వారి బుద్ధులైన వినేఁగా
అని వేము దియ్యనైతే నదెవ్వరి మేలు

చ. 2: తనలోనె నవ్వనీవే దాని కేమి దోసమా
వొనర మమ్ముఁ జెనకకుంటేఁ జాలు
కననీ కననీ తన కడలచుట్టరికాలు
అనుమె మిను మైతేన దెవ్వరి మేలు

చ. 3: మేలు మేలు యిది యేమె మేనవావి బలువా
యీలీల నన్నుఁ గూడె నింతే చాలు
అలరి శ్రీవెంకటేశుఁ డంతటివాఁ డౌఁ గా
ఆలు మగఁ డొక్క టైతేనదెవ్వరి మేలు

రేకు: 0268-4 హిజ్జిజి సం: 09-106

పల్లవి: దక్కె నీకుఁ బంతము తగు నింక సంతము
మక్కువఁ గలసి యనుమాన మింకానా

చ. 1: పచ్చికస్తూరినామము పాదపులత్తుక లాయ
కొచ్చి పతిమీఁద నేలె కోప మింకాను
నిచ్చ సిరసు విరులు నీకుఁ బాదపజ లాయ
దిచ్చరి నీ యలుకింకాఁ దీర దాయనా

చ. 2: పతివదనము తమ్మపడిగ మాయ నీకు
మతిఁ జల మింకా నాకు మానదటవే
ఆతని చెక్కు చెమట లర్ఘ్యపాద్యము లాయ
తతి నీగుండె గరఁగదా యింకాను

చ. 3: మంచి మంచి వుంగరాల మాణిక పు మట్టెలాయ
మంచ మెక్కి వుండి యడమాట లింకానా
వంచనై శ్రీవెంకటేశు వావి వరుసయుఁ గూడె
అంచె రతులఁ గూడితి వాస లింకానా

రేకు: 0268-5 పాడి సం: 09-107

పల్లవి: ఎట్టు గెలువఁగ వచ్చు నిట్టి వానిని
మెట్ట వచ్చీ నా కాలు మేలు గాదా

చ. 1: కొచ్చి కొచ్చి తన్నునేఁ గోపగించఁగా తా
నచ్చపు నవ్వులు నవ్వీ నంతె కాదా
వొచ్చ ముదనందు నే నొగిఁ జూపఁగా నన్ను
మెచ్చి చేయి వేయ వచ్చీ మేలు గాదా

చ. 2: వెక్కసమై తన్ననే వెంగెమాడఁగా తా
నక్కడివా రందు మోపీ నంతె కాదా
తెక్కుల నేఁ దన్ను దూరి తిట్టఁ గానె నేఁడు దా
మిక్కిలి నన్ను దీవించీ మేలు గాదా

చ. 3: కడుఁ దమకాన నేఁ గసరఁగా తా
నడరి కాఁగిట నించీ నంతె కాదా
యెడయక శ్రీ వెంకటేశుఁ డిటు గూడి నా
మెడ యెత్తి చెక్కు నొక్కీ మేలు గాదా

రేకు: 0268-6 సామంతం సం: 09-108

పల్లవి: పోపో నీ పోలికలు పోలుచకురా అయితే
నీ పోలికలసాటె నే నయ్యేనే

చ. 1: పాముపడుకవాఁడ పట్టకురా ఆ
పామువంటి యారు నీకుఁ బాయదు గదే
గామిడి చక్రమువాఁడ కదియకురా వో
చామ నీ పిఱుఁదు ఘనచక్రము గాదా

చ. 2: నెమలిచుంగులవాఁడ నిలు నిలరా ఆ
నెమలినడపు లెల్లా నీకు లేదటే
తమి సంకుఁ బేరివాఁడ తడవకురా
అమరె నీ మెడ శంఖ మదె కదవే

చ. 3: కొండపయి శ్రీ వెంకటేశ కొంకనేలరా ఆ
కొండలకు చాలు నీకుఁ గొలఁదె కదే
నిండుఁ గాఁగిటను నన్ను నించితి వపురా
నిండుఁగళలమోము నెలఁతవు గదవే

రేకు: 0269-1 ముఖారి సం: 09-109

పల్లవి: కాఁగలదయ్యీఁ గాక కాఁక లేఁటికే
దాఁగ నేల యింతలోనె తానె నే ననవే

చ. 1: కంటిచూపు వాఁ డాయ కమ్మనవ్వు వేఁ డాయ
యింటిలో నింకా బుద్ధులేమి చెప్పేవే
కుంటెనలు విసుపైఁ గోరికలు ముసిపై
అంటఁగాక వున్నదాన నానవెట్ట నేఁటికే

చ. 2: మంతనాలు దరచాయ మాటపట్టు గురుచాయ
యెంత కెంత వొడఁబాట్లిఁక నేఁటికే
దొంతులాయఁ గూరిములు దూరులాయ నేరములు
వంతులు వాసులు నింక వద్దనవే

చ. 3: చిత్తమెల్ల నీ రాయ సిగ్గు లెల్ల జారాయ
యిత్తల వెనకసుద్దు లిఁక నేఁటికే
అత్తిన శ్రీవెంకటేశుఁ డాదరించి నన్నుఁ గూడె
తత్తరపు వేడుకలు దలకూడెనే

రేకు: 0269-2 మంగళకౌశిక సం: 09-110

పల్లవి: ఏకచిత్త మైనప్పు డిన్నియు మరెయ్యాఁ గాని
నాకు నీ వేళకు నీ నవ్వులె చాలు

చ. 1: చిక్కువడివున్నది నాచిత్తము నీ
చెక్కులఁ జిందరలైన జీరలవలె
చక్క నన్ను మాటాడించకురా నీవూ నీకు
మొక్కేను నా కింక మోనమె చాలు

చ. 2: కడుఁ గాఁక రేఁగె నా కాయము నీ
కడల పుక్కిటతమ్మకారమువలె
పడి నా పయ్యెదకొంగు పట్టకురా నీకు
వెడఁ బంత మిచ్చే నాకు విరహమె చాలు

చ. 3: పరవశమాయ నా భావము
గరిమ నిద్దురల నీ కన్నులవలె
యిరవై శ్రీవెంకటేశ యేలితివి యిది
మరిగితిమి నాకు నీ మన్ననె చాలు

రేకు: 0269-3 ఆహిరి సం: 09-111

పల్లవి: ఇట్టిదివో సతిమోహ మిదివో మా విన్నపము
యెట్టు వలసినఁ జేయు మిఁక నీచిత్తము

చ. 1: తరుణి నీకు వలచి తనువె మఱచెఁ గాని
మరులు నీపై భక్తి మఱవదు
గిరమ విరహవడఁ గన్నులు మూసెఁ గాని
నిరతి నీవు వచ్చే వని తలుపే మూయదు

చ. 2: నిండు నీపై చింతచేత నిద్దుర విడిచెఁ గాని
దండి నీ నామజపము తా విడువదు
అండనె సింగారించె యాసలె మానెఁ గాని
నిండుఁ జేత నీకు మొక్కే నేమమే మానదు

చ. 3: చిక్కి యిట్టెఁ నిన్నుఁ గూడి సిగ్గులతోఁ బాసెఁ గాని
తక్కక నీ సరసము తాఁ బాయదు
మిక్కిలి శ్రీవెంకటేశ మెచ్చ నిన్ను నేర్చెఁ గాని
చక్క నీ వెటు సేసినా సాదించ నేరదు

రేకు: 0269-4 శ్రీరాగం సం: 09-112

పల్లవి: ఇంతికి నీ వెరవా యిచ్చకా లెరవు గాక
మంతనము నీకు లేదా మారు లేదు గాక

చ. 1: తలపోఁత గరవా తరుణిట్టె నినుఁ బాసె
కలది నెన్నడు మనె కరవు గాక
పులకలుగొంచమా పొలిఁతి నిన్నిటు చూడ
కొలఁదివాఁడిన మోమె కొంచము గాక

చ. 2: జాగర మేమి దొడ్డా సతితో నీ వలుగఁగా
తోఁగిన నీటికన్నులె దొడ్డ గాక
బాగుల నిన్నద్దలించ బరవా బొమ్మలను
పాఁగిన యింతికుచాలె పై తరవు కాక

చ. 3: ఆయములు దాఁకవా అంగజుఁడు చెలి సేసె
దాయపుఁ గోరిక కొనదాఁకదు గాక
యీయెడ శ్రీవెంకటేశ యింతి నిట్టె కూడితివి
మాయలా యిన్నియును నీ మన్ననలె కాక

రేకు: 0269-5 కాంబోది సం: 09-113

పల్లవి: విడు విడరే యీ విధ మేల సతి
బడి బడి నేఁటికి భ్రమయించేరే

చ. 1: కామాతురమున కలిగిన కాఁకలు
ఆమని పన్నీట నారీనా
నేమపు నీరువట్టు నేతఁ దీరునా
కామిను లేఁటికిఁ గారించేరే

చ. 2: చిత్తములోపలి చింతలచీఁకటి
యెత్తిన దీపాల నెడసీనా
గుత్తపుటాకలి గుక్కిళ్లఁ దేరునా
యిత్తల సతి నే లేఁచేరే

చ. 3: శ్రీవెంకటపతిఁ జెందెటి యాసలు
తావుఁ గుంటెనలఁ దనిసీనా
యీవేళనె చెలి నితఁడు గూడెను
నావల మీ రేల నవ్వేరే

రేకు: 0269-6 బౌళిరామక్రియ సం: 09-114

పల్లవి: ఒద్దు మమ్ముఁ జెనకక వుండుమనవే
యిద్దరము నెదురైతి మింతె పొమ్మనవే

చ. 1: పాలవంటికులము మా భావము నిచ్చలము
నాలి మమ్ముఁ జూచి యేల నవ్వీనె తాను
పోలింప మా యంకులును పుప్పొడిమై సంకులు
చాలు నిది చూచి తాను సన్నలేల సేసీనే

చ. 2: మోచేవి చల్లలు నేము ముడిచేవి మొల్లలు
పూఁచి యేల రట్టుసేసి పొంచీనె తాను
కాచేదా మా మందలు కడసారె నిందలు
యేచి తాను మమ్ము గేలి యేల సేసీనే

చ. 3: గుంపెన మా నడపు కొప్పు గడు నిడుపు
తెంపున మమ్మేల యింత తేల నాడీనే
యింపుల శ్రీవెంకటేశుఁ డింతలోనె మమ్ముఁ గూడె
సంపదల మమ్ము నేల సాదించీనే

రేకు: 0270-1 నాదరామక్రియ సం: 09-115

పల్లవి: చెల్లని చేఁతలు చెల్లీఁ జెలియ నీ కిట్లని
అల్లదె నీ పతి నిన్ను నడిగి రమ్మనెనే

చ. 1: నాతి నీ మోముఁ దమ్మిలో నవ్వువెన్నెలలు గాసె
యీతల నందుకు నిందు కేమి వోదే
నీతుల నీ యెదుటను నీ రమణుఁ డిటు చూచి
ఆతల నీ భావము అడిగి రమ్మనెనే

చ. 2: కేరి కన్నుఁగలువల కెంపు సూర్యోదయ మాయ
యేరీతి నందుకు నిందు కేమి వోదే
కారణము లేని చేఁత కమ్మర నీ పతి చూచి
ఆరసి నీ భావము అడిగి రమ్మనెనే

చ. 3: జక్కవచన్నుల మీఁద చంద్రవంక లటు నించి
తక్కి శ్రీవెంకటపతి తానె చూచె
యిక్కువతో నిన్నుఁ గూడి యెదురుమేడ యెక్కి
అక్కడ నీ భావము అడిగి రమ్మనెనే

రేకు: 0270-2 సామంతం సం: 09-116

పల్లవి: నీకు నీకె మాకు మాకె నేరుపులు
ఆకడ నీకడ నేమంత కోపఁ గలమా

చ. 1: మందమిరియాలువో నీమాటలు
నిందలకు గురివో నీనీటులూ
సందడిఁ బెండ్లివో నీ సరసాలూ
అందపు రమణుఁడ నే మంత కోపఁ గలమా

చ. 2: సూదుల మూటలువో నీ సుద్దులూ కడుఁ
బోది సేసేకొలఁది నీబుద్దులు
గాదెల కొలుచువో నీ గాథలు
ఆదెస నీదెస నే మంత కోపఁ గలమా

చ. 3: ముట్టితేనె ముయివో నీ మొక్కులు
చెట్టునఁ జేటఁడువో నీచిక్కులు
గుట్టున శ్రీవెంకటేశ కూడితివి యిఁక
నట్టు నిట్టు నిన్ను నాడ నంత కోపఁ గలమా

రేకు: 0270-3 ముఖారి సం: 09-117

పల్లవి: అయినట్టయ్యీఁ గాక అంతయేఁటికే
పయిపైఁ గలపితివి పాఁచి యేఁటికే

చ. 1: వల్లెవాటుఁ బయ్యదతో వాడుఁగొప్పు విరులతో
చల్లె లమ్మె గొల్లెతవు జంకె నేఁటికే
చిల్లర చెమటతోడ చిక్కని వూర్పులతోడ
గొల్లలెక్క లాడేవు కోప మేఁటికే

చ. 2: పులకజొంపాలతోడ బొమ్మించు మోవితోడ
కొలచినందె కొలచి కొంక నేఁటికే
కలకల నవ్వుతోడ కందువ సిగ్గులతోడ
వెలయఁగఁ జెప్పేవు వింత లేఁటికే

చ. 3: పుక్కిటి విడెముతోడ పూఁతల గందముతోడ
అక్కునఁ బోసి చూపే వాన లేఁటికే
యెక్కువల శ్రీ వెంకటేశుఁడనైన నన్ను
గక్కనఁ గూడితి వింక గద్దించ నేఁటికే

రేకు: 0270-4 రామక్రియ సం: 09-118

పల్లవి: నీవే నే నైతిఁగా నేరుపు నేరాల కేమి
చేవ దేరెఁ జాలు చాలు చెప్పకు నీ సుద్దులు

చ. 1: తలఁ పొక్కటాయఁగా తమకము లెన్నియైనా
పలు కొక్కటాయఁగా పంతము లెన్నైనా
చలములు చెల్లెఁగా సాదింపు లెన్నియైనా
చెలువుఁడ చాలుఁ జాలు చెప్పకు నీ సుద్దులు

చ. 2: చన వెక్కు డాయఁగా సరసాలు గనమైనా
నను పిది గలిగెఁగా నాఁటకము లెన్నైనా
మన విది చెల్లెఁగా మంతనాలు దరచైనా
చెనకకు చాలుఁ జాలు చెప్పకు నీ సుద్దులు

చ. 3: కూటములు గలిగెఁగా కోరికలు దరచైనా
నీటుమీఁద మిక్కిలిగా నిండుఁ బరవసమైనా
యేటికి శ్రీవెంకటేశ యెనసితి మిద్దరము
చీటికి మాటికి నింకఁ జెప్పకు నీ సుద్దులు

రేకు: 0270-5 శ్రీరాగం సం: 09-119

పల్లవి: ఇంత చాలదా యింతి కిదొకటే
రంతుల రమణుని రప్పించెఁ గనక

చ. 1: పలికిన పలుకుకు పంతం బొకటే
వెలఁది విభుని నవ్వించెఁ గనక
నిలిచిన నిలువుకు నిచ్చల మొకటే
మలయని పతిఁ బెడ మరలించెఁ గనక

చ. 2: చూపు చూచుటకు సొద్యం బొకటే
యీపతిఁ జెమటల నెనపెఁ గన
తీపుల నటనకు తేజం బొకటే
కోపపుఁ బతి నూఁ కొనిపంచెఁ గనక

చ. 3: ఘనమగు రతులకుఁ గైవస మొకటే
పెనఁగుల మైమరపించెఁ గన
వనిత కిదొకటే వడి శ్రీ వెంకట
ఘనుని మన్ననలు గైకొనెఁ గనక

రేకు: 0270-6 సామంతం సం: 09-120

పల్లవి: ఇంత యాల అంత యాల యేమాయ నిపు డిట్టె
పంతపు పతికడకె పదరాదా

చ. 1: చెక్కిటిచేయి యేఁటికే చెలి నీ భావముచూడ
చక్కని తామెరమీఁదఁ జంద్రుఁ డున్నట్లు
యెక్కడి కెక్కడి పొందు లేమి గడించేవె
పక్కన పతికడకె పదరాదా

చ. 2: వున్నతిఁ గుచాలమీఁద నుసురనే విది యేమె
సన్నపుగాలి కొండల జడిసినట్లు
యెన్నటి కెన్నటి పొందు లిట్లేల సేసేవె
పన్ని నీ పతికడకె పదరాదా

చ. 3: చేరువఁ గాఁగిటిలోనఁ జెమరించే విది యేమె
చేరు ముత్యా లిటునటుఁ జిందినట్లు
కోరి శ్రీవెంకటపతికూడి మేడ యెక్కెఁ గృపా
పారీణుఁ డాతనొద్దకుఁ బదరాదా

రేకు: 0271-1 రామక్రియ సం: 09-121

పల్లవి: ఆడరాని చూడరాని యట్టి దొర వింతే కాక
యేడ నైనఁ జెలి నీకు నేమి సేసెనయ్యా

చ. 1: కాంత నీకు సన్న సేసె కమ్మరఁ బూబంతి వేసె
సంతమై మరుకాఁకల జలి గాసె
చెంత నీవు చూడఁగాను సిగ్గునఁ బయ్యద మూసె
యింతే కాక ఆకె నిన్ను నేమి సేసెనయ్యా

చ. 2: వలపు నీపై నించె వడిఁ బులకలు వెంచె
చెలప చెమట లవె చెక్కున ముంచె
నిలువు నీ చేఁతలకు నిట్టూర్పులఁ దలవంచె
యెలమి నిన్నాకె మరి యేమి సేసె నయ్యా

చ. 3: నీ యెదుటఁ దాఁ బొలసె నీటున నిన్ను సొలసె
కాయజకేలి నిన్నుఁ గడుఁ గలసె
పాయపు శ్రీవెంకటేశ పడఁతి నీతో వెలసె
యీయెడ నిందాఁక నాకె యేమి సేసెనయ్యా

రేకు: 0271-2 కాంబోది సం: 09-122

పల్లవి: నేఁడుగా యివి తనకు నాఁడె పో నాకు
కూడిన మీరు సాకిరికొమ్మలాల

చ. 1: తాలిమి లేక యిట్టె తనలోనె కోప ముంటె
నాలో నున్నవిగా నవ్వులు
నీలాన తనమాట చిరుచేఁదు లుంటేను
తేలెటి నా మోవిఁ గా తీపులు

చ. 2: తెంపుల తనబొమ్మల తిట్ల సొలపు లుంటె
వంపు నా రెప్పలఁ గా వలపులు
యింపు లేక తనమతి నెగ్గులును తప్పులుంటె
పెంపున నా కున్నవిగా పెను వేలి మొక్కులు

చ. 3: తమ్మి మరునేట్ల తనరు తమక ముంటె
చిమ్ముల నా కున్నవిగా సిగ్గులు
అమ్మరొ శ్రీవెంకటేశుఁడన్నిటా నన్నుఁ గూడె
కుమ్మరించె నాపై కొనగోరిసొమ్ములు

రేకు: 0271-3 కాంబోది సం: 09-123

పల్లవి: మున్నిటి తానెకాఁడా మోన మింకానా
కన్నులఁ జూచుట గాక ఘాత లింకానా

చ. 1: మాయల వేరొకతెతో మాటలాడఁ గానె
చాయల నేఁ జేసే సన్న లింకానా
ఆయెడ నా రాక గని అటు తలవంచఁగాను
యేయెడ నే దూరి తిట్టే దిది యింకానా

చ. 2: విరహపు నన్నుఁ జూచి వికవిక నగఁగాను
సరస నా బొమ్మల జంకె లింకానా
సిరుల నాకె దన చెలియని బొంకఁగాను
నిరతి నిజము గొల్పే నీటు లింకానా

చ. 3: యెదుట నామోము చూచి యింటి కిట్టె రాఁగాను
కొదలు గొణఁగుల నా కోప మింకానా
అదన శ్రీవెంకటేశుఁ డాదరించి కూడె నన్ను
కదిసి వుండెటె కాక కా దను టింకానా

రేకు: 0271-4 వరాళి సం: 09-124

పల్లవి: కంటి నే నంతలోఁ గడల మీ భావము
దంటలగు మీర లిద్దరు జాణలే

చ. 1: పెడమరలి అటుచూచి పెదవులనె నినుఁ దిట్టి
పడఁతి మరలెను నీవు పై కొనినను
గొడఁగుచును బొమ్మలనె గొబ్బుననుఁ గోపించి
అడఁగి తలవంచె నీ వపు డేమి సేసితో

చ. 2: తళుకునను నిన్నుఁ గనుఁదమ్ములనె జంకించి
బెళకి నిలిచెను నీవు పేరుకొనఁగ
పులికిపడి నిన్ను నిట్టూర్పులనె కడుఁ గసరి
చెలుల మొరఁగెను నీవు చెనకఁగాను

చ. 3: కొమ్మ కాఁగిటఁ గూడి కొనగోర నిను నడిమి
వుమ్మడిఁ గమ్మరఁ దానె వూరకుండి
చిమ్ములఁ బూఁబొదరింట శ్రీవెంకటేశ్వరుఁడ
నెమ్మది నుంటిరి కళలునిండె మోమునను

రేకు: 0271-5 సాళంగం సం: 09-125

పల్లవి: ఇందుకంటె నేమి సేతు నిదివో నేను
వొందిలిఁ దాఁ బిలిచితే నూఁకొనునా నేను

చ. 1: ఆనిపట్టి తనతో నలిగి వుందాననా
మోనానఁ దన కిప్పుడు మొక్కనా నేను
మానుపడి తనపొందు మానితినా తొల్లి టట్టె
కాను కియ్యనా నేఁడు కడనుండి నేను

చ. 2: గొంటుఁ దనమున నేఁ గోపగించు కుందాననా
వొంటిఁ దలవంచు కొద్ద నుండనా నేను
దంటనై నేఁ జలపట్టి దగ్గర కుందాననా
అంటు ముట్టు గలదాన నాడ నుంటి నేను

చ. 3: కాంతుఁడు కొంగువట్టఁగాఁ గైకొన కుందాననా
అంతలోనె పరవశ మందనా నేను
చింత దీర నన్నుఁ గూడె శ్రీ వెంకటేశ్వరుఁడు
వింత సొబగుల విఱ్ఱవీఁగనా నేను

రేకు: 0271-6 సామంతం సం: 09-126

పల్లవి: విన్నవించనేల యిందు వేమారుఁ దనతో
యెన్నిక నేఁ జేసేదేమి యిఁకఁ దనచిత్తము

చ. 1: చెప్పరాని చూపరాని చిత్తములో మర్మము
అప్పసము నాలోని అడియాస యిదిగో
కప్పియుఁ గప్పగరాని కన్నులలో మర్మము
దప్పి దేరిచే చక్కని తనరూపె పో

చ. 2: పట్టియుఁ బట్టఁగరాని పాయములో మర్మము
ముట్టుపడ్డ పతిమీఁది మోహ మిదిగో
కుట్టియుఁ గుట్టఁగరాని కుచముల మర్మము
పొట్టఁ బొరుగున రేఁగే పులకలు వో

చ. 3: అందియు నందఁగరాని ఆయముల మర్మము
సందడిఁ బరవశాల సంగతిదివో
కందువ శ్రీవెంకటేశుఁ గలసిన మర్మము
గొందినె యీతని గోరిగురుతులె పో

రేకు: 0272-1 లలిత సం: 09-127

పల్లవి: చెల్లుఁ జెల్లు నీకు నాకు సిగ్గు మరఁగు
యెల్లభావము గంటి మిఁక నేల మరఁగు

చ. 1: మోవిమీఁది కెంపులకు మోనమె మరఁగు
కావికన్నులకు నిద్ర కడు మరఁగు
తేవల నిట్టూర్పులకు తీగెనవ్వే మరఁగు
యీవిధాలు గంటి నాతో నిఁక నేల మరఁగు

చ. 2: చెక్కులచెమటలకు చెంపచేయి మరఁగు
మిక్కిలి వులకలకు మెయిపూఁత మరఁగు
తక్కి మోము వాఁడుటకు తమ్ములము మరఁగు
యిక్కడ నిన్నిఁ గంటి నిఁక నేల మరఁగు

చ. 3: కూడినకూటమునకు గుట్టు యిదె మరఁగు
జాడల నీ మేనికి నా చన్నుదోయి మరఁగు
వేడుకకు శ్రీ వెంకటేశ వేసాలు నీ మరఁగు
యీాడ నిన్నిఁ బచ్చిదేరె నిఁక నేల మరఁగు

రేకు: 0272-2 శుద్ధవసంతం సం: 09-128

పల్లవి: ఎందు వోయీ నింతలోనే
యెందు నుప్పుచింది యినుమడిఁగాకా

చ. 1: పంతమా నీతోఁ బలుమారును నీ
వెంత సేసినా నెరిఁగేము గాకా
వంతులా మారువడిఁ దిట్టను
అంతయు నొకపక్క నణఁగుండిఁ గాక

చ. 2: యెమ్మెలా నీతో నెదురాడను నీ
దిమ్ముఁ జేఁతలు దెలిసేము గాక
కమ్మరా నిన్నుఁ గాదనేమా
కిమ్ములా నిన్నుఁ గీర్తించేఁ గాకా

చ. 3: చలవ నిన్ను సాదించను నీవు
చెలిమిఁ గూడఁగాఁ జేకొంట గాకా
అలరు శ్రీ వెంకటాధీశుడా నీ
వలపు గాగిలె వైపాయఁగాక

రేకు: 0272-3 కాంబోది సం: 09-129

పల్లవి: ఇంత చాలదా మాకు నిదినేఁడు
కంతునివోజల పెండ్లి గలిగెఁ గా నేఁడు

చ. 1: కాంతకును నీకును కనురెప్పలె తెర
దంతపు నవ్వులె మీకు తలఁబాలు
రంతుల వూరుపలె రవళి సోబనాలు
చెంతల మీ కీ పెండ్లి చెల్లెఁగా నేఁడు

చ. 2: ముదితకు నీకును మోవులె బువ్వములు
కదియు సిగ్గులె మంచి కమ్మగందాలు
సదరపు సరసాలె చల్లు వెదవీడేలు
యెదుదెదురనె పెండ్లి యెసగెఁగా నేఁడు

చ. 3: వుంచపు గోరితాఁకులె వుంకువ సొమ్ములు
ముంచిన పలు సోఁకులె ముయికిముయి
యెంచఁగ శ్రీవెంకటేశ యిందిర నీ కూటములు
కంచపుఁ బెండ్లి మీకుఁ గలిగెఁగా నేఁడు

రేకు: 0272-4 సామంతం సం: 09-130

పల్లవి: తగుమాట లేమిగల్లా దవ్వులఁ జెప్పుదుగాని
అగడయ్యీ నీవు నన్ను నంత దగ్గరకురా

చ. 1: యెగరే జక్కవలు యిదివో నాకుచములు
గగనపు చకోరాలు కనుఁగవలు
తొగరుఁ దుమ్మిదలు నాతురు మిదివో నేఁడు
బెగడుఁ జేసు నన్ను బెట్టి పిలువకురా

చ. 2: కొండలసింహము నా కొనబైన నడుము
గండు మీరి నా పిరుఁదు కరికుంభాలు
నిండిన నా పాదములు నీటిలోని తాఁబేళ్ళు
చండిపడ నీవు నన్ను సారెఁ జెనకకురా

చ. 3: మించులమెరఁగు లివి మేఁటి నాతనువు
దించని తేనెల పెరతీపు నా మోవి
అంచల శ్రీవెంకటేశ అంతలోనె కూడితివి
యెంచఁగ నిన్ను మరిగె నిన్నిటాఁ బాయకురా

రేకు: 0272-5 ఆహిరి సం: 09-131

పల్లవి: అయ్యో తా నేమని నప్పటిఁ దాను
పయ్యదలో సిగ్గు దాఁచి బడలఁగాను

చ. 1: చూపులనె గుండె వట్టి సుద్దులనె మిన్ను ముట్టి
దాపు సేసుకొని తన్నుఁ దలఁచఁగాను
తీపు మేలములఁ జిక్కి దిక్కులఁ దనకు మొక్కి
తోపు నూకుడు వయసు దొబ్బఁగాను

చ. 2: ఆసఁ బులకలు వెంచి అంగము చెమట ముంచి
బాసలు తనవి నమ్మి బతుకఁ గాను
వాసికిఁ దనువు మోచి వంతుకుఁ బ్రాణముగాచి
వోసరించి వూరకె నే నుండఁగాను

చ. 3: తానె నే నని యాడి దగ్గరి కాఁగిటఁ గూడి
నానిన నవ్వులు గుట్టు నడపఁగాను
యీ నెపాన శ్రీ వెంకటేశుఁ డింతలో నన్ను
పూనుక మన్నించె నని పొగడఁగాను

రేకు: 0272-6 బౌళి సం: 09-132

పల్లవి: మేఁటులాల బోఁటులాల మీ రెరఁగరా నన్ను
నీటునఁ దా నొద్ద నుంటె నేర మెంతునా

చ. 1: మోము చూడఁగా నేను మొరఁగి నవ్వితిఁ గాక
తా ముందు వూరకుంటెఁ దడవితినా
ప్రేమమునఁ బిలువఁగా బెట్టి వూఁకొంటిఁ గాక
దోమటిఁ దడవకుంటె దొమ్మి సేతునా

చ. 2: చెక్కు నొక్కఁగా నే జీర వారించితిఁ గాక
చక్క నుంటెఁ దన్ను నే సాదింతునా
నిక్కి పూవుల వేయఁగా నీటునఁ దిట్టితిఁ గాక
మిక్కిలి గుట్టున నుంటె మితిమీరుదునా

చ. 3: బలిమిసేయఁగఁ దన్నుఁ బైకొని కూడితిఁ గాక
చలమునఁ బంత మంటె సాగనిత్తునా
యెలమి శ్రీవెంకటేశు నింపులఁ జొక్కితిఁ గాక
తలఁ పెరఁగక వుంటె దగ్గరుదునా

రేకు: 0273-1 శుద్ధవసంతం సం: 09-133

పల్లవి: చాలుఁ జాలు నేతులు సటలు నీ రీతులు యీ
నీలిచేఁతపతిఁ గాక ని న్నేమనేదే

చ. 1: వద్దేలె మాటలు వలవని నీటులు
వొద్దనె నే మింతలేసి కోపుదు మటే
యిద్దరిలో నినుఁ బెంచి యింత సేసె నాతఁడు
నిద్దమై యాతనిఁ గాక ని న్నేమనేదే

చ. 2: ఔనె నీ సుద్దులు ఆడెటి బద్దులు
వూని యింతలేసికి నే నోపుదునటే
యీ నీకుఁ జిన విచ్చి యింత సేసె నాతఁడు
నే నింకా నాతనిఁ గాక ని న్నేమనేదే

చ. 3: పోపో నీ కతలు పోకుల నీ గతులు
వూఁపుల రాఁపుల నే నోపుదు నటే
యేపున శ్రీ వెకంటేశుఁ డింతలో నన్నుఁ గూడె
నీ పొందులాతనిఁ గాక ని న్నేమనేదే

రేకు: 0273-2 సామంతం సం: 09-134

పల్లవి: చాలుఁ జాలుఁ బొగడకు జాణకాఁడే
నాలి నేఁ దనిసితిఁబో నాఁడు నాఁడే

చ. 1: తనకు వలచినట్టి తరుణి సూర్పనకను
పెను ముక్కుగోసిన బీరగాఁదే
మునుపనె వుపకారము నున్న బలి నట్టె
పనివడి కట్టినట్టి పంతగాఁడే

చ. 2: కోరి తన్నుఁ గూడినట్టి గొల్లల మానములు
మేర మీరి చేకొనిన మేటివాఁడే
కౌరవులఁ బాండవులఁ గడుఁ జుట్టాల నెల్ల
పోరువెట్టి యంపినట్టి పుణ్యపువాఁడే

చ. 3: నిండు పురమున నింతి నిలిపి శ్రీ వెంకటాద్రి
కొండమీఁద నెక్కుకొన్న కోడెకాఁడే
అండనిట్టె నన్నుఁ గూడి ఆయము లంటిమెప్పించి
దండియై మెరసినట్టి దైవపువాఁడే

రేకు: 0273-3 ముఖారి సం: 09-135

పల్లవి: పదిలమై వుందుగాని పదరకుమీ
వెదకితేఁ జూపవలె వెస జుమ్మీ విభుఁడ

చ. 1: అందపు నీ మోవితేనె లాని యాని యెవ్వతో
అందుపైఁ గెంపులు నించె నదె చూడుమా
పొందుల నదెవ్వరికి పొరసి నీ వియ్య కుండా
కందువ మెత్తులు వేయు గతి సుమ్మీ విభుఁడ

చ. 2: చక్కని నీ దేహమంటి సారె సారె నెవ్వతో
అక్కడ రేకలు నించె నది యెవ్వతో
గక్కన వేరొకతెకుఁ గాఁగిలి నీ వియ్యకుండా
లెక్కల లచ్చెనవెట్టే లీల సుమ్మీ విభుఁడ

చ. 3: కూరిమి నీ రతిఁ గూడి గురుతుగాఁ గుచముల
కోరి ముద్ర లురమునఁ గుంకుమ నొత్తె
ఆరీతి శ్రీవెంకటేశ అరమరపంచినది
నేరుపరెవ్వరుఁ గారు నేఁ జుమ్మీ విభుఁడ

రేకు: 0273-4 ముఖారి సం: 09-136

పల్లవి: ఇంత సేసినట్టి పతి నే మందమే
మంతుకు నెక్కించినట్టి మనసు నే మందమే

చ. 1: చెక్కునఁ బెట్టెను చేయి చిత్తములోపలి నూయి
యిక్కడ నీసతి భావ మేమందమే
ముక్కునఁ గీలించె వేలు మొనగోర నదె వ్రాలు
మక్కువ యింతసేసిన మరుని నే మందమే

చ. 2: కన్నుల నించెను నీరు కలిగెఁ బయ్యద జారు
యెన్నఁగ నీ యింతి మోహమే మందమే
పన్నుకొనె నిట్టూర్పు పారదోసె తన నేర్పు
యిన్నిటాను నోముఫల మిఁక నే మందమే

చ. 3: చెలిపై వేసెను మేను సిగ్గుల మునిఁగెఁ దాను
యెలమి నీ చెలి మర పే మందమే
అలరి శ్రీవెంకటేశుఁ డంతలో విచ్చేసి కూడె
తలఁపు ప్రేరేచినట్టి దైవము నే మందమే

రేకు: 0273-5 శంకరాభరణం సం: 09-137

పల్లవి: ఏమి నెరఁగని బాల నేమి సేసితివో
ఆమని కాలములోనె అది యేమి సేసితో

చ. 1: కన్ను లెల్లఁ దెల్లనాయ కాయ మెల్లఁ జల్లనాయ
కన్నె నేమి సేసితివో కట్టా కట్టా
వన్నె మేనఁ జంజారేఁగె వాడుమోవి గడు మాఁగె
ఇన్నాళ్లవలెఁగాదు యేమి సేసితివో

చ. 2: కొప్పు గడుఁ జిక్కు వడె కుచములు తొక్కవడె
అప్పటి నేమిసేసితి వయ్యో అయ్యో
చిప్పిలె నిట్టూరుపులు సిగ్గులివె గొరుపులు
యిప్పు డిట్టె యీ సతి నేమి సేసితో

చ. 3: చెక్కు లెల్లఁ జెమరించె సెలవుల నవ్వు ముంచె
వొక్కమాటె యింత సేసి తోహో వోహో
నిక్కి శ్రీ వెంకటపతి నీవు గూడఁ బోలుదువు
యెక్కువ మేనిగుతురు లేమి సేసితో

రేకు: 0273-6 కాంబోది సం: 09-138

పల్లవి: అంత నింత నుండి ఆనవెట్టీ రమణుఁడు
అంత లేదుగా నాకు నాయము సోఁకీని

చ. 1: ఔనె తనకు నాకు నంత పొందా తొలినాఁడు
నానిన వలపులతో నవ్వ వచ్చీని
పోని పోని వుపవేసి పొత్తు గలయ వచ్చీని
నే నోపఁగా యింతేసికి నిద్దుర వచ్చీని

చ. 2: లేలె తనగురుతు లెస్సగా నెఱుఁగుదునా
వేళ గాదన్నా బందెలు వేయ వచ్చీని
చాలుఁ జాలు వెలువెట్టి సారె నిమ్ము గొనవచ్చీ
తాలిమి లేదుగా నన్నుఁదల్లి విలిచీని

చ. 3: రావె తానూ నేను రతి నే వూరు కేవూరు
కోవరము నిన్నుఁ బెట్టి కొంగు వట్టీని
శ్రీ వెంకటేశ్వరుఁడు చెక్కు నొక్కి నన్నుఁ గూడె
వావులఁ బోదుగా నాకు వాసులు వుట్టీని

రేకు: 0274-1 సామంతం సం: 09-139

పల్లవి: ఊరకె తా నుండట్టె నుండుఁగాక
తారుకాణ లైనమీఁదఁ దగవుఁగొంతా

చ. 1: తనకేమె నాలోనఁ దల వంచు కొంటేను
ననుపులేని చోట నవ్వఁ బొయ్యేదా
అననేలె నన్ను సారె నవ్వులిమో మైతి నంటా
చనవులేని చోట సలిగెఁగొంతా

చ. 2: చింత యాలె తనకు నేఁ జెక్కిటఁ జే యిడు కొంటే
సంతముగాని చోట సరసములా
యింత యాలె యడమాట లేకతాన నే నుంటే
పంతగాఁడు తాను నేఁ బచరించఁ గలనా

చ. 3: వలపు చల్లఁగ నేలె వంతుకు నే నలిగితే
చలము సాధించఁగాను జాణతనాలా
యెలమి శ్రీ వెంకటేశుఁ డింత చేసి నన్నుఁ గూడె
కలసిన మీఁద నింక కపటములా

రేకు: 0274-2 కాంబోది సం: 09-140

పల్లవి: చూచితిఁ దన సరిత సుద్దు లేఁటి కో యమ్మ
చేచేత నిఁక బొంకఁ జెల్ల దో యమ్మా

చ. 1: జడిసి లోఁతుమాటల జాణతనా లాడీ నన్ను
తడవితేఁ దలదీసి తక్కించీ నమ్మ
చిడుముడి చుల్లరపు సేఁతల మమ్ముఁ జెనకీ
పడుచుమాటలవాని పస యేఁటిదమ్మా

చ. 2: ఆరీతి నాఁబడిఁబెట్టి యంతలో నడుగుకొనీ
గోరఁ బొయ్యేదాని కింత గొడ్డ లేలమ్మ
సారెకు మాటపట్లు సాదించి నడచీని
తీరకుండా జగడాలు తిద్దఁబొయ్యీ నమ్మా

చ. 3: పొందుగానిమతకాల బోదించ వచ్చీని
యిందరిలో నెక్కు డాయ నిఁక నేలమ్మా
అందపు శ్రీ వెంకటేశుఁ డాదరించి కూడె నన్ను
నింద లెల్లఁ బాసె నింక నెమ్మదినే యమ్మా

రేకు: 0274-3 వరాళి సం: 09-141

పల్లవి: నేఁడు రేపుఁ జూతు గాని నిలరా నీవు
వాఁడి వాఁడి నా గోరు వద్దురా నీవు

చ. 1: చేసన్న నేమి గల్లాఁ జెప్పి చూపుదువు గాని
మాసిన చెరఁ గంటక మానరా నీవు
మూసి మరఁగుల కెల్లా ముందట మొక్కుదు గాని
దోసముబంట ననక తొలరా నీవు

చ. 2: యేమి పని గలిగినా నింతుల నంపుదు గాని
రాములకుఁ గల దింతె రాకురా నీవు
నామీఁద మోహము గల్తె నవ్వులు నవ్వుదు గాని
మోముచూడ సిగ్గయ్యీని మొనసేవు నీవు

చ. 3: కూట మిది యంత గల్లా గుట్టున నుందువు గాని
పోటిఁ గోల నాడితేనె పోకురా నీవు
మేటివై శ్రీ వెంకటేశ మెచ్చుగాఁ గూడితి విట్టె
గాఁటాన నే నంటి నింతె కల్ల సుమ్మీ నీవు

రేకు: 0273-4 సాళంగం సం: 09-142

పల్లవి: నవ్వవొద్దా యిందుకుఁగా నాకు నాకె నిన్నుఁ జూచి
యివ్వలనెయింత సేసే వేలయ్య నాయకుఁడ

చ. 1: చూడవొద్దా ఆకె నిన్నుఁ జూచి సారె మొక్కఁగాను
యేడ నన్నా సిగ్గువడే వింత దగునా
ఆడవొద్దా మారుమాట ఆకె నిన్నుఁ బిలువఁగా
యేడో పరాకయ్యె వేలయ్య నాయకుఁడ

చ. 2: చేరవొద్దా మగువను చెనకి సరసమాడ
కూరిమి దెలిసేరంటా గుట్టు సేసేవు
మేరమీరవొద్దా ఆకె మెచ్చి చెయి వేయఁగాను
యీరీతి వొలసీ నొల్లా లేలయ్య నాయకుఁడ

చ. 3: కప్పవొద్దా పచ్చడము కాఁగిలించి కూడఁగాను
దప్పి దేరె మోవితేనె దగ దొట్టేవు
వొప్పుగా శ్రీ వెంకటేశ వుండవొద్దా రాజసాన
యిప్పుడే పెండ్లాడి తింత యేలయ్య నాయకుఁడ

రేకు: 0273-5 ఆహిరి సం: 09-143

పల్లవి: సేతునో నీ మేన నెల్ల జీరలుగాను
ఆతల సూడువట్టే దదె చూచేఁ గాని

చ. 1: టెప్ప లెత్తి చూచితేనె టేసు వుట్టె నిదె నీకు
దుప్పటి కొంగు వట్టితే దూర కుండేవా
చొప్పుగానా యించుకంతఁ జూతమువో యిఁక నేల
కప్పిన నీ బింక మెల్లఁ గనుఁగొనేఁ గాని

చ. 2: కవ కవ నవ్వితేనె కాఁగిపడే విప్పు డిట్టె
తివిరి కాలు దాఁకితే తిట్ట కుండేవా
వివరించి అది వెల్లవిరి సేతునో వోరి
అవల నీతో జగడమైన నయ్యీఁ గాని

చ. 3: ఆయము లంటఁగఁ బోతే ననుమానించే వందుకు
చేయి వేసి కూడితేను చిక్క కుండేవా
చాయల శ్రీ వెంకటేశ సమ్మతించి కూడితివి
సేయఁగలవి సేతునో చేరి మొక్కేఁ గాని

రేకు: 0273-6 ముఖారి సం: 09-144

పల్లవి: దొర వైతె నింతలోనె దోసమా యేమి
గరిమ మా వినయాలు కానివా యేమి

చ. 1: మలసి యీడా నాడ మాట లాడకున్న నేమి
తొలుతె యింటికిరాను దోసమా యేమి
తలఁపిట్టె వుండిన దగ్గరక మానేవా
కలపుకోలుఁదనము కానిదా యేమి

చ. 2: వడిఁ జుట్టాలముగామా వావి చెడ మందు గద్దా
కడు మమ్ము మన్నించితే కానిదా యేమి
కడకన్నులఁ దేలించి కాఁక రేఁచకున్న నేమి
తొడఁగి విడె మందితే దోసమా యేమి

చ. 3: చేరి చేరి బుజముపై జెయి వేయకున్న నేమి
దూరక కాఁగిలించితే దోసమా యేమి
యీరీతి శ్రీ వెంకటేశ యిక్కువ నుండి కూడి
గారవించితి యిది కానిదా యేమి

రేకు: 0275-1 పాడి సం: 09-145

పల్లవి: చుట్టపువరుసఁ గొంత చూచిఁ గాక
అట్టె యే మన్నా నెదురాడేవా నీవు

చ. 1: అలిగి రాకుండఁగాను ఆనలె పట్టెఁ గాక
చెలి నిన్నుఁ దిట్టితేను చెల్లదా నేఁడు
వులవచ్చి సిగ్గుతోడ నూరకున్న నుండెఁ గాక
చలివాయఁ జెనకితే జంకించేవా నీవు

చ. 2: పంతము నీ వాడఁగాను పాడియె నడపెఁగాక
కాంత యేది దలఁచినాఁ గాక మానీనా
జంతతనమేలంటాఁ జక్కనుంటె నుండెఁ గాక
దొంతిగాఁ బై నొరగితే దూరేవా నీవు

చ. 3: చెక్కు నొక్కి కూడఁగాను సెలవినె నవ్వెఁ గాక
చుక్కలు మోవి నించితే సూడు పట్టేవా
యెక్కువ శ్రీ వెంకటేశ యింతి నీతో నొక్కటాయ
మక్కువ నీ మేలింకా మరచేవా నీవు

రేకు: 0275-2 దేసాళం సం: 09-146

పల్లవి: మంచివానివలెనె మాట లాడీనె
యించుకంతా నెరఁగఁడు యేడవాఁడే తాను

చ. 1: తీపులపెదవి వంచి తిట్టినా మానఁడు నేఁ
గోపగించు కొనఁగానె కొల్లున నవ్వీనే
రాపుగా నానలు వెట్టి రాకు మన్నా మానఁడే
వోపనని రాఁగా నా వొద్దికి వచ్చీనే

చ. 2: గొణఁగి గొణఁగి లోలో గుంపించినా మానఁడే
అణఁగి నిద్దిరించఁగా నాయ మంటెనే
వొణికెవేసుక నే నూరకున్నా మానఁడే
సణఁగు లాడఁగ వేరె సాకిరి వెట్టీనే

చ. 3: వెఱతు మనుచు మొక్కి వేసరినా మానఁడే
కఱకు లాడేవేళ కాఁగిలించీనే
పుఱక శ్రీ వెంకటాద్రినుండి వచ్చి నన్నుఁగూడె
మొఱఁగి వావిలిపాటి ముద్దురామచంద్రుఁడె

రేకు: 0275-3 ముఖారి సం: 09-147

పల్లవి: ఎంత మొగమాయకాఁడో యేమో కాని
యింతులార వెర గైతి మిఁక నేమో కాని

చ. 1: మొదల నేమైనఁ జేసి ముందట నీవుండితేను
యెదురు మాటాడఁజాల నేమో కాని
పెదవి కెంపులు రేఁగబెట్టి నాతో నవ్వితేను
యిదివో నే భ్రమసితి నిఁక నేమో కాని

చ. 2: కొయ్యతనా లెల్ల నాడి కొంగువట్టి తీసితేను
యియ్యకొంటిఁ బనులకు నేమో కాని
పయ్యదపైఁ జెయి వేసి పచ్చితిట్టు దిట్టి తేను
నెయ్యమునఁ గరఁగితి నే నిదేమో కాని

చ. 3: పంతము లిన్నియు నాడి బలిమిసేసి కూడితి
నింతలోఁ బంత మిచ్చితి నేమో కాని
వంతుకు శ్రీ వెంకటేశ వలపించి నందు కెల్ల
మంతనాన లోనైతి మరి యేమో కాని

రేకు: 0275-4 వరాళి సం: 09-148

పల్లవి: మేలుగలవారి కెల్ల మీఁద మీఁద నాస లిట్టె
చాలుకొనుఁ గాని మరి చాలించ దెంతైనా

చ. 1: గక్కనఁ జూచిన చూపు కాంక్ష దీర దెంతైనా
కిక్కిరించి మరియు మగిడి చూడకా
చొక్కుచు రెప్పవేయక చూచినాఁ దనివోదు
తక్కక ఆరూపె మతిఁ దలపోయకుండినా

చ. 2: అంది వొకమాటాడితే నంతటఁ దీరదు తమి
మందలించి అట్టె మారు మాటాడకా
పొంది ముచ్చటాడినాఁ బోవు కోరిక లన్నియు
కందువఁ జెలులతో కతలు తాఁ జెప్పకా

చ. 3: కన్నప్పుడె వొకమాటు కలసినా సొంపులేదు
యెన్నికఁ బెక్కుగతుల నెనయకా
యిన్నిటా శ్రీవెంకటేశుఁ డెరిఁగిన జాణ గాన
నన్నుఁ గూడె నివి నాలో ననుప గాకుండదు

రేకు: 0275-5 ముఖారి సం: 09-149

పల్లవి: ఒయ్యనె విన్నవించరె వొద్దనున్న పతిఁ జూపి
నెయ్యపు నివ్వెరగుతో నిలుచున్నాఁ డితఁడు

చ. 1: తలపోఁత చింత యెంతో తరుణివిరహ మెంతో
చెలువుఁడె వచ్చి పిలిచినా నెరఁగదు
తొలుతె వియోగముతోనె అలసెఁ గాన
నలువంక నిజ మాడినా నమ్మదు

చ. 2: నిట్టూర్పుగములతో నెరుల చెదరుతోడ
పట్టి కళ లంటినాఁ బతికడ చూడదు
యిట్టె యెదురు చూచి యిందాఁక వేసారెఁగా
గట్టిగా నెదుర నున్నాఁ గల్ల లంటా నున్నది

చ. 3: విరులపానుపు మీఁద వెడఁజారుఁ బయ్యదతో
సరుఁస బండిన పతిచందము దెలియదు
శిర సెత్తి యిదె కూడె శ్రీవెంకటేశ్వరుఁ
డరుదైన కల గంటి నంటా నాడీని

రేకు: 0275-6 మధ్యమావతి సం: 09-150

పల్లవి: ఆమాట మీ రెరఁగ రాతఁడె కాని
తామసించి నాడనుండె తన కేలె వెఱపు

చ. 1: విచ్చేయు మనవె విభుని నిక్కడికె
యిచ్చుటనె విన్నవించె నేమి గల్లాను
ముచ్చట దీరదు తనమొగము చూచినదాఁకా
తచ్చివేసి నేనుండఁగ తన కేలె వెఱపు

చ. 2: తప్పక చూడు మనవె తా నిట్టె నాదిక్కు
యిప్పుడె మంచిది సేసె నేమి గల్లాను
దప్పివోదు నేఁడు నాకు తనతో మాటాడుదాఁకా
తప్పు లెల్ల వొప్పు లయ్యీ తన కేలె వెఱపు

చ. 3: తలఁచుకొమ్మనవె తనపొందు నాపొందు
యెలమిఁ గాఁగిటఁ దీర్చె నేమి గల్లాను
అలమె శ్రీవెంకటేశుఁ డందుకే మెచ్చినదాఁకా
తలవంచుకున్నాఁడు తన కేలె వెఱపు

రేకు: 0276-1 ముఖారి సం: 09-151

పల్లవి: ఎవ్వరికిఁ గలదురా యిటువంటి యనుభవత
యివ్వల నీ వాకెవలె నిటు నోమవలదా

చ. 1: కంకణాలచేత నీ కరమప్పళించి చెలి
అంకెలఁ గుచాలమీఁద నదిమిమి
తెంకిఁ గూచుండి కన్నులు తేలవేసి నిన్నుఁ జూచి
కొంకక నీ చెవిలోనఁ గూరి మేమో చెప్పెరా

చ. 2: వుంగరపువేళ్ల నిన్ను నువిదచెక్కులు నొక్కి
యెంగిలిపొత్తాకు మడి చిచ్చి యిచ్చి
పొంగెటి పులకలతో పొందు చూపి మాటాడి
సంగతిగాఁ గాఁగిలించెఁ జాలదా యీ భాగ్యము

చ. 3: నిలువుఁ బయ్యదవేసి నీపైఁ బాదముచాఁచి
నలువంకఁ దొడలఁ బెనచి పెనచి
యెలమి శ్రీవెంకటేశ యిటు నిన్నుఁ దెరవేసి
కలసె నిన్నాకె అంతకంటెరా నేను

రేకు: 0276-2 శంకరాభరణం సం: 09-152

పల్లవి: నీవు చల్లఁగాబదుకు నీకేల యీగొడవ
నీవలపులకు నెల్ల నేనే గురి

చ. 1: చెక్కు నొక్కకుర నాచెమట నీచేతనంటి
గక్కన నీకుఁగానైన కరఁగులివి
యెక్కువ నాతాపము నీవేల కట్టుకొనేవు నేఁ
బుక్కట నాలో నెట్టెనఁ బొరలేఁగాని

చ. 2: కాఁగిలించకుర నాకాఁకల నీమేనువాడి
తీఁగెల నీవల్లనైన తేజములివి
నీఁగని నామరులిదె నీవు చుట్టుకొననేల
ఆఁగి నేనె పొట్టువొరలయ్యేఁగాని

చ. 3: నామోవి యడుగకుర నానలేదు కడునెండె
వేమరు నీవల్లనైన వెట్టలివి
ఆముకొని శ్రీవెంకటాధిప కూడితి వింక
సోమరినై నాలోనె చొక్కేఁగాని

రేకు: 0276-3 దేసాళం సం: 09-153

పల్లవి: కాంత నీవు గూడఁగా నేఁగంటి నేలలోఁగేవు
వింతగాఁ గంటికిఁ జూపు వేరయ్యీనా

చ. 1: నీవు నాకుఁ జుట్టమవై నిలిచినాఁడవుగాన
నీవద్దియింతులు నాకు నెమ్మిఁ జుట్టాలె
పూవులుముడిచితేను పూవులలోవాసనలు
వేవేలుచెప్పినాను వేరులయ్యీనా

చ. 2: నీమనసు నామనసు నిక్కమూ నొక్కటె కాన
కామించిన నీపనులు కా దన నేను
దీమసాన సొమ్ములెల్ల దేహమున నించుకొంటె
వేమరు వానికాంతులు వేరె వుండీనా

చ. 3: యెప్పుడూ నీ నా ప్రాణా లేకమయ్యెవుండుఁగాన
యిప్పటి నీజాడలెల్లా నితవె నాకు
అప్పటి శ్రీవెంకటేశ ఆయమంటి కూడితివి
విప్పరాని చనవులు వేరయ్యీనా

రేకు: 0276-4 కేదారగౌళ సం: 09-154

పల్లవి: ఆసుద్దులేల తడవే వాయలేవయ్య్య
సేసితివి చెప్పినటె చేకొనవయ్యా

చ. 1: వున్నతి నీవద్దఁ బాయకుండినదె నేరుపు
నిన్నుఁబాసి వుండినదె నేరమి
అన్నియు నిన్ను వెనక ననఁగానేమి
చెన్నుమీరె గతజలసేతుబంధాలు

చ. 2: సరి నిన్నుఁ బొగడేదె జాణతనము
కరి కరిఁబెట్టేదె గబ్బితనము
యెరవెల్లఁ బాసె దిఁకనేమి
మరలి వెదకు టెండమావులనీళ్లు

చ. 3: చక్క నీమోము చూచుటె సరసము
వెక్కసపు మారుమోమె విరసము
గక్కన శ్రీవెంకటేశ కలసితివి
యిక్కువ లన్నియు నింక నింటిలోనిధానము

రేకు: 0276-5 సాళంగనాట సం: 09-155

పల్లవి: ఆసోదకాఁడవో అన్నిటా జాణవో
వాసితో నే నుండితేను వలచి వచ్చేవూ

చ. 1: నీతోడి చలమా నిన్ను దూరఁగలమా
చేతులెత్తి మొక్కిన దించిక వెంగెమా
కాతరించ నిన్న మొన్న కాఁగిలించఁగలమా
యీతల నే రానంటె యింతలోనె కడమా

చ. 2: దండినెఁ బైతరవా తగునె నీకెరవా
నిండుకొనె వుండితేనె నీకు నగవా
పెండెమిచ్చి నన్నిందాఁకాఁ బిలిపించుకొనవా
వుండినట్టె వుండితేను వొళ్లిగర్వమనవా

చ. 3: కూటమి నేఁడరుదా కొసరితే బిరుదా
యీటున మనలో నేఁడింత గలదా
గాఁటపు శ్రీవెంకేటశ కలసితి మిట్టెకాదా
నాఁటిసుద్ది దడవితే నను మెచ్చవలదా

రేకు: 0276-6 మంగళకౌశిక సం: 09-156

పల్లవి: నేమెంతేసివారమైనా నిన్ను మీరఁగలమా
కామించి నీవు వచ్చితేఁ గైకొనేముగాకా

చ. 1: నేరుపులు చరించ నీతోడఁ జెల్లునా
వూరెల్లాఁ జుట్టాలఁ జేసుకుండఁగాను
భారపు పైఁడికొండలో బచ్చుబేరా లమరునా
వూరకె నీమేలు గోరుకుండు టింతెకాకా

చ. 2: తమిరేఁచేమని నిన్ను దగ్గరఁగఁ జెల్లునా
గములైన సతులతోఁ గరఁగఁగాను
భ్రమసి రేపల్లెవాడఁ బాలమ్మితే సరకౌనా
ప్రమదాన నీకు మొక్కి బ్రదుకుటగాకా

చ. 3: ఆవటించి నీకు నేఁ బ్రియాలు చెప్పఁజెల్లునా
వేవేలురతుల నీవె వేఁడుకోఁగాను
వావిరిఁ బువ్వులకును వాసనలు గట్టుదురా
శ్రీవెంకటేశ కూడితి చెక్కునొక్కేఁగాకా

రేకు: 0277-1 మధ్యమావతి సం: 09-157

పల్లవి: సారెకు వలవఁ బోతే చప్పనేకాదా
వూరకుండేవారిఁగంటే వొత్తరాదా నీకు

చ. 1: మొగము నేఁ జూచితేను మున్చి నీవు నవ్వితివి
యెగసక్యానకో కాక యేపనికో
తెగి అంతేసి లోఁతులు తెలుకొ నెరఁగవు
పగటున నేము నగుఁబాటుగాదా నీకు

చ. 2: పొంత నేఁ గూచిండితేను పొనిగి చోటిచ్చితివి
యెంత వొల్లఁబెట్లోకాక యేమిటికో
వింతగా నంతేసి వెల్లవిరిసేయ నెరఁగవు
యింత దగ్గరితే యెడమియ్యవొద్దా నీకు

చ. 3: సరసము నే నాడితే సరుగఁ గాఁగిలించితి
విరవుగా నెరిఁగితి వేమిటికో
గరిమ శ్రీ వెంకటేశ కలసితి విదెరఁగ
సరసకు వచ్చితేనె సందుగాదా నీకు

రేకు: 0277-2 దేశాక్షి సం: 09-158

పల్లవి: ఒక్కరి కొకరు లోనైవుండుటగాక
చక్కట్లు చెప్పఁబోతే సమ్మతౌనా సుద్దులు

చ. 1: మచ్చర మేమిటికమ్మ మగవాఁడు నీతోడ
తచ్చనలు నెరపితే తరిఁ జెల్లదా
ముచ్చటలు మీరాడరా ముందరను వెనకకు
యెచ్చుకుందులు వట్టితే నెనసీనా పొందులు

చ. 2: చలము లేమిటికమ్మ సరసుఁడు నీతోను
సొలయుచు నవ్వితేను సొంపుదప్పునా
కలయరా యిఁక మీరు కలనైన వెలినైన
కలఁగి తేరఁగఁబోతే గట్టియవునా పనులు

చ. 3: యెగ్గు లింకేమిటికమ్మ యిదె శ్రీవెంకటేశుఁడు
వెగ్గళించి నిన్నుఁ గూడె వేసటలౌనా
నిగ్గులు చనవు లీరా నేఁడైనా నాఁడైన
సిగ్గులు నెరపఁబోతే చెందునా కోరికలు

రేకు: 0277-3 పాడి సం: 09-159

పల్లవి: అన్నిటాను జాణఁడు అప్పటి నెరఁగఁడు
చిన్నదాన మీకు బుద్ధిచెప్పరె యీతనికి

చ. 1: ముల్లుచూప తొలుతేల మొక్కి తలవంచనేల
వొల్లనె యప్పటి జాడ నుండరాదా
చల్లరపు నేతలేల సుదతికిఁ జిక్కనేల
జెల్లుబడిగా బుద్ధులుచెప్పరె యీతనికి

చ. 2: వట్టి కపటములేల వాకిలి గావఁగనేల
చుట్టరిక మట్లానె చూపరాదా
మట్టులే కలుగనేల మరి వెదకఁగనేల
చిట్టకముదీర బుద్ధిచెప్పరె యీతనికి

చ. 3: మానినుల పొందులేల మాకుపడివుండనేల
కానీవె బుద్ధెరఁగఁడా కలికిగాఁడా
ఆనుక శ్రీవేంకటేశుఁ డంతలోనె నన్నుఁ గూడె
సేనలుగా యిఁక బుద్ధిచెప్పరె యీతనికి

రేకు: 0277-4 దేసాళం సం: 09-160

పల్లవి: ఎక్కడఁ జూచినఁ దానై యీతఁడున్నాఁడు
వెక్కసపు మనపాలి విష్ణుదేవుఁడు

చ. 1: చూడరె పదారువేలు సారిది యిండ్లలోన
వేడుక నన్నిరూపులై విఙ్గివీఁగీని
జాడతో దేవతలకు జలనిధి దచ్చి తచ్చి
పాడితోడ నమృతము పంచిపెట్టీని

చ. 2: మొక్కరె రేపల్లెలోన ముంచి యాలమందలలో
నక్కడ గోపాలులతో నాటలాడీని
దిక్కులు సాధించి తనదేవుల నండఁ బెట్టుక
రెక్కల గుఱ్ఱముపై పేరెముదోలీని

చ. 3: సేవలెల్లాఁ జేయరె శ్రీవెంకటాద్రిమీఁద
వావిరి నందరికిని వరాలిచ్చీని
ఆవల నీవలఁ దానె అంతరాత్మ యిందరికి
భావాలలోన విశ్వరూపముచూపీని

రేకు: 0277-5 సామంతం సం: 09-161

పల్లవి: నీకేల వెరపు నీవూ నేనూ నొక్కటే
కోకొమ్మని విడెమిచ్చీఁ గొంకకువయ్యా

చ. 1: ముందరనె నిలుచుండి ముసిముసి నవ్వునవ్వి
కందువలు నీకుఁ జూపీఁ గలికి యదే
అందుకు నీవెఱఁగక అంకెలకు రాకుండితే
విందులు చెప్పి పిలిచీ వినవయ్యా

చ. 2: చాయలకు మాటలాడి సరసముఁ గొంతచూపి
చేయి నీపై వేసీని చెలియ యిదే
నీయంత సన్నెరఁగక నిండుకొని వుండితేను
ఆయములు గోరనొత్తీనదె కదవయ్యా

చ. 3: కన్నులఁ దప్పక చూచి కరఁగుచు నట్టె మెచ్చి
కన్నె నిన్నుఁ గూడె శ్రీవెంకటవిభుఁడా
యెన్నికై కడపలోన నిట్టె నన్నుఁ గూడితివి
విన్నపము నీకుఁ జేసీ వింటి వటవయ్యా

రేకు: 0277-6 శంకరాభరణం సం: 09-162

పల్లవి: ఎందుకైనావచ్చు నీతో యేలాటాలు
నిందలాడ మాకేల నీచిత్తమిఁకను

చ. 1: నగినగి నీతోను నను పు నటించితేను
యెగసక్కేలివియంటా నేల దూరేవు
పగటున నీతో పలుకకవుండితేను
అగడుసేసి యిట్టె అలిగితివనవా

చ. 2: యెప్పటివలె నే నీతో యెదురుమాటాడితేను
తప్పులు వట్టితినంటాఁ దలవంచేవు
ముప్పిరి నీతోఁ గనక మోనాననేవుండితేను
కుప్పలూఁ దెప్పలునైన కోపములివెనవా

చ. 3: నిలిపి కాఁగిట నిన్ను నిబ్బరానఁ గూడితేను
అలయించితినంటా నట్టే చూచేవు
చెలఁగి శ్రీవెంకటేశ సిగ్గున నే నుండితేను
వలవంతతోడి గర్వము లివియనవా

రేకు: 0278-1 ఆహిరి సం: 09-163
పల్లవి: నిలుచున్నాఁ డాతఁడు నివ్వెరగంది నీవు
సళుపుఁ జూపుల నేల సాదించేవే
చ. 1: చనవుసేసుక నీవు సణఁగులు చల్లితేను
ననుపు సేసు కతఁడు నవ్వు నవ్వేను
పెనచి సరికిసరె బేసిగాదు నీవేల
వెనకటి నేరాలెంచి విడనాడేవే
చ. 2: నిందలువేసి నీవు నేరము లెంచితేను
కందువలంటి యతఁడు కళరేఁచెను
యిందుకు నందుకు నీడె యీఁతకంటె లోతులేదు
మందెమేళాన నింకేల మచ్చరించేవే
చ. 3: వావులుచూపి నీవు వలపించి కూడితేను
మోవులుచూపి యితఁడు మోహింపించెను
నీవు నాతఁడు నొక్కటే నేమె మీఁదమిక్కిలి
శ్రీవెంకటేశుఁడె తాను చిమ్ములురేఁచకువే

రేకు: 0278-2 శ్రీరాగం సం: 09-164

పల్లవి: వరుసతోనె వచ్చితే వలపులు చవులౌను
అరమరచి విభుఁడు అందేమి సేసీనె

చ. 1: మనసులో కాంక్షకు మాటాడితేఁ గొంతాస
ననిచినమీఁద మరి నవ్వులింపౌను
చనవుగలిగితేను సరసమాడఁ జెల్లును
పెనఁగేపాటిచేఁతల ప్రియము లీడేరును

చ. 2: కాయముమీఁది తమికి కనుచూపు గొంతాస
చేయి చేయిఁ గదిసితే సిగ్గులొంటును
ఆయములు గరఁగితే నందిపొందికలు దగు
తోయరాని మొగమోట తుదలుమీరించును

చ. 3: అట్టె పాయపుమదాల కండనుండాఁ గొంతాస
జట్టిగొన్నయందుమీఁద సన్నలుమేలు
అట్టె శ్రీవెంకటేశుండు అలమేల్మంగను నేఁ
బట్టితి ననుచుఁ గూడెఁ బనులెల్లా దక్కును

రేకు: 0278-3 సామంతం సం: 09-165

పల్లవి: నీవే యిన్నిట నిజమరివి
వావిదెలుప యిఁక వద్దయ్యా

చ. 1: వచ్చినపుడె నీవలపులు దక్కెను
యెచ్చు కుందు లిఁక నేమిటికి
కుచ్చెను కాఁగిట గుఱిగా నిన్నిదె
రచ్చలఁ బెట్టక రావయ్యా

చ. 2: పలికినపుడె నీ పంతము చెల్లెను
యెలయింపుల పనులేమిటికి
పిలిచీ రతులకుఁ బేరుకొనుచునిను
కొలఁదితేనె వూఁకొనవయ్యా

చ. 3: కూడినపుడె నీగుణములు దెలిసెను
యేడసుద్దు లిఁకనేలయ్యా
యీడనె శ్రీవెంకటేశ యెనసితిమి
మేడెపు రతులివి మెచ్చవయ్యా

రేకు: 0278-4 భైరవి సం: 09-166

పల్లవి: నాకుఁజూడ నిదె నీవు నావాఁడవు
లోకులమాటకెల్ల లోనైవున్నాఁడవు

చ. 1: హత్తి నాకాత్మవుగాన అన్నియు విన్నవించితి
చిత్త మెట్టున్నదో చెప్పఁగరాదా
పొత్తులమగఁడవట పొరచి కాఁపురమట
యిత్తల నాపై భక్తి యింకా నీకుఁ గలదా

చ. 2: అట్టె మన్నింతువుగన ఆనవెట్టి యడిగితి
జట్టిగా మోహము నీ కే సతిపైనయ్యా
చుట్టమ వందరికట చొట్లు నీకిన్నినట
ముట్టేవు నాచన్నులిఁక మోహమిందు గలదా

చ. 3: నీవు నే నొక్కటిగాఁగ నిజము నిన్నాడించితి
దేవుళ్లు నీకెందరు తెలుపవయ్య
శ్రీవెంకటేశ నేను జిగి నలమేల్మంగను
తావుగాను రమించితి తగులింత గలదా

రేకు: 0278-5 దేసాళం సం: 09-167

పల్లవి: ఆపె నిన్ను దిద్దుకొన నయఁగారుగా
మాపుదాఁకా నూరకున్న మత్తుడవైవుందుగా

చ. 1: యింతి నీకు మోహించి యింటికి విచ్చేయఁగాఁగా
రంతుల నీవలపెల్లా రచ్చకెక్కెను
కాంతుఁడ యిటుగాకున్న కన్నవారివెంటనెల్లా
పంతపు నీమనసిది పరచై తిరుగుఁగా

చ. 2: చెలి నిన్ను బుజ్జగించి చెనకి నవ్వఁగాఁగా
యిలపై నీవిటతన మెన్నిక కెక్కె
లలియింతరేఁచకున్న లాగుల నీవయసెల్లా
పలచనై లోలోనె పండి తాఁ గైవాలుఁగా

చ. 3: నిండుఁగాఁగిటనె యాపై నేరుపరిఁ జేయఁగాఁగా
దుండగపు నీచేఁతలు తుదకెక్కెను
అండనె శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
రండూ నింతగాకున్న రతి చవిగాదుగా

రేకు: 0278-6 వరాళి సం: 09-168

పల్లవి: అప్పటి కప్పటి మాట లంటి మింతే
వుప్పాలి కినుమడాయ నూరకేవుండవయ్యా

చ. 1: కంగులేక నీవొళ్లఁ గపటము లేదందువు
అంగముపై పెంజెమట లవిగోవయ్యా
వెంగలితనాన నిన్ను వెల్లవిరి సేయరాదు
అంగడిఁబెట్టకు పను లట్టె వుండనీవయ్యా

చ. 2: వొద్దనున్నవారితోడ వొట్టులు వెట్టుకొందువు
అద్దము చూచుకో నీ మోమదిగోవయ్యా
గద్దించిందరిలోఁ దారుకాణలఁ బెట్టఁగరాదు
యిద్దరమే యెరుఁగుదు మిఁక నంతయేలయ్యా

చ. 3: పలుమారు మాముందర పంతాలు నెరపుదువు
అలవిమీరే గురుతు లవిగోవయ్యా
యెలమి శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
తొలఁకీని మేలు పొత్తున నుండనీవయ్యా

రేకు: 0279-1 నాదరామక్రియ సం: 09-169

పల్లవి: ఒలసితే నొకమాట వొల్లకుంటే నొకమాట
బలిమి వలపులకు పాటియేది యిందుకు

చ. 1: చెక్కు నొక్కి వేఁడుకో నీచే సూటికి రాకున్న
కక్కసించి యేరా నీవు కడుఁ దిట్టేవు
యెక్కువ నీ వొక్క నోరె యెందుకైనావచ్చు నిఁక
నిక్కమేది కల్లయేది నేనెట్టు నమ్మేను

చ. 2: నవ్వు నవ్వి చేయి వేసి నయ మింతలేకున్న
పవ్వళించి యేరా నీవు పగచాటేవు
రవ్వగా నీగుణమిదె రండూ నడపఁజొచ్చె
యివ్వల నీయెడమాట లేమివినే మిఁకను

చ. 3: అట్టె నన్నుఁ గాఁగిలించి అన్నిటాఁ గిందుపడితే
జట్టిగొని తొల్లిటివోజకు వచ్చేవు
నెట్టన శ్రీవెంకటేశ నీవు నేను నొక్కటే
యిట్టు నట్టు నందాలకు నిన్ని నేరుతువు

రేకు: 0279-2 సామంతం సం: 09-170

పల్లవి: నీతలనె వేఁగెనా నిండు భోగాలు
కాతరపుఁ దమకము కాదనఁగఁ గలవా

చ. 1: దగ్గరి వున్నాఁ డతఁడు తలవంచనేలే
సిగ్గువడఁ బొద్దులేదా చెల్లఁబో నీకు
అగ్గమై చిన్నదానవు అయితే నౌదువుగాక
అగ్గలపు జవ్వనము ఆఁప నింకఁ గలవా

చ. 2: మాటలాడీ నాతఁడు మౌనము నీకేలే
గాఁటపు నివ్వెరగుకుఁ గాలములేదా
నేఁటనె కొత్తరికము నీకు నైతేనాయఁగాక
వాఁటపు మరుబాణాల వాఁడిచూపఁ గలవా

చ. 3: కాఁగిలించీ నాతఁడు కళవళమేలే
వీఁగి పరవశాలకు వేళలేదా
చేఁగదేరఁ గూడె నిన్ను శ్రీవెంకటేశుఁ డతఁడు
నాఁగువారె సరసాలు నవ్వకుండఁ గలవా

రేకు: 0279-3 కాంబోది సం: 09-171

పల్లవి: చాలుఁ జాలు నేల మాతో జాణతనాలు నాకు
కోలుముంద్రై నీపొందు జిగురువంటిదయ్యా

చ. 1: చెచ్చెర నీమాఁటలు చెవియొగ్గి వినఁబోతే
మచ్చిక నల్లాపె నీకె మరులాయను
హెచ్చుగాఁ బదారువేల నీరీతిగడించుకొంటి
తెచ్చి నీకు నెవ్వ రుపదేశమిచ్చిరయ్యా

చ. 2: ముందరనుండఁగ నీమొగము చూడఁగఁబోతే
అందరిలోపల నాపె ఆలాయను
యిందువంకనె రేపల్లె యింతుల భ్రమించితివి
సందడి నెవ్వరు నిన్నుఁ జదివించిరయ్యా

చ. 3: చేరువ నీవుండఁగా నీసేవలు సేయఁగఁబోతే
సారె నీవురాన నాపె సతమాయను
యీరీతి శ్రీవెంకటేశ యిల్లాండ్లఁ దెచ్చుకొంటే
నేరిపి యెవ్వ రింతేని నిన్ను దిద్దిరయ్యా

రేకు: 0279-4 పాడి సం: 09-172

పల్లవి: ఆపెకు నీకుఁ దెలుసు నటమీఁది పనులెల్లా
చేపట్టినే మింతకంటెఁ జెప్పఁగఁ జోటేది

చ. 1: లోకములో నెవ్వతైనా లోఁచి మాటలాడఁగాను
పైకొనవి వానికిఁ బంతమేది
రాకలఁ బోకల నట్టె రాయడించి కొసరఁగ
మైకొని లోఁగాకున్న మగతనమేది

చ. 2: నంటున నెవ్వతెయైనా నవ్వులు సారె నవ్వఁగా
యింటికి రాకున్నవాని యెరుకేది
జంటలఁ దనమొకము సారె సారెఁ జూడఁగాను
వెంటఁ దగులకున్నను విటతనమేది

చ. 3: యెమ్మెచూపి యెవ్వతైనా యెదుటనే నిలుచుంటే
నెమ్మిఁ గలయనివాని నేరుపేది
కొమ్మను శ్రీవెంకటేశ కూడి నన్నుఁ గూడితివి
సమ్మతి నిటుగాకున్న జాణతనమేది

రేకు: 0279-5 దేసాక్షి సం: 09-173

పల్లవి: వినవమ్మ యశోద గోవింద కృష్ణుఁడు
చెనకి యెన్నిపనులు చేసెనమ్మ కృష్ణుఁడు

చ. 1: పుట్టులు దాఁగొట్టుఁగాను పువిదలు దిట్టఁగాను
జట్టాయ వీథులలో నుఱక కృష్ణుడు
పట్టినకోలల గొల్లపొఁజు లిరువంకరాఁగ
పట్టుకొన్న గొల్లెతల భ్రమయించీఁ గృష్ణుఁడు

చ. 2: పాలు దనపై గారఁగా పడఁతులు నవ్వఁగాను
గేలికి లోనాయను జంగిలి కృష్ణుఁడు
అలరి యెలుఁగులతో నడ్డమువచ్చినవారి
మేలపు చేఁతలు చేసి మెప్పించీఁ గృష్ణుఁడు

చ. 3: యిండులు దాఁజొరఁగాను యింతులు పైకొనఁగాను
బందుకు లోనాయను గోపాలకృష్ణుఁడు
అండనె శ్రీవెంకటాద్రి నలమేలుమంగఁ గూడి
దుండగపుఁ జేఁతలనె దొరాయఁ గృష్ణుఁడు

రేకు: 0279-6 పాడి సం: 09-174

పల్లవి: కన్నులఁ జూచేవు మాతో కందువ మాటలాడేవు
కొన్నదికోలు నీకిఁక గోవిందరాజా

చ. 1: పవ్వళించేయప్పుడూను పాదాలొత్తే వారిద్దరు
యివ్వల నే నీతో నవ్వ నేకతమేది
దవ్వుల నుండే మమ్ముఁ దడవేవు నీవొళ్ల
కువ్వలాయ వలపులు గోవిందరాజా

చ. 2: యిద్దిరి చే నిమ్మపండ వేమి సేయవచ్చు నిన్ను
అద్ది నీతో మాటలాడ ననువయ్యీనా
చద్దికి వేఁడి కప్పటి జాణతనా లాడేవు
కొద్దిఁబడవు పనులు గోవిందరాజా

చ. 3: యిరుమొనసూదివి యెవ్వరివాఁడ వందుము
దొరవై నన్నుఁ గూడితి తొల్లె నీవు
తరవాతి చేఁతలెల్ల దక్కె నీకు నిందరిలో
గొరబై శ్రీవెంకటాద్రి గోవిందరాజా

రేకు: 0280-1 హిజ్జిజి సం: 09-175

పల్లవి: ఎఱిఁగినపనులకు నిఁకనేఁటికి నీకుఁ
దఱితో నవ్వేవారె తగు నింతేకాకా

చ. 1: మగువలు వద్దనుంటె మఱతు వన్నిపనులు
తగిలి వెనకముందు తలపోసేవా
వెగటుగ నేమసేసే విన్నప మెందుకెక్కును
బగివాయకుండేవారి భాగ్య మింతేకాక

చ. 2: కొంగువట్టి తీసితేనె గబ్బున లోనౌదువు
పంగించిచెప్ప నీ కొక్కపాటి వున్నదా
పొంగి నీబాసలు నేఁడు పొగడఁగ నేమున్నది
వుంగరపువేలివారి వోపి కింతేకాక

చ. 3: కాఁగిలించి కూడితేనె కరఁగుదు వంతలోనె
దాఁగి పెనఁగఁగ నీకు తగవున్నదా
చేఁగదేరఁ గలసితి శ్రీవెంకటేశ నన్ను
వీఁగక నిలుచువారి వెర వింతేకాకా

రేకు: 0280-2 కేదారగౌళ సం: 09-176

పల్లవి: అందుమీఁద మేలుదాన వాతనికి నీవు దొల్లె
కందువె చూతువుగాక గరిసించ నేఁటికే

చ. 1: చిక్కని వెన్నెలతేట చెలియ నీ మొగమోట
అక్కజపు పతి నింకేమనఁగలవే
నిక్కి యాతఁడన్నీఁజేసె నీపై వలపువేసె
మక్కువ నాడ సుద్దులు మమ్మే మడిగేవే

చ. 2: పచ్చితేనె కులుకులు పడఁతి నీపలుకులు
యిచ్చట నాతని నింకా నేమనేవే
రచ్చలకు నాఁడెయెక్కె రాతిరి నీకు మొక్కె
ముచ్చట కిందేమి మామోములు చూచేవే

చ. 3: చెప్పరాని విందులు సేసెటి నీ పొందులు
యిప్పుడు శ్రీవెంకటేశు నేమిసేసేవే
తప్ప కితఁడె కలసె తమకములు వలసె
వొప్పుగా మమ్ము మెచ్చితి వొరయ నేమిటికే

రేకు: 0280-3 దేసాళం సం: 09-177

పల్లవి: ముగురము జాణలమే మోహమెవ్వరి దనేది
నిగిడి నామోము చూచి నీవేల లోఁగేవు

చ. 1: యింతి తెంకాయ కానుక యిచ్చె నీవు గైకొంటివి
యింతలేసి యాపె కుచాలివి యంటాను
సంతమై యిద్దరి సన్న సరికి బేసికి వచ్చె
అంతటి మీ నేరుపుల కట్టె నేను మెచ్చితి

చ. 2: దొండపండు కానుకిచ్చె తోడ నీ వందుకొంటివి
దండ నిటువంటిదె యధరమనుచు
దండి మీపొదరులవి తాసుగట్లెయు నాయ
అండ నుందానఁ గాన అట్టె నేమెచ్చితి

చ. 3: పువ్వుగుత్తి కానుకిచ్చెఁ బుచ్చుకొని కూడితివి
జవ్వనము ఆపెకు యీజాడ దంటాను
అవ్వలి మోమైవుండి అప్పుడె శ్రీవెంకటేశ
యివ్వలఁ గాఁగిలించి మీయిద్దరి మెచ్చితిని

రేకు: 0280-4 హిందోళవసంతం సం: 09-178

పల్లవి: ఇంతవాఁడు చెనకీ నెక్కడ చూచేవే నీవు
యింతలో గోడచిత్తరు వేమి వ్రాసేవే

చ. 1: ఆతల నీరమణుఁడు అట్టె నిలుచుకుండఁగా
యేతుల మాతో మాటాడే విది యేఁటిదే
బూతులఁ దిట్టీ నతఁడు పూని నీగర్వము చూచి
యీాతల నేఁటి నవ్వులు యిటు నవ్వేవే

చ. 2: రతికి నాతఁడు నిన్ను రమ్మని పిలువఁగాను
కత లడిగేవు మమ్మిక్కడ నేటిదే
చతురుఁడు సురటి నిచ్చట నిన్నుఁ దాఁకవేసె
వెతదీరఁ బుచ్చుకొని విసరుకొనే వేమే

చ. 3: శ్రీవెంకటేశుఁడు నిన్ను చేరి కాఁగిలించఁగాను
వోవరిలో నన్ను నేల వుండు మనేవే
దేవుఁ డాతఁ డంతలోనె తెరవేసి నిన్నుఁ గూడె
చేవదేరె నాతో నేల సిగ్గు వడేవే

రేకు: 0280-5 దేవగాంధారి సం: 09-179

పల్లవి: పొద్దుగూఁకె తెల్లవారె పొంతనె యీతఁడున్నాఁడు
గద్దరితన మింతేసి కలదటవే

చ. 1: చిత్త మెడసివున్నది చెప్పుడు మాటలవల్ల
వొత్తి యీతఁ డేమనిన వూఁకొనవు
అత్తివున్న చెలుల మమ్మడుగవే సుద్దులును
యిత్తలఁ దేరే వివర మెటువలెనే

చ. 2: పట్టిన చలమున్నది పాసిన కాఁకలవల్ల
జట్టిగొని వేఁడుకొన్నా సమ్మతించవు
అట్టె యీతనిచే నొక్క ఆనైనఁ బెట్టించుకోవు
గుట్టుతో నుండఁగాను కూడు టెన్నఁడే

చ. 3: పంత మెక్కుడైవున్నది బలు రారాఁపులవల్ల
కొంత గొంత సమ్మతించి కొంకుదేరవు
యింతలో శ్రీవెంకటేశుఁ డిదెరిఁగి నిన్నుఁ గూడె
వింత రతులనుచు నివ్వెరగు లేలే

రేకు: 0280-6 పాడి సం: 09-180

పల్లవి: అన్నియు నందె అమరె నదె
సన్నపునవ్వులు చల్లే నిపుడు

చ. 1: చెక్కు నొక్కి నను సేదదేర్చి యిటు
దిక్కనఁ గోపము దీర్చితివి
యెక్కువ నినుఁ దొలు తేమని యంటినో
చిక్కి కాఁగిలించెద నే నిపుడు

చ. 2: చనవులిచ్చి నను సమతు సేసి యిటు
పెనఁగి మంకు విడిపించితివి
యెనయ నపుడు నిను నెంతసేసితినో
చెనకి యధర మిచ్చెద నే నిపుడు

చ. 3: సరసమాడి కడుఁ జవులుచూపి యిటు
గరిమతోడ ననుఁ గలసితివి
సరవి శ్రీవెంకటేశ్వర యే మెరఁగనో
అరసి తనిసి కొనియాడెద నిపుడు

రేకు: 0281-1 నాదరామక్రియ సం: 09-181

పల్లవి: మనసుమెత్తనిదాన మరి నీకు మోహింతు
పనుపడి నీవెట్టు పాలార్చేవయ్యా

చ. 1: సరసపు నీమాటకు జంకించితి నీవంతలో
వొరసి చిన్నఁబోయి వూరకుంటివి
కరఁగితి నదిచూచి కరుణ మిక్కిలిఁబుట్టి
తిరుగ నామన సెట్టు తేరిచేవయ్యా

చ. 2: చేయి నామీఁద వేయఁగా సెలసి విదలించితి
చాయసేసుకో లోఁగి జడిసితివి
ఆయా లంటి చింతించితి అంతసేసితి నే నని
కాయ మంటి నన్ను నెట్టు గారవించేవయ్యా

చ. 3: నీవు నన్నుఁ గూడఁగాను నివ్వెరగుతోఁ జొక్కితి
నీవె తప్పు లెంచుకొని నేర నంటివి
శ్రీవెంకటేశ యిందుకే సిబ్బితి యింతయుఁ బాసె
చేవగా నా చన వెట్టు చెల్లించేవయ్యా

రేకు: 0281-2 సామంతం సం: 09-182

పల్లవి: ఎగ్గో తప్పో యెఱఁగ నిది
నిగ్గులు దేరఁగ నినుఁ బైకొందు

చ. 1: పలుమరు నీతోఁ బంతము లాడను
అలసి సొలసి మాటాడుదును
కులికి కులికి నినుఁ గోపించి చూడను
నలుగడఁ గూరిమిఁనాఁటఁగ జూతు

చ. 2: కమ్మర నీపై కాఁకలు చల్లను
సమ్మతి వలపులు చల్లుదును
దిమ్మరేఁచి తరితీఁపులఁ బెట్టను
కొమ్మని మేకులు కొనఁ బెట్టుదును

చ. 3: పాసివుంటి వని బడలిక సేయను
ఆసల రతులనె అలయింతు
సేసలఁ గూడితి శ్రీవెంకటేశ్వర
వేసరించ నిను విడువ నెప్పుడును

రేకు: 0281-3 సాళంగనాట సం: 09-183

పల్లవి: ఎంతటివాఁడవు నిన్ను నేమందును
కాంతలకు మాకుఁ దొల్లి కారణము గలదా

చ. 1: ఆపె నీకె మొక్కనీ ఆపెకు నీవైనా మొక్కు
కేపున మాకేఁటికి మొక్కించేవయ్యా
యేపున నే నేమంటి యీయింతి నన్నేమనె
చేపట్టి నీకొరకింత సేసేవు గాకా

చ. 2: ఆవిడెము నీ వందుకో నీవిడె మట్టె పెట్టు
యీవల నెవ్వరి విడే లేమి సేసేము
యేవూరి యక్కను నేను యేవూరి చెల్లె లాపె
వావులు నీవల్ల నింతవచ్చె నింతె కాకా

చ. 3: చేయివట్టి తియ్యనీ చేసన్న నీవు సేయి
బాయిట మ మ్మెపుడూనుఁ బట్టవద్దు
పాయ వలమేల్మంగను పైకొంటి శ్రీవెంకటేశ
కాయకపువారి నీవే కట్టుకొందు గాకా

రేకు: 0281-4 భైరవి సం: 09-184

పల్లవి: ఏల సిగ్గు వడే వానతియ్యరాదా
మేలిమిచెలుల మిదె మీవారమె

చ. 1: తురుము నీవియు జార తొయ్యలి యెదురుకొనె
యిరవగు పతివి నీ వింటికి రాఁగా
పరగఁ జూచితి మాపె పట్టరాని సంతోసము
సరవి నీ మనసు యే చందమో యిపుడు

చ. 2: కన్నులా నోరా వినెను కాంత నీవు మాటాడఁగా
సన్నపుఁ జిరునవ్వులు జాలు వారఁగా
మున్నె యెరిఁగితి మాపె మోహ మింత గలదని
పన్నిన నీగుట్టు యేరుపడ దింతే కాని

చ. 3: చేతులాఁ జన్నుల నిండాఁ జెలి యప్పళించుకొనె
ఘాతల శ్రీవెంకటేశ కాఁగిలియ్యఁగా
యీతలఁ దెలుసుకొంటి మీ యలమేల్మంగ యాస
యేతుల నీ యాకతము లెట్టుడెనో

రేకు: 0281-5 శ్రీరాగం సం: 09-185

పల్లవి: ఎవ్వరిపై మోహ మెట్టు దెలుసు మరి
యివ్వల నాతో నెనసితివి

చ. 1: మందపు నడపుల మగువ రాకలకు
పొందుగ రమణుఁడ పొగడేవు
కందువ వేరొక కాంత చూడఁగా
చిందెటి చెమటలఁ జెలఁగేవు

చ. 2: చతురత నొకసతి సరసము లాడఁగ
మితిమీరఁగ నిటు మెచ్చేవు
తతిగొని వేరొక తరుణి నవ్వఁగా
యితవులాడి చన విచ్చేవు

చ. 3: వంతుకు నొకచెలి వలపులు చల్లఁగ
చెంతల సన్నలు సేసేవు
యింతలో శ్రీవెంకటేశ నేఁ గూడఁగ
సంతమై నాకె సత మయితివి

రేకు: 0281-6 దేసాళం సం: 09-186

పల్లవి: ఎవ్వరి నేమనఁ జాల విది యేఁటిదో
అవ్వలి యివ్వలి భావ మది యేఁటిదో

చ. 1: కందువ నీ కాపె చూపి కాఁకలు నీ మీఁదఁ జల్లి
అందపు ముసుఁగు వెట్టె నది యేఁటిదో
యింద మని విడె మిచ్చి యియ్యకోలు మాటలాడి
యిందె నిలుచుకున్నది యిది యేఁటిదో

చ. 2: సెలవు నీ కాపె సేసి చేతులు నీ మీఁదఁ జాఁపి
అలసి పండున్న దాపె అది యేఁటిదో
మలఁగు నీకు వేసి మరి తానూ నం దొరగి
యెలమి నూరకేవున్న దిది యేఁటిదో

చ. 3: చక్కని భూకాంత యాపె చనవు నీ మీఁదఁ జూఁపి
అక్కర నీ వీడెపెక్కె నది యేఁటిదో
గక్కన శ్రీవెంకటేశ కైకొని నీ పురమెక్కె
యిక్కువ నలమేల్మంగ యిది యేఁటిదో

రేకు: 0282-1 సాళంగం సం: 09-187

పల్లవి: ఇదివో వలపు చింది యినుమ డాయను
యెదుట నీభాగ్య మాయ నిఁక నేఁటిదయ్యా

చ. 1: చెలియ నీ వింటికి విచ్చేసిన పరాకున
మలసి పయ్యద వెట్ట మరచె నదే
వెలయ నీ వింతలో నవ్విన నవ్వులకు నిట్టె
చలివాసి తన కొప్పు జారుటా నెరఁగదు

చ. 2: పడఁతి నీ చూపులు పైఁ బారిన సంభ్రమమున
బడినె పాయపు సిగ్గుపడ మరచె
జడియక నీ వంతలో సరసము లాడితేను
వొడలఁ జెమట నిండి వొలుకుట చూడదు

చ. 3: వేవేగ నీవు గూడిన వేడుక నలమేల్మంగ
శ్రీవెంకటేశుఁడు తనచేఁత మఱచె
భావించి నీవంతలోనె పైపై నెచ్చరించఁగాను
ఆవటించి తన మేని అలయికఁ గానదు

రేకు: 0282-2 శ్రీరాగం సం: 09-188

పల్లవి: తరుణి యిందుకే తలవంచె
సరసము లెటువలె జరపితివో

చ. 1: పంతము లాడుచుఁ బరతెంచిన చెలి
చెంతల నినుఁ గని సిగ్గువడె
మంతు కెక్కి కనుమరఁగులలోనె
యెంత సేసితివో యే మంటివో

చ. 2: జంకెల బొమ్మల జరసే నని సతి
అంకెల నినుఁ గని అరమఱచె
సంకెలేని నీ చాయలలోనె
వుంకువ నీ వెట్లుండితివో

చ. 3: అటు నినుఁ గలయుచు నలమేలుమంగ
నటనల నినుఁ గని నవ్వె నదే
చిటిపొటి రతులను శ్రీవెంకటేశ్వర
యెటువలె నొకటయి యెనసితివో

రేకు: 0282-3 శంకరాభరణం సం: 09-189

పల్లవి: తనివారఁ దిరువనందలము సేవ నేఁడు
అనువుగా సేవించరో అమరులు ఋషులు

చ. 1: యెదురుగాఁ గూచుండి యిద్దరు నందల మెక్కి
కదిసి మీఁదఁ బన్నాగము గట్టించి
ముదమున నొండొరులు మోములు చూచుకొంటా
యిదివో దేవులు దేవుఁ డేఁగేరు వీధులా

చ. 2: చదురులమాఁటలు సతు లాడఁగా వింటా
వుదుటునఁ దమ యంగా లొరయఁగను
అద నెరిఁగి మోవుల నంతలో నవ్వులు నవ్వి
యెదు రెదుర దంపతు లేఁగేరు వీధులా

చ. 3: పొదిగి యలమేల్మంగ పూఁచి కాఁగిలించఁగాను
కదలక కూడీ శ్రీవేంకటేశ్వరుఁడు
అదివో యాతఁడు మెచ్చె నాతని నాపె మెచ్చె
యెదిగి నగరిలోనె యేఁగేరు వీధులా

రేకు: 0282-4 నాట సం: 09-190

పల్లవి: పై పై నిన్నుఁ గొసరితే పసురే కాదా
వైపులు సేసుక నే నే వద్దనుండేఁ గాకా

చ. 1: యిచ్చకము లాడఁగానె యిటు రమ్మనేవు గాక
చెచ్చెర నిజ మాడితే చేర నిచ్చేవా
పచ్చిగాఁగ నీగుణము పచరించ నేమున్నది
కొచ్చి నా నేరుపుననె గుట్టుసేసేఁ గాకా

చ. 2: చాయచేసు కుండఁగానె చవులై వుందానఁగాక
నాయము నడపు మంటే నన్ను మెచ్చేవా
సోయగాన నిన్నంత సోదించ నేమున్నది
తీయని మాటాడి నిన్ను తిద్దుకొనేఁ గాక

చ. 3: కదిసి నేఁ గూడఁగానె కరఁగి చొక్కేవు గాక
వదరి నే నూరకున్న వస మయ్యేవా
అదె శ్రీ వెంకటేశుఁడ అలమేలుమంగ నేను
పొదిగి నేనుండఁగానె భోగించేవు గాకా

రేకు: 0282-5 లలిత సం: 09-191

పల్లవి: నాటి సుద్దులె వింటిమి నేటి సుద్దులు గంటిమి
పాటింప నావేడుకలు ప్రత్యక్షమైవున్నవి

చ. 1: ఆదనఁ గోనేటిదండ హరి గూచుండి చూడఁగ
యెదుటనె జలకేలి నింతు లుండఁగా
కదిసి యమునలోన కందువైన గోపికలు
పొదిగి వలపుచల్లే పోలికయ్యై వున్నది

చ. 2: అంతలోనె వలువలు అందరుఁ గట్టుక వచ్చి
చెంత నితని కొలువు సేయఁగాను
చింతదీరఁ దొల్లి అందె చీర లిన్ని నిప్పించుక
సంతసాన నిట్లుండే సరవినే వున్నది

చ. 3: అట్టె శ్రీవెంకటేశుఁ డలమేల్మంగనుఁ గూడి
నెట్టన పైఁడిమేడలో నిండు కుండఁగా
అట్టుగా వీ రిందరు నాఅడిసేసి నవ్వఁగాను
తెట్టెలై నాటి పొందులు తెలిపి నట్టున్నది

రేకు: 0282-2 శుద్ధవంతం సం: 09-192

పల్లవి: ఎంతమాట కెంత సేసే వేమీ నీవు
పంతాలు నెరపఁ బోతే పసచూప నున్నదా

చ. 1: చేసుకొన్న చెలిగాన చేకొని కొసరితే
యీసులు రేఁచుకొనే వేమీ నీవు
ఆసగలవాఁడ వైతె నన్నిటి కోరుతు గాక
వేసరుకొనేవు నీకు విన్నవించ నున్నదా

చ. 2: వొరసి సతి నీతోడ నూరకే అటుండితేను
యెరవులు సేసుకొనే వేమీ నీవు
కరఁగ నేరిచితేను కైవసమై వుందు గాక
పొరలఁ జూచేవు యిఁక పొందు సేయ నున్నదా

చ. 3: తగవులకాంత నీతో తచ్చనలు నెరపితే
నెగసక్కే లంటా నవ్వే వేమీ నీవు
నిగిడి శ్రీవెంకటేశ నేఁడు నన్నుఁ గూడితివి
మొగము చూచేవు నీతో మూసి దాఁచ నున్నదా

రేకు: 0283-1 భూపాలం సం: 09-193

పల్లవి: రమణుని చిత్త మింతే రాఁపులు మాతో నేల
సమముగాఁ జూడు మని చండిసేయవచ్చునా

చ. 1: పంతపు నీమాటలకు పనిలేదు మాతోను
చెంతలఁ బతికె బుద్ధి చెప్పరాదా
యెంతలేదు నీసణఁగు యేల వాదుకు వచ్చేవు
బంతిఁబెట్టి వలపులు పంచిపెట్ట వచ్చునా

చ. 2: జంకెన బొమ్మల మమ్ము సాదించఁ బనిలేదు
వంకల నీనేరుపుల వంచుకోరాదా
మంకుల నీగుణములు మాకుఁ గొత్తలా నేఁడు
అంకెలుగా నీమనసు అంటించ వచ్చునా

చ. 3: యీడుకుగా మాతోను యింతసేయఁ బనిలేదు
ఆడుకోలు గలిగితే ననరాదా
యీడనె శ్రీవెంకటేశుఁ డిరవై నన్నుఁ గూడె
వేడుకకూటములకు వెలవెట్టవచ్చునా

రేకు: 0283-3 పాడి సం: 09-194

పల్లవి: ఎప్పటివాఁడవె కావా యెరఁగఁ గాకా
చిప్పిల నేనే మరచితిఁ గాని

చ. 1: యింగితము చూచి నీ విటువంటివాఁడ వని
అంగనలు నాతోఁ జెప్పి రల్లనాఁడె
సంగడి నేనే నిన్ను సాదించనేరక
వుంగిటి మొగమోటాన నుండితిఁ గాని

చ. 2: దట్టమై నీ వింతేసి తలఁచే తలఁపులకు
అట్టె సగినాలు చెప్పి రల్లనాఁడె
వట్టి ఆసలను నేనే వాదువెట్టనేరక
గుట్టు సేసుకొని యింత కొంకితిఁ గాని

చ. 3: గుమితాన నింతసేసి కూడుదువు నన్ను నని
అమరఁ గలలు గని రల్లనాఁడె
తమితో శ్రీవెంకటేశ తగ నట్టె కూడితివి
సమరతి నేనే నిన్ను జట్టి గొంటిఁ గాని

రేకు: 0283-3 ముఖారి సం: 09-195

పల్లవి: మేలు నీతోడి పొందులు మేకు లాయను
వేళ వేళ నీ సతికి వింత లాయను

చ. 1: చిల్లరగా చెలి నీతో సెలవుల నవ్వఁబోతే
వెల్లవిరులై పెద్ద వెన్నె లాయను
చల్లని నీ సరసాలు జాలువారి జాలువారి
యిల్లిదివో వలపుల యేరు లాయను

చ. 2: మంతనాన నీతోను మాటలాడఁ బోతేను
చింతదీర నీపె కవె సిగ్గు లాయను
చెంత నీతో సంగాతాలు చిమ్మిరేఁగి చిమ్మిరేఁగి
కాంతుల మరుబాణాలు గను లాయను

చ. 3: సమ్మతించి యింతి నిన్నుఁ జక్కఁ జూడఁ బోతేను
కుమ్మరింపుఁ దమకపు గురు లాయను
కొమ్మకు శ్రీవెంకటేశ కూడిన నీ కూటములు
దొమ్ము లాసల రతుల దొంతు లాయను

రేకు: 0283-4 మధ్యమావతి సం: 09-196

పల్లవి: అన్నిటా భాగ్యవంతుఁడ వాయమెరిఁగి కూడితి
యెన్నికలు మీరితేను యెట్టుండునో సుద్దులు

చ. 1: చింతలనె కొంతపొద్దు చెక్కిటిచేఁ గొంతవొద్దు
కాంతలతోఁ గొంతవొద్దు గడపెఁ జెలి
యింతలో నీవు విచ్చేసి తిన్నియును లెస్సలాయ
యెంతలేసి పను లౌనో యించు కూరకుండినా

చ. 2: యెదురుచూచే యాస నిల్లుసింగారించే యాస
వెదకేటియాస గొంత వెలసెఁ జెలి
అద నెరిఁగి దగ్గరి అంతలో నీవు నవ్వితి
యెదుగా సరసమైతే నెన్నేసివిధులో

చ. 3: చూపులనె కొంతరతి సుద్దులనె కొంతరతి
యేపులనె కొంతరతి నెనసెఁ జెలి
పై పై శ్రీవెంకటేశ భామ నిట్టె కూడితివి
యీపొద్దు లివిదక్కె నింకా నెంతదక్కునో

రేకు: 0283-5 ఆహిరి సం: 09-197

పల్లవి: ఇంతకంటె వలపు నేనేమి చెప్పేను
కాంతుఁడవు నీవె యింకాఁ గనుకోవోయీ

చ. 1: అంతరంగములోనను ఆయము నీచింత నాకు
బంతి నీమాటలె చెవులపండుగ నాకు
సంతమైన సరసాలె జగమెల్లా నేలుట
వింత వింత చనవులె వేవేలు విధులు

చ. 2: కన్నులకు నీరూపు కామనిధానము నాకు
పనిన్న నీ చనవులె పంటలు నాకు
మన్ననల నగవులె మంచి కప్పురవిడేలు
మున్నిటి పొందుల సిగ్గు ముత్యాలసేన

చ. 3: మేనికి నీకాఁగిలి మెత్తని పరపు నాకు
తానకపు నీరతులె తగుభోగాలు
మానక శ్రీవెంకటేశ మరిగి నన్నుఁ గూడితి
నానెటి చెమట లివె నవరసాలు

రేకు: 0283-6 సౌరాష్ట్రం సం: 09-198

పల్లవి: ఇద్దరిఁ గూర్చినవారు యిప్పుడు మీరెకారా
వొద్దిక్క నప్పటి నేల వొరపులాడేరే

చ. 1: కచ్చుపెట్టి నే నతనిఁ గన్నులఁ బిలిచితేను
యిచ్చటఁ జెలులు మీరు యేల నవ్వేరే
ముచ్చటమాటులఁ గడు మోహముపైఁ జల్లితేను
పచ్చారుచుఁ జెలు లేల పచ్చిసేసేరే

చ. 2: పాయక నే నాతనిపయిఁ జెయివేసితేను
చాయల మీలో నేల సన్న లాడేరే
ఆయము లెరిఁగి నే నాకు మడిచియ్యఁగాను
వేయేసిలాగుల నేల వెంగేలాడేరే

చ. 3: భావించి శ్రీవెంకటేశుపాదాలు నే నొత్తితేను
వేవేగ సిగ్గున నేల వెలి నుండేరే
ఆవటించి కూడితిమి అప్పుడే మీరు లోనికి
యీవేళ వచ్చితి రింక నిట్టె వుండరే

రేకు: 0284-1 రామక్రియ సం: 09-199

పల్లవి: తొలుతె మీతమకము దోసిటిపాలు
అలరి యింకాఁ బెండ్లి ఆడవయ్య యిపుడు

చ. 1: సతికి నీకుఁ జూపుల సరిపొంతనాలుగూడె
చతురత మాట లనె సందివిడేలు
మతకరినవ్వు లనె మంచి పాశాల విందులు
అతిశయమగుఁ బెండ్లి ఆడవయ్య యిపుడు

చ. 2: యింతికి నీకు వయసు లిరువంకఁ గంకణాలు
పంతపుఁ దమకములె బాసికములు
కొంతఁ గొంత లేఁతసిగ్గు కొంగులువేసిన ముడి
అంతలో వేడుకపెండ్లి ఆడవయ్య యిపుడు

చ. 3: నంటుతోడి సరసాలు నాగవల్లి సోబనాలు
పెంటలైన సమరతి పట్టిన పేఁట
యింటిలో శ్రీవెంకటేశ యీయలమేల్మంగను
అంటి ముట్టి మంచిపెండ్లి ఆడవయ్య యిపుడు

రేకు: 0284-2 బౌళి సం: 09-200

పల్లవి: నివ్వెరగై వున్నాఁడవు నే మెంత పిలిచినా
ముువ్వంక వలపులు ముంచకుండీనా

చ. 1: సొలసి సొలసి నిన్నుఁ జూచిన యీ చెలిచూపు
నలిరేఁగి నీ మతిలో నాటకుండీనా
మలసి మలసి యిట్టె మాటలాడిన మాట
కలసి నీ మర్మాలు కలఁచకుండీనా

చ. 2: చిమ్ముచుఁ జిమ్ముచు నింతి చెనకిన చెనకులు
కిమ్ముల నిన్నిట్టె గిలిగించకుండీనా
కమ్మరఁ గమ్మర నీతో కందువ నవ్విన నవ్వు
దిమ్మరేఁచి నీగుణము తేలించకుండీనా

చ. 3: కరఁగి కరఁగి కాంత కాఁగిలించిన కాఁగిలి
అరమరపించి ఆయా లంటకుండీనా
యిరవై శ్రీవెంకటేశ యిద్దరి మమ్ముఁ గూడితి
గరిమ నీకిట్టె తారుకాణగాకుండీనా

రేకు: 0284-3 పాడి సం: 09-201

పల్లవి: ఇట్టి నీకు వలచిన యింతిదె జన్మముగాదా
వట్టి మోహించినవారి భాగ్యమవె కావా

చ. 1: నీవు మన్నించేటి యట్టి నెలఁతల కెల్లాను
తావుల లీలారవిందమవె కావా
భావింప నీచూపులు వారినవారి కెల్లా
ఆవటించి మెడకంఠహారమవె కావా

చ. 2: కప్పురపు బళ్లందిన కాంతలకెల్లాను(?)
కప్పిన శిరోవణికమమె కావా
చొప్పుగా నీపాదాలు సోఁకినవారికెల్లా
కప్పమైన ముంజేతి కంకణమవె కావా

చ. 3: కోరి నీవు కాఁగిటిలోఁ గూడుండె సతుల కెల్లా
నారుకొన్నయట్టి నిధానమవె కావా
యీరీతి శ్రీ వెంకటేశ యెనసి నన్నేలితివి
తేరకొన నాపాలి దేవుఁడవె కావా

రేకు: 0284-4 శ్రీరాగం సం: 09-202

పల్లవి: ఇటువంటి నీ భాగ్య మేమని చెప్పుదుమమ్మ
తటుకనను నీపతితపము లీడేరె

చ. 1: చెక్కుల మకరాంకము జిగిఁగన్నుల మచ్చములును
మిక్కిలి శంఖము మెడను మీఁగాళ్లఁ గచ్ఛపములు
చిక్కని నీరూపఁపు సింగార జలనిధికిని
నెక్కొని తామొనరి నవనిధులాయఁ గదవే

చ. 2: వదనమునఁ బద్మంబు వరము కుచగిరులకును
అదె దంతములఁ గుందము లలకము లనిలములు
అద నెరిఁగి నిలిచి నీయవ్వనపు జలనిధికి
పొదిగి నవనిధులగుచుఁ బొడమె నదె కదవే

చ. 3: కాఁగిటను శ్రీవెంకటగిరి ముకుందంబు
మూఁగిన వరము లెల్ల ముంగిటందు
చేఁగమీరిన రతులచెమట లను జలనిధికి
ఆఁగి యిటు నవనిధులు నాయఁ గదవే

రేకు: 0284-5 సామంతం సం: 09-203

పల్లవి: నేనే యెరుఁగుదును నీవూ నెరుఁగుదువు
పూనిన రుత్తమాటలు భూమి నెన్నిలేవురా

చ. 1: తలఁచినట్టె నీవు దగ్గరి విచ్చేసితివి
వలపు లంటె నిటువలె నుండురా
సొలసి నేఁ జూడఁగానె చూచితివి నీవు నట్టె
యెలమి లోలోని యాస కిది దిష్టాంతమురా

చ. 2: నవ్వి నానవ్వులు నీనవ్వులు నొక్కటాయ
యెనసిన యింపులకు నీగురుతేరా
వొనర నిద్దరికిని వొక్కమాటే పులకించె
తనువు లొక్కటౌటకు తారుకాణ లివిరా

చ. 3: రాణించి నేఁ గోరినట్టే రతి నీవు సేసితివి
ప్రాణము లెరవుగాని భావ మిదిరా
జాణవు శ్రీవెంకటేశ జంటవాయ మిద్దరము
నాణెపు వేడుకలెల్ల నాకు నీకె తగురా

రేకు: 0284-6 బౌళి సం: 09-204

పల్లవి: ఎవ్వరితోనైనాఁ జేయుమీ మాయలు
రవ్వలఁ బెట్టఁగ నేము రాఁపువారమా

చ. 1: తక్కక నీవు మాపై తలఁపు గలితేఁ జాలు
అక్కడ యిక్కడె కాదా అందు కేమీ
చొక్కులఁ బెట్టుచు మాతో చుట్టరికము నెరప
వెక్కసాన నేఁడు నీకు వింతవారమా

చ. 2: పొద్దుపొద్దు మా ముంగిటఁ బొలసి వుండితేఁ జాలు
యిద్దర మొక్కటె కాదా యిందు కేమీ
కొద్దిమీర నీవు మమ్ముఁ గొంగువట్టి తీసేవు
గద్దించి నీతోఁ బెనఁగ కడవారమా

చ. 3: సమరతిఁ గూడితివి సారెకుఁ బొగడవద్దు
తమక మొక్కటె కాదా దాని కేమీ
అమరె శ్రీవెంకటేశ అన్నియుఁ గడపలోన
జమళిబాస లియ్య మెచ్చనివారమా

రేకు: 0285-1 సామంతం సం: 09-205

పల్లవి: నిందలేని పతి విదె నీవు నాసొమ్ము
కందువ సొమ్ములమీఁదఁ గలిగెను సొమ్ము

చ. 1: సూటిగా నీవు చూచేటి చూపు నాసొమ్ము
పాటించి నీవు పలికేపలుకు నాసొమ్ము
కూటమిరతుల కొనగోరు నాసొమ్ము
యీటున నీమేనిసొమ్ము లిచ్చేవు నాకు

చ. 2: చవిగా నాడే నీ సరసము నాసొమ్ము
జవకట్టుక యిచ్చే నీచనవు నాసొమ్ము
నవకమయిన నీనవ్వు నాసొమ్ము
యివల నింకా సొమ్ము లిచ్చేవు నాకు

చ. 3: కింకలేని దిదే నీకాఁగిలి నాసొమ్ము
లంకెలైన నీమతివలపు నాసొమ్ము
అంకెల శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
యింకా సొమ్ము లిచ్చేవు యెన్నియైనా నీవు

రేకు: 0285-2 ముఖారి సం: 09-206

పల్లవి: ఏమిటికి వేఁడుకొనే వింతలోఁ దమకించేవు
కామించి నీ వాడినట్టు కాదంటినా

చ. 1: మచ్చరములెల్లఁ దీరె మంతనాన నీవు నాతో
యిచ్చకము లాడితేనె యియ్యకొంటివి
కుచ్చి కాఁగిలించి నాచెక్కులు నొక్కే వేమిటికి
నిచ్చలు నీచెప్పినట్టు నేఁ జేయనంటినా

చ. 2: ఆనలెల్ల విడిచితి నంటఁబట్టి నీవు నాకు
తేనెమోవి యిచ్చితేనె తిరమైతివి
పూనిక నా కొంగువట్టి పొంచి యాలపెనఁగేవు
వూని నీతో పొందులు నే నొల్లనంటినా

చ. 3: మంకు లన్నియుఁ దొలఁగె మనసుమర్మములంటి
సంకెలు దీరిచితేనె సమ్మతించితి
కొంకక శ్రీవెంకటేశ కూడి యింకాఁ బొదిగేవు
పొంకమైన మీఁదాఁ దప్పులు వట్టేనా

రేకు: 0285-3 సాళంగనాట సం: 09-207

పల్లవి: పిలువవచ్చిన నేను పెంట వెట్టుకొన్నదాన
తలఁపు నీ కెట్టున్నదో దంటఁగాను నేను

చ. 1: కామినులతోడి మాట కలది కలట్టేకాని
కోమలపు కల్లలైతె కోపగింతురు
జామాయ నీవద్దనుండి సరినాపెతో నేమందు
నీమతకము లేఁటివో నే మెరఁగ మిఁకను

చ. 2: వలచినవారిపొందు వచ్చినట్టె వచ్చుఁగాని
కొలఁదికి రాకున్న కొసరుదురు
నెలకొంటి నిక్కడ నేనె నాపె నెట్టు నమ్మింతు
యెలమి మీ కిద్దరికి నెదురాడ నోపను

చ. 3: యిల్లాండ్ల కన్నియును యియ్యకోలై వుండుఁగాని
జల్లించి సందుగలితే సాధించరు
యిల్లిదె నన్నుఁ గూడి యింట నాపెఁ గూడితివి
వొల్లనె శ్రీవెంకటేశ వూరకుండే నిపుడు

రేకు: 0285-4 శ్రీరాగం సం: 09-208

పల్లవి: ముట్టితేనె ముయిముచ్చటలూ
అట్టు సేయ నాఅడిదానానా

చ. 1: గక్కన నీతనిఁ గన్నులఁ జూచిన
పిక్కటిల్లె నిదె పెంజెమట
చెక్కడచితేను చేటఁడు వలపులు
వొక్కమాటె నే నోపుదునా

చ. 2: నవ్వి యితనితో ననుపులు సేసిన
పువ్వకపూచెను పులక లివి
రవ్వగాఁ బెనఁగితే రాసెఁడు తమకము
జవ్వనము మోవఁ జాలుదునా

చ. 3: కాఁగిట నితనిఁ గలసితి నిందుకు
చేఁగలు దేరెను చిత్తమిది
వీఁగఁ డితఁడు శ్రీవెంకటేశ్వరుఁడు
నీఁగని చలములు నేరుతునా

రేకు: 0284-5 ఆహిరి సం: 09-209

పల్లవి: ఇద్దరుఁ గూడినమీఁద నిఁక నేఁటి సుద్దులే
పొద్దు వొద్దు కాతఁడు బుజ్జగించఁగాను

చ. 1: తమకించే వేఁటికె తా నిన్న రానియందుకు
అమర నాతఁడు నీతో నానతీఁగాను
చెమరించే వేఁటికె చెక్కు నొక్కి యాతఁడు
జమళి వేఁడుకొని యిచ్చకము సేయఁగాను

చ. 2: పచ్చిసేయ నేఁటికె పరాకై తా రున్నందుకు
చెచ్చెర నాతఁడు నిన్నె చెనకఁగాను
మెచ్చ వింకానేఁటికె మేకుల నిన్నుఁ బొగడి
వొచ్చముదీర నాతఁడు వుపచరించఁగను

చ. 3: ఆరీతి యింకేఁటికే అన్ని చేఁతలకు నిన్నుఁ
గోరి శ్రీవెంకటేశుఁడు కూడఁగాను
బీరములు మానవె పెనఁగి నిన్నుఁ గలసి
ఆరసి యీతఁడె నీకు నందాలు చెప్పఁగనూ

రేకు: 0285-6 మాళవి గౌళ సం: 09-210

పల్లవి: ఈతఁడు వద్దనుండఁగ యేల యెమ్మెలు చెప్పేరే
గాతల మగలవద్ద గర్వములు గలవా

చ. 1: చెంగట మామొగమున చేరఁడేసి కన్నులంటా
అంగన లందరు నన్ను నాడుకొనేరే
పంగించి మానెరులివి బారెఁడేసి ఆయనంటా
వుంగిటిగా సారె నేల వుప్పతించేరే

చ. 2: పంతాన నాకుచములు బంగారుకుండలంటా
బంతినుండి చెలులేల పచ్చారేరే
యింతలో నాపిరుఁదులు యిసుక దిబ్బెములంటా
రంతులుగాఁ గడు నేల రాఁపు సేసేరే

చ. 3: పొంచి నా రూపమిది పుత్తడిఁ బోలునంటా
యెంచి యెంచి మమ్మునేల యింతసేసేరే
అంచల శ్రీవెంకటేశుఁ డన్నిటా నన్నుఁ గలసె
మించుగాఁగ మమ్ము నేల మెరయించేరే

రేకు: 0286-1 శ్రీరాగం సం: 09-211

పల్లవి: వలపులా గటువంటిదివో
పిలిచేటి ప్రియమున బీరము మఱచె

చ. 1: వెలఁది నిన్నుఁ గని వేడుకతోడను
అలుక లన్నియును నటు మఱచె
నలుగడ నీతో నవ్వేటి సందడి
చలములు లోలో సాదించ మఱచె

చ. 2: యింతి విడె మిదె యిచ్చే పరాకున
పంతపు టొట్లపని మఱచె
చెంతల నినుఁ గడు చెనకే సొబగున
కొంతయినఁ దొల్లిటి కోపము మఱచె

చ. 3: కొమ్మ కాఁగిటను కూడే తమకమున
సమ్మతి జంకించఁగ మఱచె
యిమ్ముల శ్రీవెంకటేశ కలసితివి
చిమ్ముల యెరవులు సేయఁగ మఱచె

రేకు: 0286-2 రామక్రియ సం: 09-212

పల్లవి: ఎటువంటి చుట్టరిక మెటువంటి పొందులు
నటవటలకు నేల సాదించేవే

చ. 1: అప్పటినుండియు నీ అండ నిట్టెవుండఁగాను
రెప్పలెత్తి చూచి చూచి రేసు లాడేవు
చెప్పినవారిమాటకు చెవియొగ్గి విని విని
తప్పుఁదారుల నేల తమకించేవే

చ. 2: మనసిచ్చి నే నీతో మాట లిట్టె ఆడఁగాను
వెనకసుద్దుల కేల వెంగె మాడేవే
తనిసి వొకటొకటె తలఁచుక తలఁచుక
పెనఁగి నేఁ బిలువఁగ బిగిసే వేలే

చ. 3: కందువ లంటి నేను కాఁగిలించి కూడఁగాను
చందపు బొమ్మల నేల జంకించేవే
చెందితి నిదివో నిన్ను శ్రీవెంకటేశుఁడ నేను
అందిన రతుల నేల అలయించేవే

రేకు: 0286-3 దేశా(సా)క్షి సం: 09-213

పల్లవి: తా నదివో నే నిదివో తారుకాణ లైతిమి
మోనముతోడ నవ్వరే మోవులనవ్వూ

చ. 1: ఆడ నీడ నుండి వచ్చీ అలసి సొలసి మెచ్చీ
వేడుకకాని కియ్యవే విడె మిదిగో
నీడనుండె అలసీని నిలుచుండె కలసీని
పాడితోడనె మొక్కరే పండుగమొక్కు

చ. 2: చేయఁగలవెల్లాఁ జేసీ చేరి నాపైఁ జెయి వేసీ
పాయపు వాని కియ్యరే బలు కట్నాలు
చాయలకె మాటలాడీ సన్నలకె పాట పాడీ
దాయముగాఁ జూడరే సంతసపుఁ జూపు

చ. 3: కాంతలలోన వెలసీ కాఁగిట నన్నుఁ గలసీ
పంతగాని పై జల్లరే బలు సేసలు
యింతలో శ్రీవెంకటేశుఁ డితఁడిదె నన్నుఁ గూడె
వింతగా విందు చెప్పరే వియ్యపు విందు

రేకు: 0286-4 లలిత సం: 09-214

పల్లవి: ఎవ్వరి బుద్ధులు యెక్కడి కెక్కును
నవ్వులె జాణల నను పయ్యేడివి

చ. 1: పంతము లాడరు బలుములు చూపరు
వంతు లెంచ రటు వలపులకు
సంతసంబులునుఁ జవు లగు సరసము
లెంతైన లోలో నెర వయ్యేడివి

చ. 2: వేసట చూపరు వింతలు సేయరు
వాసులు నెరపరు వలపులకు
ఆసల తమకము అంగపుఁ గరఁగులు
తాసులవలెనే తగు లయ్యేడివి

చ. 3: గుట్టున జడియరు కొంకుచు మొరయరు
వట్టువోరు తమ వలపులకు
యిట్టై శ్రీవెంకటేశ మీకూటమి
నెట్టన రతులివె నిలిచినవి

రేకు: 0286-5 ముఖారి సం: 09-215

పల్లవి: ఎఱఁగని యాఁటదయితే యిది నిజమంటా నమ్ము
నెఱయ మాతో నిజమే నెరపవలయురా

చ. 1: యెదుటనె వలపు యింటికాడ బులుపు
వదల కేడ నేరిచి వచ్చితివిరా
పెదవులపై మాట బిగువులలో తేట
సదరమై నీకెపుడు సాజమే కదరా

చ. 2: చెనకితే సిగ్గులు చేఁతలనే యెగ్గులు
ననుపున రెండూ నెట్టు నడపేవురా
మునుపనె మొక్కులు మోచి వచ్చితె తెక్కులు
పొనిగి నీవు పుట్టఁగఁ బుట్టినవే కదరా

చ. 3: మెచ్చితేనె మేకులు మీరితేనె కూకులు
యిచ్చకొలఁది నడతు వేమందురా
ముచ్చట శ్రీవెంకటేశ ముంచి నన్నుఁ గూడితివి
చెచ్చెరఁ బరులకైతె సేతువు మాయలురా

రేకు: 0286-6 మంగళకౌశిక సం: 09-216

పల్లవి: సవతుల కెల్ల నీవు చాటి చెప్పింతువు గాక
నవకాన మూలనుంటె నమ్మేరా దేవులని

చ. 1: ఆతనివద్ద నుంటె నీ వాల వని యందుఁ గాక
యీతల నీ వెట్టుండినా నెవ్వ రందుము
యేతులకు నీవు మాతో నెరుకలు సేసుకొని
బూతులఁ దిట్టితేనె నీ పొందు గానవచ్చునా

చ. 2: ముచ్చట మీరాడుకొంటే మోహాలు గందుము గాక
పచ్చి గుట్టున నుంటె నీ భావ మెందుండు
మచ్చిక నీ చనవులు మా ముందర మెరయించి
కొచ్చి యాతనిఁ జూచితే గుట్టు గానవచ్చునా

చ. 3: కాఁగిట శ్రీవెంకటేశుఁ గాఁగిలించుకొంటెఁ గాక
ఆఁగి నీవూర కుండితే నందములౌనా
చేఁగదేర నన్నుఁ గూడె చేరి యాతఁడని నీవె
రాఁగి నీలోనె నవ్వితే రచ్చలకు నెక్కునా

రేకు: 0287-1 నాదరామక్రియ సం: 09-217

పల్లవి: ఎటువంటి మోహమో యీపెకు నాతని మీఁద
ఘటియించె నిద్దరికి కందువ వేడుకలు

చ. 1: సంగడిఁ గూచున్నది చనవు చేకొన్నది
అంగపుఁ జెమట నోల లాడినది
యెంగిలిపొత్తున విడే లిచ్చినది మెచ్చినది
పంగించీ నిందిరాదేవి ప్రహ్లాదవరదుని

చ. 2: మొక్కుచు నవ్వినది ముచ్చట లాడినది
యిక్కువ లంటుచు లోలో నెన సున్నది
చెక్కుఁ జెక్కుఁ గదియించి జిగిఁ బులకించినది
చిక్కించీఁ గమలాదేవి శ్రీనరసింహునిని

చ. 3: కనుసన్న చేసినది కాఁగిట నించినది
తనివార రతులను దక్కఁ గొన్నది
చెనకి యహోబలాన శ్రీవెంకటాద్రి మీఁద
ననిచె శ్రీమహాలక్ష్మి నరమృగదేవుని

రేకు: 0287-2 దేసాళం సం: 09-218

పల్లవి: అప్పటి నమ్మఁడు తన్ను నటు వెంగి లాడే నంటా
యిప్పుడూ నానవెట్టెను యింకనేలె నవ్వులు

చ. 1: బాగాలు వెట్టరె పైకొని విభునికి
వాగమై యింతుల కెల్లా వలపు మని
యీగతి మూసి మంతనా లిన్నాళ్లుఁ దనకు
వేగమె యప్పణిచ్చితి వెరుపేలె యిఁకను

చ. 2: వుపమ లెత్తియ్యరె వొకటొకటె పతికి
నెపాన సతులఁ బొంద నేరువు మని
కపటాన దాఁ గొంత కనియుఁ గానము లేల
యెపుడూఁ దనకు లోనె యిఁక నేలె కొంకను

చ. 3: చేయెత్తి మీరు మొక్కరె శ్రీవెంకటేశ్వరునికి
పాయపువారి మనసు పట్టుమని
యీయెడఁదా నన్నుఁగూడె యిచ్చకము సేసుకొని
నాయము నేనె చెప్పేను ననుపాయ నిఁకను

రేకు: 0287-3 రామక్రియ సం: 09-219

పల్లవి: ఏల నీవు చిన్నఁబొయ్యే వేఁటి కానలు వెట్టేవు
జాలిఁ బెట్టి బొమ్మలను జంకించేనా

చ. 1: అలిగి నీతో మాటలాడ కెంతవుండినాను
చలములు గడు నేము సాదించేమా
నిలిచి నేఁ గడు నిన్ను నేరము లె న్నెంచినాను
బలుములు చూపి యిట్టె భ్రమయించేమా

చ. 2: యెనయక కోపాన నే యింటిలోనె వుండినాను
వెనక నీ చేఁతలు నేవెళ్ల వేసేనా
మనసునఁ గాఁతాళించి మంకులు నే నెరపిన
పెనఁగి పిలిచి నీతో బీరము లాడేనా

చ. 3: పదరి నీతో నెంత పంతము నే నాడినాను
అదన నిన్నుఁ గూడక అలయించేనా
యెదుట శ్రీవెంకటేశ యిటు నన్నుఁ గలసితి
పుదుటున నే నీతో నోప ననేనా

రేకు: 0287-4 భైరవి సం: 09-220

పల్లవి: ఆఁటదానికి పతితో నంతచెల్లునా
చీటికి మాటికి యంతసేసేవె నీవు

చ. 1: పట్టినదె చల మని పంతములె నెరుపేవు
అట్టె యాతని ప్రియము లంగవించవు
చిట్టకాలు వద్దనిన చెలుల మాటలు చెవిఁ
బెట్టవు నీకుఁ దగిన బీరములె కాని

చ. 2: ఆడినదె మాటసేసి యట్టె నిలువఁ బెట్టేవు
జోడుగా నాతని మాట చొరనియ్యవు
తోడనె నే మిద్దరి చేతులుఁ బట్టికూరిచిన
కూడియుఁ గూడవు నీ గుణములె కాని

చ. 3: మొదలివొట్టుకు నీ మొనలు చూపేవు గాని
అదనైన మీఁద నింక నటు మెచ్చవు
యిదివో శ్రీ వెంకటేశుఁ డిదె నన్నుఁ గూడినాఁడు
చదురు లింకా నీవు సాదించేవు గాని

రేకు: 0287-5 మంగళకౌశిక సం: 09-221

పల్లవి: దయఁదలఁచుక నేనె తగిలి కూడితి నిన్ను
క్రియ చూపక నే నుంటె గెంటించఁ గలవా

చ. 1: నంటున నీతో నేను నగఁగానె సందుకొని
అంటు ముట్టి సరసము లాడేవు గాక
జంటమాటలాడక చలపట్టి నే నుండితే
వొంటినే సాదించి నన్ను వొరయఁగఁ గలవా

చ. 2: పొత్తుకుఁ బిలిచి నేనె పాదుగఁగానె నీవు
హత్తుక నీ వింతేసి పొంద్దై తివి గాక
గుత్తపు నాగుణముతో గుట్టు సేసుక వుండితె
చిత్తగించి నీ చలము చెల్లించుకోఁ గలవా

చ. 3: చేయి చాఁచి నే నిన్ను చెనకి కాఁగిలించఁగా
యీయడ నన్ను నేఁడె యేలితి గాక
చాయల శ్రీవెంకటేశ సరికి బేసికి నీతో
మాయలు నేఁజేసితేను మారు కొనఁగలవా

రేకు: 0287-6 పాడి సం: 09-222

పల్లవి: ఇంతిమాటలకు నేల యెగ్గు పట్టేవు
చెంతల నాపె చనవు చెల్లించరాదా

చ. 1: అగపడి లోనైతె అన్ని నవ్వులె కాక
యెగసక్కే లాడే నంటే యెంతలేదు
చిగిరించినట్టి వేళ జిగిఁ బండినట్టి వేళ
వొగరుఁ దీపునుఁ దోఁచు నొక్కటందే కాదా

చ. 2: సరిఁ జుట్టరికానకు సరసాలె అన్నియును
యెరవులు సేసుకొంటే నెంతలేదు
తొరలఁ గాఁచినప్పుడు తోడంటు వెట్టినప్పుడు
పెరుగుఁ బాలును నొక్క పేరుపునే కాదా

చ. 3: కొయ్యవై శ్రీవెంకటేశ కూడుకొంటి వాపె నిట్టె
యియ్యకోలు సేసుకొంటే నెంతలేదు
చయ్యన దంచినచోట చవిగా వండినచోట
బియ్యము వంటకమై బెరసేదే కాదా

రేకు: 0288-1 సామంతం సం: 09-223

పల్లవి: అప్పటినన్నె కొసరీ నదివో ఆపె
నెప్పున నన్నిపనులు నీకె తెలును

చ. 1: తెగరానిచోట వాదుదీసి యెంతమాటాడిన
పగలేదు చనవుల బలిమె కాని
మగవాఁడ వందుమీఁద మట్టు పడనోపుదువు
తగవులు మమ్మేల యిత్తరి నడిగేవు

చ. 2: వలచినవారు పై పై వాసులెంత నెరపిన
చలములుగావు రతిచవులె కాని
బలువుఁడ వందు మీఁద పనిగొన నోపుదువు
చలివాసి మమ్మేల సాకిరివెట్టేవు

చ. 3: ఆరితేరిన దంపతు లాయము లెం తంటినాను
నేరుపులేకాని అందు నెగులులేదు
కూరిమి శ్రీవెంకటేశ కూడితి వందుమీఁదను
నారుకొన మాతో నేల నవ్వులు నవ్వేవు

రేకు: 0288-2 లలిత సం: 09-224

పల్లవి: ఎక్కడి సుద్దు లేలె యిది గొంతా
చిక్కితి నీపాలను విచ్చేయవయ్య లోనికి

చ. 1: చింతలేక నీకు నీవె సేసిన సేఁతలకును
యెంత నేము దూరినా నీకేఁటి వెరపు
చింతించ నీ కేఁటికి చెక్కుచేయి యేఁటికి
వింతవార లిదిగంటే వేసా లనరా

చ. 2: దెప్పరాన నీవు లోలోఁ దిరిగే తిమ్మటలకు
యిప్పటి మా యలుకలు యేడ కెక్కును
రెప్ప లెత్తి చూచేవు రేసువడి యున్నాఁడవు
యిప్పటి నీజాడలెల్లా యెగసక్కే లనరా

చ. 3: కదిసి నీ మేనను కల్ల లెన్ని దోఁచినాను
యెదుట నున్నాఁడవు నిన్నే మనేము
అదన శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
చదురుఁడ విన్నిటను జాణవు నీ వనరా

రేకు: 0288-3 హిందోళం సం: 09-225

పల్లవి: అందాఁకా వేగిరమా ఆఱడికాఁడ
చిందేవు మాటలఁదేనె చెల్లు నీకు నయ్యా

చ. 1: నవ్వుతా నే నుండఁగానె నంటున గిలిగించేవు
అవ్వల నీ కింకా నెంత ఆసోద మోయి
పువ్వువంటి నావయసు పూఁచి నీపైఁ జల్లఁగానె
తవ్వేవు జాణతనాలు తమకి వౌదువు

చ. 2: దగ్గరి నే నుండఁగానె దండకు నొత్తుకొనేవు
వెగ్గళించి నీకెంత వేగిరమోయి
సిగ్గుదేరి నీ మీఁద చేతులు నేఁ జాఁచఁగానె
వొగ్గి కాఁగిట బిగించేవు వుబ్బుకాఁడ వౌదువు

చ. 3: కలసి నే నుండఁగానె కమ్మి రతికిఁ దీసేవు
లలి శ్రీవెంకటేశుఁడ లావరి వోయి
యెలమి నన్నేలితివి యియ్యకొంటి నే నట్టె
పలుకుఁ బంతము చెల్లె పనివాఁడ వౌదువు

రేకు: 0288-4 ధన్నాశి సం: 09-226

పల్లవి: కోరి చేకొనఁగరాదు కోపగించు కొనరాదు
యీరీతి విచ్చేసితివి యేడనుండో యీడకు

చ. 1: పొదిగేవు వొకవేళ పొరలేవు వొకవేళ
అదిబిదుకు వలపు లవియాల
వెదకితి మాపునంత వేగించితి వేగునంత
యిదిగో విచ్చేసితివి యేడనుండో యీడకు

చ. 2: మనసువ చ్చొకమాట మనరా కొక మాట
అనుమానపు చెనకు లవియాల
చనవు చల్లితిగొంత సరస మాడితిగొంత
యెనయ విచ్చేసితివి యేడనుండో యీడకు

చ. 3: చేయిచాఁచే వప్పటిని సిగ్గువడేవు కమ్మటి
ఆయ మెరఁగని రతు లవియాల
పాయక శ్రీవెంకటేశ పైకొని కూడితి విట్టె
యీయెడ మేలుకొంటివి యేడనుందో యీడకు

రేకు: 0288-5 ముఖారి సం: 09-227

పల్లవి: కూరిమిఁ గొసర నేల కొంక నేల
బీరముతో నుండుఁగాక పెనఁగంగ నోపమే

చ. 1: సంగడిఁ గూచుండనేల జగడ మాడఁగనేల
వుంగిటి నివ్వలిమోమై వుండేమె నేము
ముంగిటఁ దా రమణుఁడు ముసి ముసి నవ్వులతో
రంగుమీరి వుండుఁగాక రవ్వసేయ నోపమే

చ. 2: యింటికిని రానేల యెగసక్కె మాడనేల
వొంటినైనాఁ బానుపుపై నుండేమె నేము
జంటలై తా నందరితో సరసము లాడుకొంటా
వెంట వెంట రానీవె వేసరించ నోపము

చ. 3: తప్పక చూడఁగనేల తమకించ నింతయేల
వొప్పగు నివ్వెరగుతో నుండేమె నేము
అప్పటి శ్రీవెంకటేశుఁ డాతఁ డిట్టె నన్నుఁ గూడె
వుప్పటించి వూరడించి వొద్దఁ బాయ నోపము

రేకు: 0288-6 పాడి సం: 09-228

పల్లవి: ఎవ్వరి బలువెక్కుడో యిద్దరిలోన
రవ్వగా నానతీవయ్య రామచంద్ర మాకు

చ. 1: చెక్కిటఁ బెట్టిన చేయి సేతువుగట్టినకట్ట
చక్కని సీతాచింతాజలధికిని
పెక్కు కొండలచే నీవు పెనచి కట్టించితివి
వొక్కమాటె ఆపె అయితె నుండుమంటె నుండెను

చ. 2: ముంచి చెలి పులకింపు మోహవనవాసము
మించిన విరహముల మితిమేరకు
సంచరించి నీవైతె జగమెల్ల నిండితివి
యించుకంతలోన నాపె యీడనుండె నిండెను

చ. 3: వొట్టిన నీకాఁగి లయోధ్యలోని పట్టము
నెట్టన శ్రీవెంకటేశ నీ దేవికి
అట్టుగా నీ వింతలో నాఅడి రాజ్య మేలితివి
యిట్టె మరురాజ్యమేలే యీ యింతి రతులను

రేకు: 0289-1 ముఖారి సం: 09-229

పల్లవి: ఎంతలేదు మాటలు యేడ కేడ సుద్దులు
యింతవాఁడ వౌత నిన్ను నెరఁగనా నేను

చ. 1: యెక్కడనుండో వచ్చి యిచ్చకము సేసి నా
చెక్కులు నొక్కినదె సెలవా నాకు
వొక్కమాటె నవ్వు నవ్వి వొడివట్టి తీసి నన్ను
తక్కులఁ బెట్టినదె తనివారెనా

చ. 2: నిద్దుర గంటికిరాఁగా నీ చేఁతలు దాఁచుకొంటా
వద్దఁ గూచుండినదె వరుసా నాకు
సుద్దులెల్లఁ జెప్పి చెప్పి చొక్కులఁ బెట్టుచు నాతో
పొద్దున మంచ మెక్కితె పొందికాయనా

చ. 3: వేడుకలు దైవార వేసాలకుఁ బొగడుతా
యీడ నన్నుఁ జెనకేదె యీడె నాకు
కూడితి శ్రీ వెంకటేశ గుణ మెరిఁగి నన్నిట్టె
జోడువాయ కుండితేనె సోద్యమాయనా

రేకు: 0289-2 నాదరామక్రియ సం: 09-230

పల్లవి: విన్నప మేఁటికి వేమారు
పన్నిన కరఁగులఁ బదరీఁ జెలియా

చ. 1: ముసి ముసి నవ్వుల ముంగారు ముంపులు
వసివాడుఁ జెమట వానలు
ముసుఁగుల సిగ్గుల మూఁడామంచులు
కుసుమై వలపులె కురిసీఁ జెలియా

చ. 2: కన్నుల తేటల కప్పుర మాకుల
సన్నపు నిట్టూర్పు సంపెంగల
చిన్ని నెరిఁ గురుల చీఁకటి మాకుల
వన్నె మదరసము వడిసీఁ జెలియా

చ. 3: సరి మోవులనె వసంతపు చిగురుల
పరగుఁ గుచము లను ఫలములను
యిరవై శ్రీ వెంకటేశ నినుఁ గలసి
పొరిఁ బొరి విందుల పూచీఁ జెలియా

రేకు: 0289-3 సాళంగనాట సం: 09-231

పల్లవి: చేతికి లో నైనప్పుడు చెప్పేఁగాని
యేతుల సెలవి నవ్వు లీడ నేలా

చ. 1: ముంగిట నే నుండఁగాను మోహించి చెనకేవు
అంగడిచుట్టరికాలు అవియాల
రంగుగా నీవున్నచోటు రాతిరే వింటిమి నేము
యెంగిలి పొత్తుల మాట లీడ నేలా

చ. 2: వొంటి నే నుండఁగాను వొడివట్టి పెనఁగేవు
కంటిఁ గంటి గురుమ కత లేల
వుంటిమి నీవన్నిటాను వొరపరి వౌదువు
పెంటపట్టు సరసాలఁ బెనఁగ నేలా

చ. 3: కదిసి నే నుండఁగానె కౌఁగిటిఁ గూడితివి
పొదుగుడువలపుల పొదు లేల
అదివో శ్రీవెంకటేశ అన్నిటాఁ జొక్కితి నేను
అదనైనప్పుడె జోహా రన నేలా

రేకు: 0289-4 వరాళి సం: 09-232

పల్లవి: మీరు మీరు నొక్కటే మీఁద నన్నీ మంచివే
ఆరితేరె మీ వంక నలయించకువ మ్మా

చ. 1: చెంతల నాతఁడు నీ చెక్కు నొక్కి వేఁడుకొనీ
పంతము దప్పదు నేఁడు పలుకవమ్మా
యంతలే దీ యలుకలు యెవ్వరికి సతమాయ
వింతదానఁ గాను సిగ్గు విడువవమ్మా

చ. 2: పక్కన నీరమణుఁడు పచ్చడము గప్పెనదే
వెక్కసపు సాదనలఁ గట్టుకొనే దేమున్నది
కక్కసపు సాదనలఁ గట్టుకొనే దేమున్నది
యిక్కడ ననుమానించే వెవ్వ రున్నారమ్మా

చ. 3: శ్రీ వెంకటేశ్వరుఁడు చేరి నిన్నుఁ గూడె నిదె
చేవదేరెఁ గెమ్మోవి చెలఁగవమ్మా
వేవేలు చెప్పినాను వేడుకకు వెలలేదు
మోవులనె నవ్వేవు మొరఁగ నే లమ్మా

రేకు: 0289-5 గౌళ సం: 09-233

పల్లవి: ఏఁటికయ్య మాఁటలు యింకా తాటతూఁటలు
యీటువెట్టుకొని నిన్ను నే మనేము నేము

చ. 1: చెంగట నీవు సేసిన చేఁతలు లే వనఁగాను
అంగమెల్లఁ జెమరించె నందుకుఁగానె
సింగారపు నీ మేని చిందువందు లెల్లఁ జూచి
యింగితానఁ బులకించె నిందుకుఁగానె

చ. 2: నెట్టునఁ గొత్తలుగొన్ని నేరుచుక వుండఁగానె
అట్టె వుసురంటి నే నందుకుఁగానె
వొట్టువెట్టుక నిన్ను వొడివట్టి తియ్యఁగాను
యెట్టకేల కియ్యకొంటి నిందుకుఁగానె

చ. 3: గక్కనఁ గాఁగిట నన్నుఁ గాఁగిలించి కూడఁగానె
అక్కరతో నియ్యకొంటి నందుకుఁగానె
మక్కువ శ్రీవెంకటేశ మంచితనాలు సేయఁగ
యిక్కువలంటి మొక్కితి నిందుకుఁగానె

రేకు: 0289-6 దేసాళం సం: 09-234

పల్లవి: నిన్నటి మొన్నటికాఁక నేఁ డేఁటికే
యెన్నికెతో రమణుఁడ యియ్యకో లైతివి

చ. 1: మక్కువ నాపైఁజల్లి మన్ననలు నించితివి
యెక్కడి సుద్దులు నీకు నేమి చెప్పేము
చెక్కులూనుఁ బులకించె చేతు లిట్టె చెమరించె
వెక్కసాననె నిన్ను వెంగెమాడ నేఁటికే

చ. 2: మెచ్చి నన్నుఁ బొగడుచు మీఁదఁ జేయి వేసితివి
మచ్చరాలుఁ గపటాలు మానితి మిఁక
పచ్చడము గప్పఁగాను భావ మెల్లఁ గరఁగితి
కొచ్చి కొచ్చి యిఁక నిన్నుఁ గొర నేమిటికే

చ. 3: కన్నుఁ గొనలనె నవ్వి కాఁగిట నన్నుఁ గూడితి
వెన్నెని సంతోసాలు యిఁక నెంచేము
వున్నతి శ్రీవెంకటేశ వొద్దికైతి మిద్దరము
పన్నుకొని వాసిరేఁచే పంతము లేమిటికే

రేకు: 0290-1 మెంచభౌళి సం: 09-235

పల్లవి: ఔదువుజాణవు నీవు అన్నీ నెరుంగుదుము
నీ దొరతనము లెల్ల నెలఁతపయినా

చ. 1: చెనకి ఆపె నీకుఁ జేసిన మేలుకును
ననిచి నీ కన్నులను నాటఁ జూచేదా
చనవిచ్చి కమ్మటిని చన్నుల నొత్తినందుకు
పనిలేని బీరాలతో పంతమాడేదా

చ. 2: లలన నిన్నుఁ దిట్టి లాలించిన లాలనకు
చలపట్టి బొమ్మలను జంకించేదా
నెలవుగ నీ మేను నిమిరినందుకు నీవు
కొలఁదిలేని తిట్లఁ గోపగించేదా

చ. 3: కందువ నీ దేవి నిన్నుఁ గాఁగిట నించినందుకు
చందముసేసుక నీవు సారె నవ్వేదా
యిందునె శ్రీవెంకటేశ యిద్దరూ నొక్కటైతిరి
యిందరిలోపల నీవు యెమ్మెలాడేదా

రేకు: 0290-2 భైరవి సం: 09-236

పల్లవి: వాకిట నే లున్నాఁడవు వనితమాటలె యివి
లోకులు మెత్తురు నిన్ను లోనికిరావయ్యా

చ. 1: అంగనపాదంబుల అందెలు మెట్టెలునె
సంగతి నిన్నుఁ బిలిచీఁ జాలదా యిది
యెంగిలినోటఁ బిలిచే దెగ్గనివుంటే నీవు
అంగవించి లోనికిరా వదియేమయ్యా

చ. 2: కంకణసూడిగములె కడు నీతో మాఁటలాడీ
యింక ననుమానము నీ కేఁటికి నేఁడు
పొంకపు మొనదంతాలు పూఁచి ప్రియముచెప్పదు
అంకెలఁ బానుపు మీఁద నట్టె కూచుండవయ్యా

చ. 3: మొలనూలిగంటలనె ముచ్చట నీతో నాడీ
యెలమి శ్రీవెంకటేశ యియ్యకోరాదా
మెలఁగి పెదవితేనె మీఁదు నీ కెత్తుకున్నది
కలసితి నాపె నిట్టె కంటివిగదయ్యా

రేకు: 0290-3 ముఖారి సం: 09-237

పల్లవి: కదిసితి రిద్దరూను కడమ లేలా
పొదిగి చెలులుచెప్పే బుద్ధులెల్లా వినవే

చ. 1: వద్దేలెకోపము వలవని తాపము
సుద్దులు విన్నందుకె సూడువట్టేవా
చద్దులాయను వొట్లు చలము సాధించనేల
గద్దించినందు కతనిఁ గాఁగిలించుకొనవే

చ. 2: యేమిటికే బిగువు యింకానా తగవు
మోము చూచి నవ్వితేనె మోపుగట్టేవా
నాములెక్కెఁ బంతములు నాలిసేయ నిఁకనేల
కై మీరినందు కతనిఁ గాఁగిలించుకొనవే

చ. 3: అలయకువే నీవు అప్పటి సొలయకువే
తలఁపులో రతులు పాఁతరఁ బెట్టేవా
యెలమి శ్రీవెంకటేశుఁ డింపు సేసి నిన్నుఁ గూడె
కలఁక లన్నియుఁ బాసె కాఁగిలించుకొనవే

రేకు: 0290-4 రామక్రియ సం: 09-238

పల్లవి: ఎంతటి వేగిరకాఁడు యేమే తాను
చెంతల నిలుచుంటే నే చెరఁగువట్టీనా

చ. 1: కోపగించ వద్దు గాక కొసరవద్దంటినా
తీపులువెట్టుక యాలో తిట్టీఁగాకా
యీపనికి నే నవ్వి యిందరివలెనె కొంత
చూపులు పై మోపితేనె సుంకము గొనీనా

చ. 2: బీర మాడవద్దు గాక పెనఁగవద్దంటినా
కేరడాన నేఁటికో జంకించీఁ గాక
గోరగీరీని చెమటకుమ్మరించఁ జోటులేక
జోరునఁ బైఁ జిమ్మితేనె సూళ్లువట్టీనా

చ. 3: కాఁక రేఁచవద్దు గాక కలయవద్దంటినా
వేఁకపుఁదావులు యాలో వేసీఁ గాక
యేఁకటతో శ్రీవెకంటేశుఁడె తా నన్నుఁ గూడె
సోఁకె చన్ను మొనలకు జోడుదొడిగీనా

రేకు: 0290-5 సామంతం సం: 09-239

పల్లవి: నీ వెఱఁగవా నిండుఁ దగవు లివి
కావరంపుఁ బని కాంతకుఁ దగునా

చ. 1: నిగ్గుల పతి వట నెలఁతను నే నట
సిగ్గువడక నినుఁ జెనకుదునా
యెగ్గులు వట్టితి వెదురురాననుచు
బగ్గన నాఁటది బలిమిసేయునా

చ. 2: చదురుల దొర వట జవ్వని నే నట
అదనెఱఁగక నిను నలముదునా
కదిమి కొసరితివి గర్విణైతి నని
గుదిగొని కామిని గొరబుసేతునా

చ. 3: శ్రీవెంకటేశ్వర శ్రీసతి నేనట
సోవగా నవ్వక సొలయుదునా
యీవలఁ గూడితి వియ్యకొంటి నని
కైవసమగు సతి కాదనునా

రేకు: 0290-6 శంకరాభరణం సం: 09-240
పల్లవి: దొడ్డవాఁడ వవుదువు దొరవూను నవుదువు
జిడ్డులేక వుండేది నీ చిత్త మింతేకాని
చ. 1: తప్పక చూడఁగవచ్చు తలవంచుకొనవచ్చు
అప్పుడు గాతి కోరి చే దరుదుగాని
తిప్పుచుండవచ్చు మోము తేరకొన నవ్వవచ్చు
యిప్పటివలె నడపే దెక్కు డింతేకాని
చ. 2: వొగ్గి చేయి చాఁచవచ్చు నుద్దండాలు సేయవచ్చు
కగ్గులేక వలచేది ఘనముగాని
నిగ్గుబాస గొనవచ్చు నెలఁతలఁ బొందవచ్చు
యెగ్గులేక మెలఁగేదె యెన్నికింతేకాని
చ. 3: మాటలు బోదించవచ్చు మట్టుమీరి దాఁటవచ్చు
పాటించి రతి కెక్కేది భాగ్యముగాని
నీటున శ్రీవెంకటేశ నేఁడు నన్ను నేలితివి
వాటమై యిట్టె వుండేదె వన్నెమించుఁగాని

రేకు: 0291-1 శంకరాభరణం సం: 09-241

పల్లవి: బాపు బాపు మేలు మేలు పంతగత్తె వొౕదువే
నీ పంతములెల్లదక్కె నేర మేమిగంటివే

చ. 1: చలము మానినఁ గాక సమ్మతింపించవచ్చునా
పెలుచుఁదనపు నీతోఁ బెనఁగెఁగాక
నిలుచున్నాఁ డాతఁ డదె నే నిన్ను వేఁడుకొనేను
పలుకవు నీవైతే ఫల మేమిగంటివే

చ. 2: మాటలాడేనంటేఁ గాక మంకు దెలుపవచ్చునా
సాటికి బేటికి నిన్ను సాదించెఁగాక
గీటీ గోర నతఁడు కేలుచాఁచి తీసే నేను
నీటువెట్టుకుందానవు నీ వేమిగంటివే

చ. 3: నయముగలితేఁ గాక నాయము చెప్పవచ్చునా
దయవుట్టి నేనె నిన్నుఁ దగిలెఁగాక
క్రియఁగూడె శ్రీవెంకటగిరిపతి నే మెచ్చితి
ప్రియపడే విదె నీవు భేద మేమిగంటివే

రేకు: 0291-2 గౌళ సం: 09-242

పల్లవి: ఆతఁడు నీవు నొక్కటె అందరు నెఱుఁగుదురు
మాతోనె యింతేసి మతకమేలె నీవు

చ. 1: తప్పక వొట్లువెట్టి దగ్గరి రమ్మనే వేమె
చెప్పరాదా నీ మాట సేసేఁ గాని
నెప్పున నాతఁడున్నాఁడు నే నెరఁగనా నీ వొద్ద
చెప్పక నాతో మాయలు సేయనేలె నీవు

చ. 2: వట్టి యాకతాలు చెప్పి వద్దికి దగ్గరే విదె
అట్టె వుండరాదా అన్నినయ్యీఁ గాని
తట్టి ఆతని ముదుల తచ్చునగాఁబోలు నిది
నట్టనడుమనె యేఁటి నాటకమె నీవు

చ. 3: యిచ్చకము సేసి నన్ను యెలయించే విన్నిటాను
పచ్చిదేరెఁ బనులెల్ల పదవె యింక
చెచ్చెర నన్ను నలమి శ్రీవెంకటేశ్వఁడు గూడె
వచ్చె నీ పంతములు నవ్వఁగదె నీవు

రేకు: 0291-3 శ్రీరాగం సం: 09-243

పల్లవి: మాటలు యింకానా మానరు మీరు
నాటికి నేటికి మేలు నయమాయనే

చ. 1: తెల్లనాయఁ గన్నులు తేనెగారెఁ గెమ్మోవి
వల్లెవాటుతోనున్నాఁడు వాఁడె చూడరే
పొల్లవద్దనుంటిరి పూనుక వచ్చితిరి
కల్లలు నిజము నందె కానవచ్చెనే

చ. 2: వింతవాసనలు నించె వెల్లులాయఁ జెమటలు
పంతముతోనున్నవాఁ డప్పటిఁ జూడరే
యింతులెల్లఁ గూడితిరి యియ్యకోలు సేసితిరి
యింతలోనె పాడిఁబంతా లెన్నికాయనే

చ. 3: చెక్కులెల్లఁ బులకించె చెలికిఁ జెయిలోనాయ
వెక్కసాన దగ్గరీని వీఁడె చూడరే
యిక్కడ శ్రీవెంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
యెక్కువ తక్కువ లెల్లా నెంచనేఁటికే

రేకు: 0291-4 కొండమలహరి సం: 09-244

పల్లవి: అన్నిటా నేఁ దనిసితి అందరును మెచ్చిరి
మన్ననలు తుదకెక్కె మాట లింకేలయ్యా

చ. 1: యెప్పుడు వత్తువో యని యెదురు చూచినందుకు
చొప్పుతో నీ వున్నందుకు జోకలాయను
రెప్పలెత్తి చూచితేనె రేసువడె నామనసు
కప్పిన వేడుకలకు కడమలేదయ్యా

చ. 2: బత్తిగలవని నేను భామలతో నన్నందుకు
తత్తరపు నీ చేఁతకు తగవాయను
మెత్తనైతి నీయడకు మేలములు నమరెను
యెత్తి నీతో నున్న సుద్దు లేలచెప్పేనయ్యా

చ. 3: పొదిగి నే నీతోను పొందులు సేసినందుకు
యిదె నీవు గూడినందు కితవాయను
యెదిగి శ్రీవెంకటేశ యిరవైతిఁ దరవైతి
కదిసి నీరతులకుఁ గడమయేదయ్యా

రేకు: 0291-5 సామంతం సం: 09-245

పల్లవి: నన్నుఁ జూచి నీవేల నవ్వే విఁక
యిన్ని సుద్దులకు నెల్లా యియ్యకొందువు గాక

చ. 1: కన్నుల మొక్కినది కందువ చూపినది
యెన్నేసి చేఁతలు చేసీ నీపిన్నది
సన్నలు చేసినది చనవు మెరసినది
పన్నుగడలాఁ దొల్లె పనిగొందువు గాకా

చ. 2: ఆయాలు మోపినది ఆసలు రేఁచినది
యేయెడఁ జూచిన నీతో నీపిన్నది
చాయకుఁ దెచ్చినది సరస మాడినది
కాయముల కళలెక్కఁ గైకొందువు గాకా

చ. 3: చేతులు చాఁచినది సేసలు వెట్టినది
యేతుల శ్రీవెంకటేశ యీ పిన్నది
నాతోఁ గూడించినది నలి నిన్నుఁ గడపలో
రాతిరిఁ బగలు నిట్టె రమింతువు గాకా

రేకు: 0291-4 శుద్ధవసంతం సం: 09-246

పల్లవి: ఇచ్చగించుకొంట గాక యింపులే కలిగితేను
అచ్చలానఁ బెనఁగితే నది జాణతనమా

చ. 1: తగులనాడినప్పుడు తమకించి నప్పుడును
జగడాలకుఁ బెనఁగ జాణతనమా
నగఁ దలఁచి నప్పుడు నాఁటఁ జూచినప్పుడును
అగడుసేయఁ బూనితే నది జాణతనమా

చ. 2: కూరిమి చల్లినప్పుడు కొంగు వట్టినప్పుడును
సారె నూరకె వుండేది జాణతనమా
మేర మీరినప్పుడును మిక్కిలి లోనైన ప్పుడు
ఆరీతి మాటలాడే దది జాణతనమా

చ. 3: కందువ లంటినప్పుడు కాఁగిలించి నప్పుడును
చందము సేసుకోకున్న జాణతనమా
యిందులోనె శ్రీవెంకటేశుఁడు ని న్నిదెకూడె
అందుకేలె వెరగందే వది జాణతనమా

రేకు: 0292-1 మంగళకౌశిక సం: 09-247

పల్లవి: ఏల రట్టు సేసే వేమీ నేఁడు
చాలుఁ జాలు మాయెడను సటసేయవలదు

చ. 1: పెదవుల మమ్మింతేసి పేరఁ బిలువకు మని
మొదల నిందుకుఁగానె మొక్కనా నీకు
అదనఁ గోపమున నీ యంకెకు రాకుండుదుము
యెదుట నప్పుడు నీవు యెగ్గు లెంచవలదు

చ. 2: కన్నుల నవ్వకు మని కాఁకలు సేయకు మని
నున్నని చెక్కులు చేతనొక్కనా నేను
పన్నిన పంతములను పరాకున నుండుదుము
వన్నెల నీ వంతేసి వాసు లెంచవలదు

చ. 3: పచ్చిసేసి నీవు మమ్ము బలిమిఁ బట్టకు మని
చెచ్చెర నీకుఁ బ్రియము చెప్పనా తొల్లె
యిచ్చల శ్రీవెంకటేశ యిటు నిన్నుఁ గూడితిమి
తచ్చనలుగావు యిఁకఁ దమకించవలదు

రేకు: 0292-2 పాడి సం: 09-248

పల్లవి: ఎఱిఁగి వుందువుగాని యిందరివలెఁ జూడక
మఱవరానియట్టి మానాపతి సుమ్మీ

చ. 1: చెలిచేత మాటాడించి సిగ్గువడి నీతోను
తలుపుమాఁటుననుండె తరుణి యదె
బలిమి నీ వంతలోనె పైకొనఁగా లోనాయ
యిలువెళ్ల రానియట్టి యిల్లాలుసుమ్మీ

చ. 2: వొడికాన విడెమిచ్చి వున్నతిఁ జేతులుచాఁచి
కడపలోననె వుండి కాంత యదె
చిడుముడి నీ వంతలో చేపట్టఁగా లోనాయ
కడుముద్దరాలైన ఘనురాలు సుమ్మీ

చ. 3: చేవదేర నిన్ను నదె చిలుకచేఁ బిలిపించి
వోవరిలోఁ బానుపుపై నుండి మగువ
నీ వంతలో లోనికేఁగి నెమ్మిఁ గూడఁగా లోనాయ
శ్రీవెంకటేశుఁడ యీపె చిన్నికన్నెసుమ్మీ

రేకు: 0292-3 గౌళ సం: 09-249

పల్లవి: పచ్చిదేరెఁ బనులు పమ్ముఁ జూపు మొనలు
హెచ్చె నిదె నామాట లియ్యకొనరాదా

చ. 1: చెక్కుల నీ మెరుఁగు చిత్తజుని కరఁగు
యెక్కువ సిగ్గులఁ దల యేలవంచేవే
తక్కులేలె యింకను తగులాయ బొంకను
చక్కని నీ కెమ్మోవి చవిచూపరాదా

చ. 2: మొలక నీ నగవు మోహముల తగవు
చెలఁగి నీ వది యేల చేతఁ గప్పేవే
పిలువవే యింటికి ప్రియమాయఁ గంటికి
తలఁచుక నీమాటకు దయఁజూడరాదా

చ. 3: జంటల నీ చన్నులు జవ్వనపు టెన్నులు
అంటఁగాఁ బయ్యద నేల అట్టె మూసేవే
వెంటనే కూడితివి శ్రీవెంకటేశుఁడను నేను
పెంటలుగ నిట్లానె పెనఁగఁగరాదా

రేకు: 0292-4 శ్రీరాగం సం: 09-250

పల్లవి: విన్నవించ నేఁటికి విచారము లేఁటికి
నిన్నటనుండియు నాస నీకంటె గనము

చ. 1: సిగ్గువడ్డ చెలిగాన చెనక కున్నదిగాని
అగ్గలము నీమీఁద నడియాస
దగ్గరె మొగమోటానఁ దలవంచుకుందిగాని
తగ్గని మోహము నీ చిత్తముకంటె గనము

చ. 2: కొొత్తగాఁ బెండ్లాడెఁగాన గుట్టున నున్నదిగాని
తత్తరించీ లోలోని తమకమైతె
హత్తి నీవు నవ్వేవని అంపకవున్నదిగాని
చిత్తిణి కోరికల నీ జిగికంటె గనము

చ. 3: రతికిదగ్గరెఁగాన రవ్వసేయకుందిఁ గాని
చతురతలను నిన్ను జట్టిగొనును
యిత వెరిఁగి శ్రీవెంకటేశ యిట్టె కూడితివి
మితిమీరె యందుల నీమేలుకంటె గనము

రేకు: 0292-5 ముఖారి సం: 09-251

పల్లవి: కోపగించుకోఁగ నన్ను కొంగు వట్టే వింతెకాక
నాపొందు వలసితేను నవ్వక నేనుందునా

చ. 1: పంతములే యాడేవు బలిమిఁ జెయివట్టేవు
చెంతల నీచెప్పినట్టు సేయనాతొల్లి
యింత వేగిరకాఁడవు యెందువోతివి నిన్న నేఁ
జింతించేయప్పుడు రాఁగఁ జేకొననైతినా

చ. 2: సరసానకు వచ్చేవు సాదించఁ జూచేవు
గరిమ నీ వేమనినఁ గాదనేనా
నిరతి నే బాఁత్తైతే నీటుతో నేలవుంటివి
తరితీపై చెనకితే తనుపకమానేనా

చ. 3: యిచ్చకము లాడేవు యిట్టె కాఁగిలించేవు
గచ్చుల నలమేల్మంగఁగానా నేను
అచ్చపు శ్రీవెంకటేశ ఆయ మెరిఁగికూడితి
వెచ్చరికెతో నుండఁగ యిట్టె మెచ్చనైతినా

రేకు: 0292-6 కాంబోది సం: 09-252

పల్లవి: కైవసపుదానఁగాని కపటిఁగాను
చేవదేర వలచితిఁ జిత్తగించవయ్యా

చ. 1: కాయపు కాఁకలచేతఁ గసరుదు నొకవేళ
పాయపు మదము చేతఁ బదరుదును
చాయల సన్నల నిన్ను సాదింతు నొకవేళ
చేయెత్తి మొక్కే నిందుకే చిత్తగించవయ్యా

చ. 2: యిచ్చిన చనవునను యీసడింతు నొకవేళ
గచ్చుల నీవద్ద నుండి గర్వింతును
ముచ్చటలాడుచు గోరుమోపుదు నే నొకవేళ
చెచ్చెరఁ బంతమిచ్చేను చిత్తగించవయ్యా

చ. 3: పాదములొత్తుచు నిన్ను భ్రమయింతు నొకవేళ
సోదించి శ్రీవెంకటేశ సొలయుదును
ఆదిగొని కూడితి నిన్నలమేల్మంగ నవుదును
సేదదేర మన్నించి చిత్తగించవయ్యా

రేకు: 0293-1 శంకరాభరణం సం: 09-253

పల్లవి: ఏల వేగిరించేవు యిట్టె నిన్నుఁ బంగించి
మేలిమి చేఁతలుచూపి మెప్పించెఁ జుమ్మీ

చ. 1: నయగారి మాటలాడి నవ్వులు మాతో నవ్వేది
నియతము నీకుఁ దొల్లె నేఁడు గొత్తలా
ప్రియము నిన్నుఁ జేయించి బిగుసుకుండేవారు
కయివసముగ నీపైఁ గలిగేరు సుమ్మీ

చ. 2: చాయల వలపుచల్లి సరస మాడేది నాతో
నీయందు గలిగినవే నేఁడు గొత్తలా
మాయలు నీతో నడపి మరులు గొలిపేవారు
కాయపుఁజుట్టాలే నీకుఁ గలిగేరు సుమ్మీ

చ. 3: అడరి శ్రీవెంకటేశ అన్నిటా గెలుతువు యీ
నిడుదమొక్కులు దొల్లె నేఁడు గొత్తలా
యెడయక నన్నుఁ గూడి తిది చూచి సిగ్గువడి
కడకుఁ దొలఁగేవారు గలిగేరు సుమ్మీ

రేకు: 0293-2 ముఖారి సం: 09-254

పల్లవి: నలుగడ నిందరు నవ్వేరు
పెలుచై తానేల బెదరీనే

చ. 1: నెయ్యపు మాటలు నీతోఁ జెప్పఁగ
వొయ్యనె తానేల వొరసీనే
అయ్యెడ నిజమరి అట్టెవుండక
కయ్యానఁ దానేల కలఁగీనే

చ. 2: తగవుకు నే నినుఁ దప్పక చూచిన
అగడుగఁ దానేల అడిగీనే
మొగమోటకాఁడు మోనాన నుండక
బెగడి ఆనేఁటికిఁ బెట్టీనే

చ. 3: లోఁగుచు నే నిను లోనికిఁ బిలువఁగ
కాఁగిట తానేల కదిమీనే
వీఁగక కూడె శ్రీవెంకటేశ్వరుఁడు
పాఁగి తానేఁటికి భ్రమసీనే

రేకు: 0293-3 మంగళకౌశిక సం: 09-255

పల్లవి: ఇందాఁకా మాపని యిఁక నీపని
కందువాయ వలపులు కపట మే మున్నది

చ. 1: చేతులనె మొక్కు మొక్కి సెలవుల నవ్వు నవ్వి
ఆతలనె నిలుచున్న దదివో చెలి
కాతరాన యిఁకమీఁదఁ గలిగిన పనులు నీ
చేతి వింతె యిఁక నీతో చెప్పనేమివున్నది

చ. 2: కన్నులనె నిన్నుఁ జూచి కానుక నీ కంది యిచ్చి
అన్నిటా గుట్టున నున్న దదివో చెలి
సన్నలూను మీలోని సరసాలు నిటమీఁద
పన్నుకో నీవె నేర్తువు పలుక నే మున్నది

చ. 3: మచ్చిక నీకుఁ జేసి మనసు నీపైఁ బెట్టి
యిచ్చటఁ గాఁగిలించె నిదివో చెలి
అచ్చపు శ్రీవెంకటేశ అట్టె నీవు గూడితివి
యిచ్చకములు లిటమీఁద నిన్ని నెఱుఁగుదువు

రేకు: 0293-4 రామక్రియ సం: 09-256

పల్లవి: మించిన నాపంతములు మీ రెరఁగరా
నించిన కూరిములతో నెరవేరెఁ బనులు

చ. 1: మనసిచ్చి తా నాతోను మాటలాడితేఁ జాలు
యెనయక వలవక యెందువోయీనే
పెనఁగక మీ రాతనిఁ బిలుచుకరారే యిందు
తనుఁదానె అన్ని నయ్యీఁ దరవాతిపనులు

చ. 2: దంటతనమున కటు తగులఁ జూచితేఁ జాలు
యింటికిరాక డాయక యెందువోయీనే
గొంటుపరచక వద్దఁ గూచుండఁ బెట్టితేఁ జాలు
నంటుతోన మంచి వయ్యీ నడుమనే పనులు

చ. 3: వట్టి శ్రీవెంకటేశుఁడు బలువుఁడు నన్నుఁ గూడె
యిట్టెవుండక యిఁక నెందువొయ్యీనే
గట్టిసేసితిరి మీరు గలిగివుండితేఁ జాలు
నెట్టన రతికెనెక్కె నేరుపైన పనులు

రేకు: 0293-5 సామంతం సం: 09-257

పల్లవి: కోడెకాఁడు వీఁడె వీఁడె గోవిందుఁడు
కూడె నిద్దరుసతుల గోవిందుఁడు

చ. 1: గొల్లెతల వలపించె గోవిందుఁడు
కొల్లలాడె వెన్నలు గోవిందుఁడు
గుల్ల సంకుఁజక్రముల గోవిందుఁడు
గొల్లవారింటఁ బెరిగె గోవిందుఁడు

చ. 2: కోలచేఁ బసులగాచె గోవిందుఁడు
కూలఁగుమ్మెఁ గంసుని గోవిందుఁడు
గోలయై వేలఁ గొండెత్తె గోవిందుఁడు
గూళెపుసతులఁ దెచ్చె గోవిందుఁడు

చ. 3: కుందనపు చేలతోడి గోవిందుఁడు
గొందులు సందులు దూరె గోవిందుఁడు
కుందని శ్రీవెంకటాద్రి గోవిందుఁడు
గొందిఁ దోసె నసురల గోవిందుఁడు

రేకు: 0293-6 శంకరాభరణం సం: 09-258

పల్లవి: వద్దేలె బలిమి వసముగాఁ డిఁక
బుద్దెరిఁగి తానె పొదిగీఁ గాకా

చ. 1: వలవనివారిని వలపించఁబోతే
వెలికి లోనికె వేసటలే
ములిగేటివారి మోపుమోపుమంటే
కొలఁదిమీరిన కోపమురాదా

చ. 2: మాటాడనివారి మాటాడించఁబోతే
తాటించి యెగ్గులుఁ దప్పులునే
పోటిదొరలతోఁ బొందులు సేసితే
సాటికిఁ బేటికి జంపులెకావా

చ. 3: వూరకున్నవారి నొడివట్టితేను
బీరాలతో వట్టిపెనఁగులే
యీరీతి శ్రీవెంకటేశుఁడు గూడెను
నేరుపులకెల్ల నేగురిగాదా

రేకు: 0294-1 కన్నడగౌళ సం: 09-259

పల్లవి: ప్రియములెల్లా నీవి బిగువు నాది
దయలేనిదాన యేలో తగిలేవొ కాని

చ. 1: చెక్కులు నీవు నొక్కఁగ సిగ్గువడ్డదాన నేను
యెక్కడికెక్కిన మాట లేమాడేవు
మొక్కులు నీవు మొక్కఁగ మోనాననుందాననేను
చొక్కుల నీ కేనాటి చుట్టమునొ నేను

చ. 2: సరసము నీవాడఁగ జంకించినదాన నేను
యెరవులపొందు నాతో నే సేసేవు
సిర నీవు ముట్టఁగ చెనకకుందాన నేను
సరిగా నీ కెటువలెఁ జవులైతి నేను

చ. 3: నీవు గాఁగిలించుకోఁగ నివ్వెరగందితి నేను
చేవదేరెఁ బను లెంత సేసేవు నీవు
శ్రీవెంకటేశ్వర నన్నుఁ జేకొని కూడితి విట్టె
సేవగా నిచ్చక మెంతసేసితినొ నేను

రేకు: 0294-2 భైరవి సం: 09-260

పల్లవి: మామాటవినవెకొంత మన్నించి నీవు
నీమనసు కోరికల నేరుపులలోనా

చ. 1: మొక్కకువె నిన్నతఁడు మొగము చూచినదాఁక
గుక్కుచు నింతుల పెద్దకొలువులోన
పెక్కుమాట లాడకువె పేరఁ బిలిచినదాఁక
అక్కరైన సరసపుటాసలలోన

చ. 2: కేరి నవ్వకువె తానె కేలు పయిచాఁచినదాఁక
సారమైన వలపుల సందడిలోన
ఆరసి చూడకువె నిన్నాయము లంటినదాఁక
బీరపు తమకముల పెనఁగులలోన

చ. 3: కొసరకువె యాతఁడు గొబ్బునఁ గూడినదాఁక
ముసగసల యాకతముల మీలోన
యెసగి శ్రీవెంకటేశుఁడ డిదివో నిన్నుఁ గలసె
ఆసురుసురుగాకు నెయ్యములలోన

రేకు: 0294-3 బౌళి సం: 09-261

పల్లవి: తొల్లిటివంటిదానవా తొయ్యలినీవు నీ
వెల్లవారికంటె జాణ వెన్నికాయఁ జేఁతలు

చ. 1: దగ్గరఁ బిలిచి నిన్ను తన్నుఁదానె మాటదీసి
సిగ్గు విడిపించెఁగదె చెలువుఁడు
వెగ్గళించి ఆతనిమై వేసితివి చేయి నీ
అగ్గలిక లెల్లఁ జెల్లె నాయఁగదె పనులు

చ. 2: సరసపు మాటలాడి సన్నల నవ్వులు నవ్వి
వెరవు చూపీఁ గదె విభుఁడు నీకు
దొరతనము నెరపి తొక్కితివి పాదము నీ
యిరవు చేకొంటివి యిఁక నేలె సుద్దులు

చ. 3: అందాన నిన్నుఁ బొగడె నలమేలుమంగ వని
విందుగా నిన్నుఁ గూడె శ్రీవెంకటేశుఁడు
మందెమేళమున నీవు మర్మము లంటితి విట్టె
యిందరిలోపలఁ దుదకెక్కెఁ గదె కతలు

రేకు: 0294-4 శంకరాభరణం సం: 09-262

పల్లవి: నేనేల తనునాడె నేఁడుగొత్తలా నాకు
తేనెగారే తనమోవి దిష్టమున్న దనవే

చ. 1: తెల్లని తనకన్నులు దిమ్మరి జాగరముల
నెల్లవారుఁ జూడఁజూడ నెఱ్ఱనాయను
యెల్లిదము లాడేనంటా నెవ్వరిఁ గోపగించీనె
చల్లని తనచేఁతే విచారించుకొమ్మనవే

చ. 2: పాలుగారే తనమోము భామలతో సాములను
వాలాయముగా నిదివో వసివాడెను
గేలితో నేఁజూచేనంటా కేరడ మే లాడీనె
తేలింపుఁ దనగుణమే తెలుసుకొమ్మనవే

చ. 3: జిగిగొన్న తనమేను చెప్పరాని చేఁతలను
వెగటుఁ జెమట లుబ్బి వింతలాయను
నగి శ్రీవెంకటేశుఁడు నన్నుఁ గూడె నింతలోనె
మగటిమి నింక నిట్టె మన్నించుమనవే

రేకు: 0294-5 మధ్యమావతి సం: 09-263

పల్లవి: అన్నిటా జాణవుగావా అంతేసి నీవెఱఁగవా
యెన్నికగా మన్నించక యేలమానేవూ

చ. 1: వచ్చుదాఁకా వేగిరమై వడిఁ బిలువనంపుదు
యిచ్చల నీ విందురాక యేలమావు
పచ్చియైన నామనసు పట్టలే నింతెకాక
యిచ్చిన నీబాసలు నీ వేలతప్పేవు

చ. 2: నవ్వుదాఁకా వేగిరమై నలిఁ బదరుదుఁగాక
యివ్వల నన్నుఁ జెనక కేలమానేవు
రవ్వసేతు నింతెకాక రతి నాసవతులలో
నెవ్వరి మెచ్చక పొంద కేలవిడిచేవు

చ. 3: వెసఁ గాఁగిలించుదాఁకా వేగిరించి కొసరుదు
యెసగి నన్నుఁ గలయ కేలమానేవు
కొసరి శ్రీవెంకటేశ కూడితివి నన్ను నీవె
యిసుకమీఁదైన చేఁత లేలమరచేవు

రేకు: 0294-6 కాంబోది సం: 09-264

పల్లవి: ఎఱఁగవుగాక నీవు యిందరివలెనా నేను
గుఱుతైన చేఁతచెప్పఁ గూళలున్నారా

చ. 1: పచ్చిగా నిన్నుఁ గూడించి పంత మాడేదాననా
తచ్చి గుట్టు సేసి దాఁచేదాననఁగాక
యిచ్చల సిగ్గువడి నాకేల వెరచేవు నీవు
ముచ్చట బాయిటవేసే మూఢులున్నారా

చ. 2: మాటలు వెలుచుక ఆ మర్మా లెత్తేదాననా
తాటించి కప్పుకవచ్చేదాననఁగాకా
గాఁటాన నన్నుఁజూ చేల కడుఁ దలవంచేవు
కూటమి బట్టుసేయను గొల్లదాననా

చ. 3: వెలి నిన్ను మరిగించి వెంటఁ దిప్పేదాననా
తలఁగక యెనసుండేదాననఁగాకా
యెలమి శ్రీవెంకటేశ యిట్టె పొందేల లోఁగేవు
యెలయించి నిన్ను నవ్వేయెడ్డలున్నారా

రేకు: 0295-1 దేసాక్షి సం: 09-265

పల్లవి: ఏమినవ్వేవు మాతోను యెందాఁకా నీపంతము
మోముచూచి ఆపెచేత మొక్కించుకోవయ్యా

చ. 1: చన్నులతోనె మొలచె సతికి నీపై వలపు
కన్నుల చూపుల నంటెఁ గడు నీరూపు
వున్నది నీరాకగోరి వోవరిలోపల నిట్టె
విన్నప మిదె యింటికి విచ్చేయవయ్యా

చ. 2: కురులయన్నె కలవు కొమ్మకు నీపై చింతలు
తొరలెఁ జుట్టరికము దొమ్మిమేలాల
పరపుపై నదె నీపై పాటలువింటాఁ జొక్కి
యిరవిదె మన్ననకు యెఱుఁగుకోవయ్యా

చ. 3: మాటలవెంటాఁ దగిలె మనసు యీకాంతకు
కూటము లన్నియునాయ కొనయాసల
యీటుతో శ్రీవెంకటేశ యెనసె నీవు రాఁగాను
తేటతెల్ల మాయ మేలు తెలుకోవయ్యా

రేకు: 0295-2 వరాళి సం: 09-266

పల్లవి: చూచితి నప్పుడే వాని సోరణగండ్ల నేను
యేచివేరె సింగారించి యిటుదోడితేరే

చ. 1: గందవొడి చల్లరెకడుఁ జెమరించె మేను
ముందు ముందు విడెమీరె మోవివాడెను
చెంది నే నవిచూచితే సిగ్గువడీ నాతఁడు
మందలించి యలపార్చి మరితోడితేరే

చ. 2: నిండఁ బన్నీరు చల్లరె నిట్టూర్పు నించీని
దండనె విసరరె దప్పిఁ బొందీని
వొండుపచారాలు నే నొకటిసేసినా లోఁగీ
యెండలెల్లఁ బాపి తగ నిటుదోడితేరే

చ. 3: విరులు పైఁ జల్లరె వెట్టఁ బొరలున్నవాఁడు
తొరలఁ గప్పురమీరె తొట్టీఁ దగ
యిరవై శ్రీవెంకటేశుఁ డిట్టె నన్ను ముందుగూడె
సరినాపెఁ గూడివచ్చె చాలుఁ దోడితేరే

రేకు: 0295-3 శుద్ధవసంతం సం: 09-267

పల్లవి: వట్టి పెద్దరికా లీడ వడినేల చెప్పేవు
తిట్టినవెనక నాపె దీవించఁబోలు

చ. 1: వొకతె పైఁ బెట్టి మాట లొకలొకటెయాడి
యెకసక్కేలకుఁ గల్ల లేలయాడేవు
ప్రకటించి రమ్మనుచు పాదాలువట్టునా ఆపె
తకపికలుగను ముందల పట్టఁబోలు

చ. 2: వలచివచ్చె ననుచు వట్టి సాకిరులు వెట్టి
చలివాసి నీవేల బాసలు సేసేవు
పిలిచి నీయింటి కాపె ప్రియము చెప్పవచ్చెనా
వలవంత నిల్లురికి వాదుకురాఁబోలు

చ. 3: యీవేళ విడెము లంచమిచ్చి యాకెగూడె నని
శ్రీవెంకటేశ్వర నీవె సిగ్గువడేవు
కామించి నన్నుఁగూడితి కప్పమువెట్టునా ఆప
మోవని నోరినిండాఁ దమ్ములమిడఁబోలు

రేకు: 0295-4 ఆహిరి సం: 09-268

పల్లవి: నీతోడివారమా నిను దూరేమా నీ
చేతిలోనివారము నీచిత్తము నాభాగ్యము

చ. 1: బీరమాడి బెళకేవు పెనఁగి తలవంచేవు
ఔరా నీపొందు లెందుకై నావచ్చును
మారుమలనే వప్పటి మరి రండూ నడుపేవు
నేరుతు వన్నిపనులు నేనెఱఁగఁగాని

చ. 2: అడిగి పెచ్చువెరిగే వానించి పంత మాడేవు
యెడరు నీసుద్దు లేమ నెంచవచ్చును
బడి బడి నిలిచేవు పట్టేవు కోకకొంగులు
గడుస వన్నిటా నీవు కడుముద్దరాలను

చ. 3: బోదించి చిగిరించేవు పూఁచి కడలుదొక్కేవు
ఆదిగొని నిన్నెట్టు గాదనవచ్చును
యీదెస శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
పాదగు జాణవు నే నీ పలుకులోదానను

రేకు: 0295-5 దేసాళం సం: 09-269

పల్లవి: ఇంటిదాన నే నుండఁగా యెరవు సతమా నీకు
పెంటవెట్టుక నావద్దఁ బ్రియాలు చల్లేవు

చ. 1: చొక్కుచు దయదలఁచి చూచేవు ఆపె నీకు
మొక్కిన మొక్కులె కడు మోపాయనా
చిక్కి నీకుఁ జేయఁగల సేవలెల్లా నేఁజేయఁగా
చెక్కులనొక్కులు మాకు సెలవు సేసేవు

చ. 2: చెచ్చెర విన్నపాలకె చెవులొగ్గే వాపె నీకు
ముచ్చటాడిన మాఁటలే ముదుపాయనా
నిచ్చ పెండ్లికూఁతురవై నేనె నీవై యుండఁగ
నచ్చుల నీమోవితమ్మె నావంతు సేసేవు

చ. 3: గునిసి మమ్మిద్దరినిఁ గూరిచితి వాపె నీపై
మొనగోరు మోపినదె మొదలాయనా
యెనసితిమి శ్రీవెంకటేశ నే నిన్ను మెచ్చితి
చనవి మనవి నాకె సతము సేసేవు

రేకు: 0295-6 నాదరామక్రియ సం: 09-270

పల్లవి: మగువలకొసరులు మగఁడె చేకొనవలె
నిగిడి బుద్ధులు నాకు నేరుపవయ్యా

చ. 1: చేముట్టి నీవు నాతోచేరి సరసమాడఁగ
యేమంటినో నిన్ను యెరఁగ నేను
కామించిన నా మోహమే కానుకవట్టితి నీకు
దీమసపు నా తప్పు దిద్దుకోవ య్యా

చ. 2: పంతమున నీవు నన్ను పచ్చిసేసి పెనఁగఁగ
యెంతసేసితినో నిన్ను యెరఁగ నేను
సంతతము నావయసు జన్నెవట్టితి నీకు
యెంతైనా నావిన్నప మీడేరించవయ్యా

చ. 3: గట్టిగా నీరతులలోఁ గలసి భోగించఁగాను
యెట్టుండెనో నీచిత్త మెరఁగ నేను
యిట్టె శ్రీవెంకటేశ యేలితివి నన్ను నీవు
మట్టులేని నాకోరిక మన్నించవయ్యా

రేకు: 0296-1 కొండమలహరి సం: 09-271

పల్లవి: ఏమిసేతు నీ సుద్దుల కేమందును
దోమటిఁ గొంగువట్టఁగ తొలఁగి పోరాదు

చ. 1: అత్తల నిత్తల నీకు ఆపె నేను నుండఁగాను
పొత్తుల నవ్వునవ్వేవు పో పో నీవు
చిత్తజమదమెకాని సిగ్గువడే దెరఁగవు
కొత్తలుగా నీతో నేము కోపగించరాదు

చ. 2: తప్పక యిద్దరము పాదాలు నీకు నొత్తఁగాను
చెప్పరాని మాటాడేవు చీ చీ నీవు
కుప్పళించెజవ్వనాన కొంకుగొన రెరఁగవు
యిప్పుడు నీతో మాకు నెదురాడరాదు

చ. 3: యిరు దెస నీతో నేము యేకతములాడఁగాను
తొరలఁ గాగలించేవు తో తో నీవు
కెరలి శ్రీవెంకటేశ కిందుమీఁదు నెరఁగవు
పరగ నీరతుల నే పచ్చిసేయరాదు

రేకు: 0296-2 సాళంగనాట సం: 09-272

పల్లవి: మెచ్చితిరా నిన్ను నేను మేఁటి వౌదువు
యిచ్చకురాల నైతిని యిఁకనేఁటి మాటలూ

చ. 1: మచ్చరముమాని నీతో మాటాడినది చాలక
కొచ్చి యంతలోనె నన్నుఁ గొంగువట్టేవు
యెచ్చి యెక్కినట్టివాని కేనుగ గుజ్జన్నమాఁట
యిచ్చట నీవల్లఁగంటి మిఁకనేఁటిమాటలు

చ. 2: చేయిచాఁచి నీమీఁద నేసవెట్టుట చాలక
కాయ మంటి బలిమిని కాఁగిలించేవు
చాయసందైతె చావడి చంకఁబెట్టుకొన్నమాట
యీయెడ నీయందె వున్న దిఁకనేఁటిమాటలు

చ. 3: కాఁకదీర నిన్ను నేను కదియుట చాలక
సోఁకనాఁడి నన్నుఁ గూడి చొక్కఁ జేసేవు
ఆఁక శ్రీవెంకటేశ పా లంటె గుటుకన్నమాట
యేఁకట నీజాడలాయ నిఁకనేఁటి మాటలు

రేకు: 0296-3 పాడి సం: 09-273

పల్లవి: ఎందుకైనా వత్తువు నిన్నేమిసేతురా
యిందరిలోపల నిన్ను నేమిసేతురా

చ. 1: చెక్కులూ నొక్కితి నీకు చేతులెత్తి మొక్కితిని
యెక్కడా నీవోజ మాన వేమిసేతురా
తక్కరివాఁడవుతొల్లె దగ్గరి నేనంటితేను
యిక్కువలూఁ గరఁగేవు యేమి సేతురా

చ. 2: కొచ్చి వెంగేలు నాడితి కొంగువట్టి తీసితిని
హెచ్చిన పరాకుమాన వేమి సేతురా
మెచ్చనివాఁడవు మున్నె మీరి నేఁ జెనకితేను
యిచ్చకములాడవచ్చే వేమిసేతురా

చ. 3: కన్నులాను జంకించితి కాఁగిటాఁ గూడితి నిన్ను
యెన్నేసి బాసలు సేసే వేమిసేతురా
మన్నించి కూడితి నాఁడె మక్కువ శ్రీవెంకటేశ
యిన్నిటా రతులఁజొక్కే వేమిసేతురా

రేకు: 0296-4 సౌరాష్ట్రం సం: 09-274

పల్లవి: ఇంటిలోనున్నదానను యెప్పుడూఁ దనసొమ్మె
వెంటవచ్చినవారితో వేగఁ గూడుమనవే

చ. 1: పలుకనివారి నేలపలికించీనె తాను
చలములు మాతోనె సాదించీనా
వలచివచ్చినవారు వాకిటఁ గాచుకున్నారు
అలరి ముచ్చట లందె యాడుమనవే

చ. 2: దగ్గరనివారి నేల దండకుఁ దీసీనె తాను
నిగ్గుల మాతోనె యివి నేర్చుకొనీనా
సిగ్గువడనివా రదె చేసూటినెవున్నవారు
కగ్గులేక గొబ్బుననుఁ గాఁగిలించుమనవే

చ. 3: నగనివారి నదేల నగుమనీనె తాను
పగటులు మాతోనె పచరించీనా
జిగి నన్నుఁ గలసెను శ్రీవెంకటేశుఁడు తాను
మొగముచూచేవారిని మొరఁగు కొమ్మనవే

రేకు: 0296-5 శ్రీరాగం సం: 09-275

పల్లవి: తనకె విన్నవించరె తరవాతి పనులెల్లా
చనవు లిచ్చినవాఁడు చక్కఁ బెట్టనేరఁడా

చ. 1: పొసఁగని సవతులపోరు మాకు నేఁటికె
కొసరుల కెల్లాఁ దానె గురిగాకా
యెసఁగ రమణులను యేలేవాఁడు రమణుఁడే
దొసఁగువారికి బుద్ధులు చెప్పనేరఁడా

చ. 2: వాడవనితలతోడి వంతులు మాకేఁటికె
యీాడు వెట్టుకొని దూరే దితనిఁగాకా
జాడతో నడుపేవాఁడు సతులకు నాయకుఁడే
పాడిపంతము యేరుపరచఁ దా నేరఁడా

చ. 3: కన్నవారితోడ మాకు కాఁతాళించ నేఁటికె
యిన్నినడప శ్రీవెంకటేశుఁడెకాకా
మన్నించి నన్నుఁ గలసె మరి వారికి నాతఁడె
కన్నెల నందరిని వొక్కటి సేయనేరఁడా

రేకు: 0296-6 కేదారగౌళ సం: 09-276

పల్లవి: తలఁచిన తలఁపులు దలకూడె
వెలుపలె లోపల వెర గిఁకనేలే

చ. 1: వలచిన వలపులు వడ్డికిఁ బారీ
తలుపు దెరవవే తరుణి యిఁక
పిలువక వచ్చెను ప్రియుఁడు వాకిటికి
నిలువుల బిగువులు నీ కిఁకనేలే

చ. 2: ముసి ముసి నగవులు మోవులనుండఁగ
ముసుగిడనేలే ముదిత యిఁక
రసములు గురిసీ రమణుఁడు నీతో
దొసఁగుల సుద్దులు తుద నిఁకనేలే

చ. 3: కరఁగిన చెమటలు కాఁగిట నున్నవి
నిరతి మరఁగేలే నెలఁత యిఁక
యిరవుగ శ్రీవెంకటేశుఁడు గూడెను
ధర లోఁగొంటివి తడఁబాటేలే

రేకు: 0297-1 గౌళ సం: 09-277

పల్లవి: ఎట్టుండెనో నీభాగ్య మేనోము నోచెనో ఆకె
గుట్టుతోనె నీవలపు కొల్లగొనెఁ గదరా

చ. 1: నీటున వయ్యాళి వోయి నీవురాగా నదె చెలి
కోటకొమ్మ నొరగుండి గొబ్బునఁ జూచి
గాఁటపుఁ జన్నులు గొంత గానరాఁగాఁ జూపి మోపి
మాటలాడి యాపె నీమనసు గరఁచెఁగా

చ. 2: యేనుగ పై నిలుచుండి యింతికిఁ జెయిచాఁచఁగాని
న్నానించి యెక్కించి తనఅండకుఁ దీసి
మేను మేను గాఁగిలించి మెచ్చి మెచ్చి తనయింటి
లోనికిఁ బిలించి నిన్ను లోలునిఁగాఁ జేసెఁగా

చ. 3: వాకిటికి నీవురాఁగా వనిత సన్నలుసేసి
చేకొని నన్నిటు గని శ్రీవెంకటేశ
యీకొలఁదులను మన మిద్దరముఁ గూడితిమి
నీకు నాకుఁ దాఁ జుట్టమై నేరుపున నవ్వెఁగా

రేకు: 0297-2 బౌళి సం: 09-278

పల్లవి: విన్నమాట యిదెసుమ్మీ వెల్లవిరిగా నేము
నిన్నటి మొన్నటి సుద్దినె మరియెఱఁగము

చ. 1: శిరసునెరులు నీవు చిక్కు దియ్యఁగా విభుఁడు
కరఁగి నీమోము చూచి క గ్గీరుపఁగా
తెరవేసిరి చెలులు దిష్టముగా నంతలోనె
సరసపు మీసుద్దు లచ్చట మే మెఱఁగము

చ. 2: మేనిగందమటు నీవు మెల్లనె నలఁచగాను
మోనాన నాతఁడు నీకు మోవియియ్యఁగా
పూని వూడిగేలవారు పొంచి వాకిటనుండిరి
మేనులుసోఁకినరతి మీఁద నే మెఱఁగము

చ. 3: పమ్మినచెమట నీవు పయ్యెదఁ దుడువఁగాను
కమ్మి శ్రీవెంకటేశుఁడు కాఁగిలించఁగా
చిమ్ములఁ గొలువువారు సిగ్గున లోనికేఁగిరి
దొమ్మిగా నేఁ గూడితి మీతుద నే మెఱఁగము

రేకు: 0297-3 లలిత సం: 09-279

పల్లవి: రంతుశాయ కిఁకరావయ్య
కొంత గొంత యిటుగూచుండవయ్యా

చ. 1: ముచ్చటదీరక మోము చూచితే
అచ్చట లోఁగే వదేమయ్యా
చెచ్చెర నీమీఁదఁ జేయని కోపము
కొచ్చెటు గడించుకోనేలయ్యా

చ. 2: చనవున నేఁ జేయి చాఁచిన యపుడే
అనయముఁ బెనఁగే వదేమయ్యా
తనియుచు నాలోఁ దలఁచని తలఁపులు
నినుపున నూహించ నీ కేలయ్యా

చ. 3: తమకంబున నే దగ్గరి కొసరఁగ
భ్రమసిన మాఁటల పనేలయ్యా
అమరఁగ శ్రీవెంకటాధిప కూడితి
చెమరించితివిఁక చింతేలయ్యా

రేకు: 0297-4 ముఖారి సం: 09-280

పల్లవి: ఏడలేని మొగమాట యిపుడుగలిగె నీకు
తోడ నిందాఁకా మమ్ము దూరు మని యంటివి

చ. 1: తలఁచఁగానె వచ్చె తరుణి నీ రమణుఁడు
అలసి సొలసి నీవెఆడవె మాట
అలుక దేరిచే నంటా అండనే కూచున్నవాఁడు
చెలరేఁగి యేమైనఁ జేయవే చేఁత

చ. 2: అడిగే నే ననఁగానె అరగొరలెల్లఁ దేర్చె
కడమలుమాని నవ్వఁ గదవె యిఁక
వొడలు నొడలు సోఁక నొద్దికై యాతఁ డున్నాఁడు
యెడయ కాతని భ్రమయించవే నేఁడు

చ. 3: కరగించే ననఁగానె కాఁగిటఁ గూడి చొక్కె
యెరవులేక చన వియ్యవే నీవు
యిరవై శ్రీవెంకటేశుఁ డిన్నిటా నీ సొమ్మాయ
నురముపై నొరపుగనుండవే కాఁపురము

రేకు: 0297-5 కాంబోది సం: 09-281

పల్లవి: ఇదియౌనె నీమాట యియ్యకొంటి నిఁకను
సుదతిరో మీ రిట్టె చుట్టములై వుండరే

చ. 1: కమలాక్షుఁ డాతఁడు కలువకంటిని నేను
తమిఁ గూట మిద్దరికిఁ దగులు టెట్టే
జమళి నందుకొరకె చందసూర్యులకన్నుల
నమరివున్నాఁడు గదె అదివో రమణుఁడు

చ. 2: బింబాధరుఁ డాతఁడు పికవాణిని నేను
యింబడర నిద్దరికి నేఁటిపొందులే
వంబులేక అందుకెపో వైపుగ మాధవుఁడనే
పంబిన పేరుధరించెఁ బక్కన నీవిభుఁడు

చ. 3: తాను కౌస్తుభవక్షుఁడు తగు నే లతాంగిని
యీనెలవులఁ గూడితి మెటువంటిదే
పూని శ్రీవెంకటేశుఁడు పాసఁగె నీమేరలకె
కానవచ్చె నిన్నిటాను ఘనుఁడె నీమగఁడు

రేకు: 0297-6 సామంతం సం: 09-282

పల్లవి: ఏఁటికె యిందరూ నన్నియెరిఁగిన పనులకు
నాటకములు నాతోను నడపఁగవలెనా

చ. 1: దవ్వులనున్న కోపము దగ్గరినప్పుడులేదు
యివ్వలనుండి విభుని నేల తిట్టేవె
చివ్వన నాతఁడువచ్చి చేయివట్టి తీసితేను
నవ్వకుండఁ గలవా నే నవ్వుదుఁ బో అపుడు

చ. 2: ముంగిటఁ బెట్టిన వొట్టు మూలకుఁ బోతేలేదు
యింగితానఁ బతినేల యెత్తిపెట్టేవె
వుంగిటినాతఁడు నీతో నొడివట్టి పెనఁగితే
నంగవించవా నే ని న్నాడుదుఁ బో అపుడు

చ. 3: కనుబొమ్మ యీజంకెలు కాఁగిటిలోనికిలేదు
యెనసె శ్రీవెంకటేశు నేల దూరేవె
ఘనుఁ డాతఁడిదె నిన్నుఁ గరఁగించి కొసరితే
చనవీకుందువా ని న్నెచ్చరింతుఁ బో అపుడు

రేకు: 0298-1 శ్రీరాగం సం: 09-283

పల్లవి: నీ కేమిటఁగడమ నీచేతిలో వాఁడతఁడు
మైకొని నీయడఁ జేసే మన్నన యెరఁగవా

చ. 1: ఆరీతి మాటాడఁగా నిన్నోఁ గాదనరాదు గాక
కూరిమి నీపతి యిచ్చకుఁడెకాఁడా
మేరలు మీరినచోట మెప్పించరాదుగాక
యీరాని చనవు లాతఁ డిచ్చుట యెరఁగవా

చ. 2: కాఁతాళించివున్నవేళ కై కొలుపరాదుగాక
చేఁతల నీచెప్పినట్టు సేయఁడా తొల్లి
మోఁతతోఁ దలవంచఁగా మొగి నవ్వరాదుగాక
బాఁతిపడి యతఁడు చేపట్టుట యెరఁగవా

చ. 3: తప్పకచూడఁగా నిన్ను తలపించరాదుగాక
యెప్పుడూ శ్రీవెంకటేశుఁ డిరవెకాఁడా
నెప్పునఁ దలవంచఁగా నేర మెంచరాదుగాక
కుప్పలుఁ దెప్పలుగాఁగ కూడుట యెరఁగవా

రేకు: 0298-2 రామక్రియ సం: 09-284

పల్లవి: ఏల మమ్ముౘేఁచేవు యింతఅట్టు మా కేఁటికి
మేలు మీఁదనుండరాదా మెప్పించేఁగాని

చ. 1: మాయదారిమాటలేల మరఁగుననున్న యాపె
చాయల నీ మోహపు సతిగాదా
తీయరాదా నీచేతనె తెరమరఁ గించుకంతా
చేయిచాఁచి నీ కన్నియుఁ జెప్పి చూపేఁగాని

చ. 2: యీడుగాని యానలేల యింటిలోన నున్న యాపె
జోడుగ నీ ప్రాణమైన సుదతిగాదా
యేడసుద్ది గడియ దీయించరాదా నేఁ జూచి
యీడనె పేరుఁ బెంపు నీ కెత్తియిచ్చేఁగాని

చ. 3: సారెకు నవ్వులేల పచ్చడములోనున్న యాపె
కూరిమి నీ కొత్తపండ్లికూఁతురుగాదా
చేర నా కెదురువచ్చి శ్రీవెంకటేశ కూడితి
వూరకుండరాదా నీకు వొప్పగించేఁగాని

రేకు: 0298-3 పాడి సం: 09-285

పల్లవి: ఇంకనేలరావయ్యా యిద్దరము నిద్దరమే
సంకెదేఁరె బనులెల్ల రికి బేసాయను

చ. 1: కన్నుల నే నవ్వితిని కాఁకలు పైఁ జల్లితిని
చన్నుల నొత్తితి నిన్ను సారె సారెకు
పన్ని నన్నుఁ దిట్టితివి పక్కన జంకించితివి
సన్నలఁ గొసరితివి సరికి బేసాయను

చ. 2: మారుమాట లాడితిని మనసెల్ల సోదించితి
మేరమీరఁ జెనకితి మీఁద మీఁదను
తేరకొనఁ జూచితివి తెక్కులఁ జేకొంటివి
సారెఁ గొంగుదీసితివి సరికి బేసాయను

చ. 3: లాగులెల్లఁ జూపితిని లంకెలతోఁ బెనఁగితి
చేగదేరఁ గూడితిని శ్రీవెంకటేశ
బాగుగా మన్నించితివి పంతమెల్లా నిచ్చితివి
సాగిన సబలలోన సరికి బేసాయను

రేకు: 0298-4 హిందోళవసంతం సం: 09-286

పల్లవి: ఆతఁడు సేసేచేఁత కవిసరిదాఁకితేను
యీతల నే నిందరిలో నిది వెంగెమాడుటా

చ. 1: దగ్గరి యాతనెదుట తలచిక్కు దీసుకొంటే
వెగ్గళించి నేఁ బతిని వెంగెమాడుటా
సిగ్గుతోడ సురటిని చెమట విసరుకొంటే
అగ్గలముగా నప్పటి నది వెంగెమాడుటా

చ. 2: తఱి నితనియెదుట తమ్ముల ముమిసితేను
వెఱవక నే నిప్పుడు వెంగెమాడుటా
నెఱవుగ నామేని నీడలు చూచుకొంటే
అఱిముఱిఁ దనుఁ జూచి అది వెంగెమాడుటా

చ. 3: చిలుకనుఁ బేరుకొని శ్రీరామ రామ యంటే
వెలయఁగ నే నింతలో వెంగెమాడుటా
యెలమి శ్రీవెంకటేశుఁ డిందులకె నన్నుఁ గూడె
అలమి మోముచూచితే నది వెంగెమాడుటా

రేకు: 0298-5 ఆహిరి సం: 09-287

పల్లవి: కూళతనమున నిన్నుఁ గొసరే మింతెకాక
జాలి మావలపు నీకుఁ జవులయ్యీనా

చ. 1: తేలింపుఁ గన్నుల యాపె తీపులమాటల యాపె
లోలునిఁగాఁ జేసె నిన్ను లోక మెరఁగ
మాలుగొని వున్నాఁడవు మదమెత్తివున్నాఁడవు
ఆలరి మావిన్నపము లాలకించేవా

చ. 2: సెలవినవ్వుల యాపె చేఁతలకలికి యాపె
బలిమి నీ మనసెల్లా భ్రమఁ బెట్టెను
చెలరేఁగి వున్నాఁడవు సిగ్గువిడిచున్నాఁడవు
అలరి మావంక యించుకంతైనాఁ జూచేవా

చ. 3: కన్నుల మొక్కుల యాపె గయ్యాళితనము లాపె
సన్నలుసేసి నిన్ను జట్టిగొనెను
నన్నుఁ గూడి శ్రీవెంకటనాయక మించినాఁడవు
పన్నిన నీవయసు ఆపఁగఁగలవా

రేకు: 0296-6 భైరవి సం: 09-288

పల్లవి: కదిసితి రిద్దరును కన్నులపండుగగాను
పెదవుల తేనెలనే పిక్కటిల్లీఁ బ్రేమము

చ. 1: పలుకుల కొదలుతో పయ్యెద వదలుతోడ
చెలి నీపై వలపులు చిందఁ జొచ్చెను
అలుగకు నీవంత ఆయములు రేఁగీని
చలపట్టి వోరిచితే చక్కనయ్యీఁ బనులు

చ. 2: కొప్పుజారు విరులతో కులుకుఁ జూపులతోడ
చిప్పిలు నాసలు నీపైఁ జిందఁ జొచ్చెను
వుప్పటించ కంత నీవు వొడలెల్లఁ బులకించి
తొప్పఁదోగి నవ్వితేనె తుదకెక్కీఁ రతులు

చ. 3: కూరిమి మొక్కులతోడ కొనగోరి తాకులతో
సారెకు సిగ్గులు నీపైఁ జల్ల జొచ్చెను
పేరడిఁ బెట్టకు మంత ప్రేమపు శ్రీవెంకటేశ
యీరీతిఁ గూడితి వింకనిరవయ్యీ మెచ్చులు

రేకు: 0299-1 ముఖారి సం: 09-289

పల్లవి: చదురాల నేను జాణఁడవు నీవు
తుది మొదల లెంచితేను దొమ్మిగాదా

చ. 1: మనసు నెరుఁగుదు మర్మము నెరుఁగుదును
ననుఁజూచి నీవింత నవ్వవలెనా
పనులెల్లాఁ దక్కెను పంతము తుద కెక్కెను
పెనఁగఁబోతే నింక పిప్పి గాదా

చ. 2: పలుకఁగ నేరుతును భ్రమయించ నేరుతును
యెలమి నాతో నింత యెమ్మెవలెనా
తలఁపు లీడేరెను తమకము దైవారెను
చలపట్టితే నింక చప్పఁ గాదా

చ. 3: పట్టెమంచ మెక్కితిని బలువావి చేకొంటిని
మెట్టుక నాతో నింత మెచ్చవలెనా
అట్టె శ్రీవెంకటేశుఁ డలమేలుమంగ నేను
గుట్టుతో నుండితే నింక కొసరుగాదా

రేకు: 0299-2 దేసాళం సం: 09-290

పల్లవి: ఎవ్వరింక సరినీకు నేమిటికిని
యివ్వలను నవ్వలను నిద్దరికె తగును

చ. 1: చూపులనె భ్రమయించె సుదతి తనకెమ్మోవి
తీపులనె తేలించె దిష్టముగను
రూపుననె మరిగించి రుచులుగొనె నీవలపు
యీపనులు నేఁడు మీకిద్దరికె తగును

చ. 2: ఆసలనెతమిరేఁచె నతివ దనచిరునవ్వు
మోసులనె మొలపించె మోహమెల్ల
బాసలనె నీచేతి పంతంబు దక్కఁగొనె
యీసుద్దులెల్ల మీయిద్దరికె తగును

చ. 3: అంకెలరతుల గెలిచె నలమేలుమంగ దన
లంకెలనుఁగూడి నిను లాలించెను
వుంకువలు శ్రీవెంకటోత్తముఁడ నీ కొసఁగె
యింకా నిట్ల మీకు నిద్దరికె తగును

రేకు: 0299-3 రామక్రియ సం: 09-291

పల్లవి: దూరుదురు మమ్మును బుద్దులు చెప్పరంటాను
యీరీతి నింతలోనె యిటువలెఁ జూతురా

చ. 1: చిత్తములో చింతలేలె సిగ్గులు వడఁగనేలె
కొత్తపండ్లికూఁతురవాకొమ్మ నీవు
చిత్తిణిగుణమాతఁడు సెలవుల నవ్వుతోడ
పొత్తుకుఁ బిలువఁగాను బొమ్మల జంకింతురా

చ. 2: కన్నుల మొరఁగులేలె కడు నివ్వెరగులేలె
కన్నెపడుచవాయేమె కలికి నీవు
వెన్నవంటివాఁ డతఁడు వేడుకఁ గొంగు వట్టఁగా
సన్నలతిట్లతోడ చలము సాధింతురా

చ. 3: వుసురన నీఁకనేలె వొగిఁ దలవంచనేలె
పసిబాలవాయేమె పడఁతి నేఁడు
అసుదు శ్రీవెంకటేశుఁ డలమేల్ మంగ నీవు
పొసఁగ నాతఁడు గూడి పూఁచి కొసరుదురా

రేకు: 0299-4 ఆహిరి సం: 09-292

పల్లవి: వట్టిచనవులంబోతే వాసిగలదా
నెట్టన నీకు మొక్కితే నీవె మెచ్చేవూ

చ. 1: మన్ననగలకాంతలు మాటలాడఁ జెల్లుఁగాక
వున్నవారు మాటాడితే నొద్దికలౌనా
విన్నా విననియట్టు కన్నాఁ గననియట్టు
సన్నల మెలఁగితేనె జాణతనముగాకా

చ. 2: ననుపు గలుగువారు నవ్వినా నమరుఁగాక
వనితలెల్లా నవ్వితే వాడికలౌనా
పెనఁగినాఁ బెనఁగక బిగిసినా బిగియక
మనసులో మెలఁగుటే మంచిదిగాకా

చ. 3: అలమేలుమంగను నే నంటిముట్టఁ జెల్లుఁగాక
వెలుపలివా రంటితే వేడుకలౌనా
నెలవై శ్రీవెంకటేశ నీవు నన్నుఁ గూడితివి
బలిమి మెరయుటే పంతముగాకా

రేకు: 0299-5 హిందోళవసంతం సం: 09-293

పల్లవి: అమ్మవారు నయ్యవారు నండనె కూచున్నవారు
యిమ్ముల నిద్దర జాణ లేమందమే

చ. 1: కొల్లున నవ్వీ నతఁడు గుట్టున నున్నది యాకె
తెల్లవారుదాఁకా మాఁటదిద్దనె పట్టె
పల్లద మాతనివంక పంతము లీచెలివంక
యిల్లిదె యిద్దరూ సరె యేమందమే

చ. 2: తొక్కుఁ బాదము లతఁడు తొరలి పెనఁగు నీకె
చెక్కులు నొక్కి బుద్దులు చెప్పనె పట్టె
మొక్కల మాతనిపాలు మురిపె మీసతిపాలు
యెక్కుఁజల మిద్దరికి నేమందమే

చ. 3: చేతులు చాఁచు నతఁడు సిగ్గుననుండు నీకె
యీతల విడె లిద్దరి కియ్యనె పట్టె
ఆతఁడు శ్రీవెంకటేశుఁ డలమేలుమంగయింతి
యేతుల నిద్దరూఁ గూడి రేమందమే

రేకు: 0299-6 పాడి సం: 09-294

పల్లవి: వేసరివున్నారు తొల్లె వెలఁదులిందరు నీతో
వీసమంతపనికైనా వీఁగింతురు సుమ్మీ

చ. 1: నీవు మోహించినసతి నిన్నేమనినాఁ జెల్లు
ఆవటించి నీ వాపె నేమనినాఁ జెల్లు
పూవుఁగాక పిందెఁగాక పోదిఁ బెట్టుకున్నవారి
దీవెనమాటలాడినాఁ దిట్టుదురు సుమ్మీ

చ. 2: చనవుగలుగుయింతి జంకించ నిన్నుఁదగు
చెనకి నీవాపె నేమిసేసినాఁ దగు
ననిచియు ననచక నవ్వుకె లోనైనవారిఁ
దనువులు నిమిరినాఁ దట్టింతురు సుమ్మీ

చ. 3: పట్టపు అలమేల్‌మంగ పై కొంటివి నీమెచ్చు
గుట్టు శ్రీవెంకటేశ నీకూటమి మెచ్చు
అట్టుగా నాపెచేత నాఅడిఁబడ్డయట్టివారిఁ
బట్టి బలిమిఁ గూడితి పంగింతురు సుమ్మీ

రేకు: 0300-1 మంగళకౌశిక సం: 09-295

పల్లవి: ఇద్దరూ నవ్వుతా నున్నా రింతటిలోనె
యెద్దుబండికంటి సంది యేమాయనయ్య

చ. 1: చెంగలువబంతి వేసె సేయరాని చేఁత సేసె
ముంగురులు పట్టి తీసె మొదలఁ జెలి
అంగనయింటిలో కేఁగి తటమీఁది సుద్దెరఁగ
యింగితపు మీవాదు లేమాయనయ్యా

చ. 2: కన్నులఁ దప్పక తిట్టె గక్కన నీచేయి వట్టె
చన్నులు రొమ్మునఁ బెట్టె సాధించె నిన్ను
యెన్నికఁ దెరవేసితి వేమిసేసితో యెరఁగ
యిన్నేసి మీ పంతములు యేమాయనయ్యా

చ. 3: కప్పురము నోటికిచ్చె కాఁగిలించి నిన్నుమెచ్చె
అప్పుడె శ్రీవెంకటేశ అలమేల్మంగ
దప్పిదేరితి వాపెతో తగ నన్ను మన్నించితి
యిప్పుడు మీ యెన్నికలు యేమాయనయ్యా

రేకు: 0300-2 శ్రీరాగం సం: 09-296

పల్లవి: మనసు మెత్తనిదాన మరిగినదాన నీకు
చనవు చేకొన్నదాన సమ్మతించవయ్యా

చ. 1: మొక్కలానఁ గోపగించి మోము చూడకుందుఁ గాని
తక్కక నీరూపు నాతలఁపులోనెవుండు
చిక్కక ఆవేళ నీచిత్త మెట్టుండునో యని
మొక్కెద నిదివో నీకు మొగిఁజేకోవయ్యా

చ. 2: చెప్పుడు వారి మాఁటకు చింతతోడనుందుఁగాని
యెప్పుడూ నీరాకకు నెదురు గాచుకుండుదు
కుప్పించి నాఘాత కెంతకొంకుచునుందువో నీవు
చెప్పి యందుకె సేవసేసేఁ జూడవయ్యా

చ. 3: వచ్చిన వూఁకున నిన్ను వడిఁ దమకింతుఁగాని
యిచ్చకురాలనే నీకు నిటు నేను
అచ్చపు శ్రీవెంకటేశ అలమేలుమంగను
మచ్చికఁ గూడితి నిఁక మన్నించవయ్యా

రేకు: 0300-3 దేసాళం సం: 09-297

పల్లవి: అంగమెల్లఁ జెమరించె నమ్మఁగారికి
అంగజరసములుబ్బీ నయ్యఁగారికి

చ. 1: చెక్కునఁబెట్టిన చేయి సెలవి నవ్విన నవ్వు
అక్కజమై తోఁచీ నదె అమ్మఁగారికి
చిక్కని మోముకళలు చెయివట్టి పెనఁగేటి
అక్కరవేడుకనిండె నయ్యఁగారికి

చ. 2: సరుస కంబముమాఁటు సమరతితోడు చూపు
అరుదుగఁ జిమ్మిరేఁగె నమ్మఁగారికి
తొరలనాడినమాట తొడమీఁదనింతిఁ బె ట్టి
అరమరపులు నిండె నయ్యఁగారికి

చ. 3: మంచముపై సరసాలు మర్మముపై మంతనాలు
అంచుమోచె నెదుటనె అమ్మఁగారికి
కొంచక అలమేల్మంగఁ గూడినట్టి గురుతిదె
అంచ శ్రీవెంకటగిరి అయ్యఁగారికి

రేకు: 0300-4 సామంతం సం: 09-298

పల్లవి: మాయింటికి విచ్చేసిన మన్నన యిది చాలదా
యేయెడనుండివచ్చిన నెరవుసే సేమా

చ. 1: కప్పురపుఁ జూపులు ఆకాంత నీపైఁ జల్లఁగాను
వుప్పతిల్ల వెన్నెల నవ్వులు చల్లేవు
చప్పుడుసేయక యింకఁ జల్లఁగా బదుకరయ్య
యెప్పుడు నీవారమె నే మెరవుసేసేమా

చ. 2: వేడుకమాటల నాపె విందునీకుఁ బెట్టఁగాను
యీడనె వలపుసొమ్ము లియ్యఁ జూచేవు
యీడుజోడుగూడుక మీరిద్దరు బదుకరయ్య
యేడసుద్ది మిమ్ము నేము యెరవుసేసేమా

చ. 3: అలమేలుమంగ నీకు నాసలుగానుకియ్యఁగ
కలిమి శ్రీవెంకటేశ కప్ప మిచ్చేవు
మెలఁగి వొకరొకరు మీ రిట్టె బదుకరయ్య
యెలమి నన్నుఁ గూడితి వెరవుసేసేమా

రేకు: 0300-5 గౌళ సం: 09-299

పల్లవి: అంగనకు నీవె అఖిలసామ్రాజ్యము
శ్రింగారరాయఁడ నీకు శ్రీపతినిధానము

చ. 1: కమలాలపానుపు కాంతకు నీవురము
ప్రమదపు నీమనసు పాలజలధి
అమరు నీభుజాంతర మట్టె తీగెపొదరిల్లు
రమణీయ హారాలు రత్నాలమేడలు

చ. 2: సతికి నీమెడ రతిసాముసేసేకంబము
ప్రతిలేని వయ్యాళి బయలు నీవు
మతించిన కౌస్తుభమణి నిలువుటద్దము
మితిలేని శ్రీవత్సము మించు బండారుముద్ర

చ. 3: నెమ్మి నలమేల్మంగ నీ కాఁగిలి పెండ్లిపీఁట
చిమ్ముల చందనచర్చ సేసపాలు
వుమ్మడి మెడనూళ్ళు వుయ్యాలసరపణులు
పమ్మి శ్రీవెంకటేశ నీభావమే భోగము

రేకు: 0300-6 సాళంగనాట సం: 09-300

పల్లవి: అలుగకువమ్మ నీ వాతనితో నెన్నఁడును
పలువేడుకలతోనె పాయకుండరమ్మా

చ. 1: జలధిఁ దపము సేసె సాధించెఁ బాతాళము
నెలఁత నీరమణుఁడు నీకుఁగానె
యిలవెల్లా హారించె నెనసెఁ గొండగుహల
యెలమి నిన్నిటాను నీకితవుగానె

చ. 2: బాలబొమ్మచారై యుండెపగలెల్లా సాధించె
నీలీలలు దలఁచి నీకుఁగానె
తాలిమి వ్రతమువట్టి ధర్మముతోఁ గూడుండె
పాలించి నీవుచెప్పిన పనికిఁగానె

చ. 3: యెగ్గు సిగ్గుఁ జూడఁడాయె యెక్కెను శిలాతలము
నిగ్గుల నన్నిటా మించె నీకుఁగానె
అగ్గలపు శ్రీవెంకటాద్రీశుఁడై నిలిచె
వొగ్గి నిన్నురాన మోచివుండుటకుఁ గానె